"ఓం శ్రీ పరమాత్మనే నమః"

# శ్రీ రమణ భాషణములు

మూలం - ఇంగ్లీష్ శ్రీరమణానంద సరస్వతి (మునగాల వేంకట్రామయ్య)
తెలుగు సేత రామచంద్ర కౌండిన్య
సరళ సరళి, పరిష్కరణ సుధీర్

శ్రీరమణాశ్రమము తిరువణ్ణామలై 606 603

## ప్రచురణకర్త మాట

సరళీకరణ: శ్రీరమణాశ్రమ తెలుగు ప్రచురణలలో శ్రీరమణాశ్రమ లేఖలు, శ్రీరమణ భాషణములు అనే రెండు గ్రంథాలు శ్రీరమణ తత్త్వాన్ని దర్శింపచేసే నేత్రద్వయం, రెండు కళ్ళు. రమణుల తత్త్వం భక్తిజ్ఞానాల సరస సమ్మేళనం. అవి ఒకదాన్ని విడిచి ఒకటి విడిగా ఉండలేవు- 'తల్లిపాలు- కమ్మదనం'లా, 'సముద్రజలం - ఉప్పు'లా! 'లేఖలు' భక్తిగంగను ప్రవహిస్తే, 'భాషణాలు' జ్ఞానగంగను స్రవిస్తుంది. భాషణాలను 1935-39 నాలుగు సంవత్సరాల పాటు శ్రీభగవాన్ సరసజ్ఞాన సన్నిధిలో జరిగిన సంభాషణలు, సంఘటనలను యథాతథంగా కాలమాన సహితంగా పొందుపరచి జ్ఞానయజ్ఞాన్ని నిర్వహించారు రమణాంకిత భక్తులైన బ్రహ్మశ్రీ మునగాల వేంకటరామయ్య గారు. ఈనాడు రమణుల సంభాషణ వైభవాన్ని అశేషభక్త జనవాహిని ఆస్వాదించ గలుగుతున్నారంటే అది శ్రీ వేంకటరామయ్యగారి అకుంఠిత దీక్షా సమర్పణల ఫలితమే. వారు తమ రచనను ఇంగ్లీష్ చేయగా, దీనిని తెలుగులోకి అనువాదం చేసింది వారి అల్లుడు, రమణ భక్తులు, కవి అయిన శ్రీ రామచంద్ర కౌండిన్యగారు. ఇది జరిగి కూడా నాలుగు దశాబ్దాలయింది.

కాలానుగుణంగా భాషాపోకడలలో వస్తున్న పరిణామాలను దృష్టిలో పెట్టుకొని తెలుగులో అనువాద గ్రంథాన్ని కొంత పరిష్కరించుకొనే అవసరం ఏర్పడింది. చాలామంది భక్తులు చిరకాలంగా చేస్తున్న అభ్యర్థన కూడా ఇదే. శ్రీరమణ గ్రంథావళిలోని భాషను నేటితరానికి అన్వయించేలా సరళం చేయమని. ఈ కృషిలో భాగంగా ఇప్పటికే శ్రీరమణలీల, అరుణాచల మాహాత్మ్యం, నేనెవడను గ్రంథాల భాషను కొంతవరకు సరళీకరణ చేయించడం జరిగింది. "భాషణములు" మూలం ఆంగ్లం. ఆంగ్లమూలమును ఆధారంగా చేసుకొని తెలుగు అనువాదమును పరశీలించగా చాలాచోట్ల మార్పులు చేయవలసిన ఆవశ్యకత కనబడింది. అందువలన భాషణములను ఆంగ్ల మూలాన్ని ఆధారంగా చేసుకొని పరిష్కరించడం జరిగింది. ప్రస్తుతం రమణభాషణలు కూడా సరళం చేయబడి కనులకు ఇంపైన, మనసును అలరించే సులభశైలిలో దర్శనమిస్తోంది ప్రప్రథమంగా.

సుధీర్ అనే భక్తరత్నానిధి. సుధీర్, రామకృష్ణమఠం, ఋషీకేష్లలో సంస్కృత, వేదాంత అధ్యయనాలు చెయ్యడం, చక్కటి పాండిత్యం, భాషాపోకడల పరిజ్ఞానం కల సుధీర్చేత శ్రీరమణ భగవాన్ ఈ సత్కార్యాన్ని చేయించుకున్నారు.

సాహితీవేత్తలైన విజ్ఞాన సంపన్నులు ఈ గ్రంథాన్ని విమర్శగా చదివి, తగిన, అవసరమైన సూచనలు చేస్తే తప్పక పరిశీలించి స్వీకరించగలము.

వి. ఎస్. రమణన్
ప్రెసిడెంట్
శ్రీ రమణాశ్రమము.

# మనవి

జీవితం క్లిష్టమూ, క్లేశభూయిష్టమూ అయిన తరుణంలో భక్తివినీతుడు ఒకడు మనశ్శాంతికై శ్రీభగవాన్ సన్నిధి చేరాడు. సర్వాధికారి శ్రీనిరంజనానంద స్వాముల సాదర అనుమతిపై ఆశ్రమవాసి అయ్యాడు. సద్గురువుల వాక్కులు పావన మధురములు; కనువిప్పు కలిగించాయి. వాటిని అవకాశం దొరికినప్పుడల్లా ఈ సాధకుడు పదిలపరిచే పనికి పూనుకున్నాడు. తనపైన ఈ భారం వేసుకొనుటకు ప్రయోజనం (1) మనశ్శుద్ధి, 2) సూక్ష్మములు, అర్థగంభీరములైన శ్రీభగవాన్ పలుకుల స్పష్టమైన అవగాహనము. కాలం జరుగగా, ఈ రచనలను సాధికరంగా సర్వాధికారి ఆశ్రమపరం చేసుకొన్నారు. ఈ సంకలనములు 1935-39 సంవత్సరములవి. సాధనాపరులలో కొందరికి ఇవి కొంత అయినా ప్రియములు, హితములు కాగలవని ఆశ.

లేఖకుడు

శ్రీరమణాశ్రమము

# పరిచయము

ఈ సంవాదములు 1935 నుండి 1939 వరకు నాలుగు సంవత్సరాలు నడిచాయి. వీటికి లిఖితరూపం ఇచ్చినవారు శ్రీమునగాల ఎస్. వేంకటరామయ్య (స్వామి శ్రీరమణానంద సరస్వతి), చిరకాలంగా శ్రీరమణ మహర్షి శిష్యులు. జన్మచే తెలుగువారైనా తమిళం, ఇంగ్లీషులో ధారాళంగా మాట్లాడగలరు; సంస్కృతములోను విశేష ప్రజ్ఞ గలవారు. తమ శిష్యులతోటి, తమను దర్శింపవచ్చిన పలువురితోటి శ్రీరమణులు చేసే భాషణలను కూర్చుటకు అర్హతలు ఇంకేమి కావాలి?

పై నాలుగు సంవత్సరాలు ఆశ్రమ మహిమ ఆకాశం అంటిన కాలం, మహర్షి ఆరోగ్యం సైతం చక్కగా ఉన్నది అనవచ్చును. వారు కూర్చున్న హాలు తలుపులు దర్శనార్థులు అందరికై రేయింబవళ్ళు తెరిచే ఉండేవి. ప్రపంచం నలుమూలల నుండి వచ్చి చేరినవారితో హాలు క్రిక్కిరిసి ఉండేది. ఆ కాలంలో తమ జాతీయుడు ఎవరో ఒకరు, ఎప్పుడో ఒకప్పుడు ఇక్కడికి రాని దేశమే ప్రపంచంలో లేదు. యుద్ధ సమయంలో విదేశీయుల సంఖ్య కొంత తగ్గింది కానీ, భారతీయ సందర్శకులు నానాటికీ పెరిగారు. ఈ సంవాదాలలో అధికాధికం పాశ్చాత్యుల తోటివి. కొత్త మత రీతులే ఆధునిక లక్షణములని గర్వించువారికి తగిన పరిష్కర్త ఇక్కడ నెలకొన్నాడు. శ్రీభగవాన్ రవివలె వెలిగిపోయేవారు. వారి మాటలను అంగీకరింపనివారిలో కూడా వారిచే సమ్మోహితులు కానివారు, వారి సన్నిధిని ఉత్తేజితులు కానివారు లేరు.

అర్హతలెన్ని ఉన్నా, శ్రీవేంకటరామయ్య పూనిన పని సులువైనది కాదు. శ్రీభగవాన్ ఏ విషయమైనా దాని లోతుపాతులు తెలిసి మాట్లాడేవారు. ఏ భాషలోనైనా వారికి సరైన పదం స్ఫురించక పోవుటే లేదు. వారి పలుకుల అంతరార్థం గ్రహించడం కష్టం. అందుచేత వినేవారు ఏ పలుకు తప్పినా ఎంతో బాధపడేవారు. అంత శ్రద్ధతోనూ వింటున్న వేంకటరామయ్యగారి లేఖనములు క్లుప్తంగానే వచ్చాయి. సంవాదాలు ఎక్కువగా ఇంగ్లీషులోనే. శ్రీభగవాన్ ఆంగ్ల పత్రికలను చదువగలిగి ఉన్నా, ఆ భాషలో ముక్తసరిగా తప్ప, విపులంగా మాట్లాడడానికి ఇష్టపడరు. అందుచేత వారి పలుకుల అనువాద భారం కూడా విల్లా వేంకటరామయ్యగారికి తప్పని సరైనది. కేవలం లేఖనంకన్నా ఈ అనువాద వ్యవహారం కష్టతరం. ధారావాహికంగా సాగే భగవాన్ భాషణలను ఆతృత గల శ్రోతలకై అనువదించడం వీలయ్యేది కాదు. చాలాసార్లు భగవానున్ను మధ్య మధ్య ఆపమనవలసి వచ్చేది. ఇక దానికి తోడు లేఖనం. ఎంత కష్టమో ఊహించవలసిందే. భగవాన్ పాదాల వద్ద సంవత్సరాల తరబడి శుశ్రూష చేస్తూ వారి తత్త్వసరళిని. ప్రవచనరీతిని పూర్ణంగా అవగాహన చేసుకొన్నవారికే అది సాధ్యం. ఆ పనికి వేంకటరామయ్య గారు పూర్ణ అర్హత గలవారు. వారి ఈ ప్రయత్నం భాగవతుల భాగ్యం.

ఇక్కడ వాడిన భాష అన్నిచోట్ల స్వాదు సుభగం గాదని ఒప్పుకొన్నదే. అలా ఉండాలని ఆశించనూ లేము. నిజమే, దాని అక్కడక్కడ దిద్ది ఉండవచ్చును. కానీ, దాని కమనీయత కుంటుపడునన్న భయంచేత దానిని ఉన్నట్లు ఉంచడమైనది. భాషణలలో కూడా చాలా దక్షిణ భారత భాషలలోనైనా, వాటిని తెలుగు తమిళములలో వ్రాసి ఉన్నా, ఈ గ్రంథంకోసం

వాటిని ఇంగ్లీష్లోకి అనువదించుట జరిగింది. లేఖనములలో చాలావరకు ప్రశ్నించినవారికి చూపి సరి చూడడం జరిగింది. ఎలా అయితే ఏమి, వీటన్నింటికి శ్రీభగవాన్ అంగీకార ముద్ర ఉన్నది. లేఖనములన్నీ ఎప్పటికప్పుడు వారికి చూపి వారి అనుమతినో, సవరణలనో పొందినవే. కావున ఇది అచ్చంగా గురువాణి అనుట నిస్సందేహము. వాటిని చదువుతూ మరల మనం ఆ పాత హాలులో శ్రీభగవాన్ పాదాల వద్ద కూర్చుని, వారి పెదవుల జారు ప్రతి పదాన్ని ఆస్వాదిస్తూ వారి చిరునగవుల, మృదుసుకుమారములగు వారి చేతల చేతుల కదలికల చూస్తూ ముగ్ధులమూ, పరవశులమూ అవుతాము. శ్రీభగవాన్ యథార్థంగా నటరాజు; తాము వర్ణించే గాథలను హృదయంగమం చేయటానికి, వాటి అంతర్యాన్ని బహుభంగుల బహుభంగిమలలో ప్రత్యక్షీకరించేవారు.

ఈ రచన చెప్పిందే మరల మరల చెపుతూ విసుగు పుట్టిస్తుందని కొందరు అనుకోవచ్చు. కానీ, ఈ చర్వితచర్వణం ఉద్దేశ్యపూర్వకమే. సంవాదాల పోలిక ఎంతగా ఉన్నా, శ్రీభగవాన్ సమాధానాల్లో ఏదో క్రొత్త కనిపిస్తూనే ఉంటుంది. ఎన్నిసార్లు చెప్పినా, శ్రీభగవాన్ వివరించినది ముక్తినిచ్చే పారమార్థిక సత్యం ఒక్కటే. "ఉన్నది ఏకైక ఆత్మ: అదితప్ప వేరు లేదు. అది తెలుసుకో, ఇతరం సర్వమూ తెలుస్తుంది." దీనికి కూడా పునరుక్తి ఏమి?
దీని అవగాహన సాధకుణ్ణి సరైన మార్గంలో పెడుతుంది. కానీ, పురోగమనంలో మాత్రం కేవల బుద్ధి గ్రాహ్యమైనా, అది అనుభవవేద్యం కావలసి ఉంది. దేనినిగాని పైపైగాక ఆ మూలం తెలియాలంటే, తాను అది అవ్వాలి. కాకుంటే ఆ ఎరుక లేనట్లే. పైన చెప్పినట్లు మనం ఆత్మకంటే వేరు కాము. కానీ, అజ్ఞానం వలన పరిధులతో, అహంకారంతో తాదాత్మ్యం చెంది ద్రష్టతోగాక దృశ్యంతో మమేకత భావిస్తాము. మనం చేయగలిగినది ఎక్కువ లేదు. ఆ అలవాటు జన్మజన్మాంతరాలుగా మనలో జీర్ణించిపోయింది. అనేక శతాబ్దాలుగా మనస్సు దానిసే కల్పించి మనలను అజ్ఞానంలో పెనవేసింది. తానై కల్పించిన ఈ ఇంద్రజాలం నుండి బయటపడాలనే కోరికనే మనస్సు కోల్పోయింది; అథవా ఉన్నా, అది దుస్సాధ్యమైపోయింది.

శ్రీభగవాన్ ఇలా అంటారు: "నీవు ఆత్మవు. వేరేమీ కావు. ఇతరమంతా భ్రాంతియే. కావున ఇపుడే, ఇక్కడే ఆత్మగా ఉండు. అందుకై అడవుల పట్టనక్కర్లేదు, గదిలో దూరి గడియలు వేసుకోనవసరం లేదు. అనుదిన వ్యవహారాలను ఎప్పటివలెనే చక్కబెట్టుకో. కానీ, కర్తతో తాదాత్మ్యం మానివేయి. ఆత్మ సాక్షి మాత్రమే, అది నీవు."

ఈ భాషణాలలో పైన ప్రవచించినదానికి ఉదాహరణలపై ఉదాహరణలు భిన్న రుచులవారికి, భిన్న యోగ్యతలవారికి అనుగుణంగా ఇచ్చినవి - ఉన్నాయి. ఈ గ్రంథం చదివేవారిని అప్రయత్నంగానే అంతర్ముఖంగా చేసి మూలాన్ని అన్వేషించేలాగ చేస్తుంది. దానిని చదవడమే తగిన సాధన. "నిన్ను నీవు భ్రమ పెట్టుకోకు. ఇప్పటికే నీవా 'తత్.' క్రొత్తగా అది పొందవలసింది కాదు. అసత్య తాదాత్మ్యం తొలగించుకొని, పరిధులు భ్రాంతులే అని గుర్తిస్తే చాలు."

ఈ సాధనా మార్గం అందరు ఎరిగినదే, ఆత్మవిచారము. ఎల్లపుడూ అవిరామంగా, అహంకారపు మూలాన్ని వెదకు. అదే కర్తగా నటిస్తోంది. దానిమూలం కనిపెట్టగలిగావా, అహమిక తనంతతాను అదృశ్యమై, పూర్ణానంద స్వరూపమైన ఆత్మ ఒక్కటే మిగులుతుంది. ఇది శ్రీరమణ బోధసారము.

ఇక చెప్పవలసింది ఏముంది? ప్రతి ఒక్కరు ఈ గ్రంథాన్ని చదివి, అభ్యసించి, దానిని తమ జీవితభాగంగా చేయడమే కర్తవ్యము. ఇందు అక్కరలేని పదంగానీ, వ్యర్థ సంవాదంగానీ లేవు. అచ్చమైన అపరంజి (బంగారం) ఇది. చదివినంతసేపూ అనుకరణకు అసాధ్యములైన బోధలతో, తమ అనుగ్రహ పూర్వకమైన ఆనందమును ప్రసాదిస్తూ శ్రీభగవాన్ మన ఎదుట సాక్షాత్కరిస్తారు.

సాధు అరుణాచల
(మేజర్ ఎ. డబ్ల్యూ. చాడ్విక్)

# అంజలి

'ఆత్మలబ్ధికి మార్గం ఆర్తి' అన్నారు శ్రీభగవాన్. ఇపుడు ఉన్నది చాలదన్న మాట; మరెంతగా పడవలసి ఉన్నదో!

ఆత్మ లభించలేదన్న తలంపు కూడా ఆటంకమేనట! ఆర్తికో, ఆత్మలబ్ధికో తెలియదు.

ఎన్నుకొన్న తలపొక్కటి తప్ప, ఇతరములన్నిటినీ వదలిపెట్టాలి. అన్నిటిని గాకున్నా కొన్నిటినైనా కొంతకాలమైనా తోసివేయుటకే నా ఈ అనువాద యత్నము.

అర్హత, అనర్హతలను ఇందులో చర్చించను. కారణమేదైనా, దీనిని పూనినవారు అర్హులు కారు; అదే నన్ను పూనినది. నన్నయ్య, తిక్కనాదులు భాగవత అనువాదం చేపట్టనిది పోతన్నను అనుగ్రహించుటకట!

తత్త్వశాస్త్రము తెలియదు, పరిభాష తెలియదు; జ్ఞానం అనుమతించదు, అజ్ఞానం ఆపదు. ఏమైనా ఆరంభించాను, వదలిపెట్టుట ఎందుకు?

నా అజ్ఞానం కూడా సరి అయ్యే అవకాశం లేకపోలేదు. భాషణములు తత్త్వసంపన్నములు. వాటి భావాలు మారకుండా ఇందులో కుదురుకొంటే, ఇది చదివిన ఆ కొద్దిమందీ బహువిధముల బహుమానితులు అవుతారు కదా!

ఇందులో వాడిన భాష, పద, వాక్య, వ్యాకరణ లోపములు ఇందులో లేనివి లేవు. కానీ, ఆ పట్టింపులు రచనల పట్ల. ఇవి భాషణములు, వీటి విషయంలో కావు. ఏవైతేనేమి? ఇవి నిర్గుణ భాషణలు; అయినా రమణీయం కాకపోవు.

మరొక రహస్యం. ఈ భాషణల ఆంగ్ల మూలమును కూర్చినవారు శ్రీమునగాల వేంకటరామ్యగారు (స్వామి రమణానంద సరస్వతి) నా మామగారు. ఈయన అనువాదం భగవత్ కైంకర్యంతోపాటు వారిపట్ల మాన్యతను చూపించుట అవుతుంది. శ్రీరమణ భగవనుల అనుగ్రహాన్ని పొందిన నా ధర్మపత్ని కీ.శే. కామాక్షికి ఆత్మతృప్తి అవుతుందనే వెర్రికూడా తోడైంది.

ఈ గ్రంథంలోని అకారాది సూచిక విషయంలో శ్రీరమణ సేవా భాగ్యమును నాతో పంచుకొన్నవారు నా మిత్రులు, సహాధ్యాయి విద్వాన్ శ్రీవేదుల రామచంద్ర కీర్తి, ఎం.ఎ. (ఆ), బి.ఎడ్., గారు. వారికి నా అభివందనములు.

"ఆంగ్లమూల ముద్రణములో ప్రశ్నలకు తేదీల వరుస అక్కడక్కడ పాటింపలేకపోయాము" అన్నారు శ్రీసాధు అరుణాచల. అది ఈ తెలుగులో సరిచూసాను. అటువంటిచోట్ల ఆంగ్ల మూలములోని ప్రశ్నల సంఖ్యను ఇందులో కుండలీకరణల (బ్రాకెట్స్)తో సూచించాను.

"తత్త్వముల్ దెలియని తతత్త్వశాస్త్ర మీవట. దీని అర్థమే"మని శ్రీరమణులు అరుణాచలుని అడిగారు. ఆ ప్రశ్నసే శ్రీరమణులను అడిగామా, 'నీకు నీవు కనుక్కో'మంటారు. అంతే.

శ్రీరమణాశ్రమము
కాళయుక్తి
ఆషాఢ శుద్ధపాడ్యమి రామచంద్ర కౌండిన్య

ఓం నమో భగవతే శ్రీరమణాయ

# రమణ భాషణములు మొదటి సంపుటం

## భాషణములు 1

పరివ్రజనము చేస్తున్న సన్న్యాసి ఒకరు తన సందేహమును తొలగించు కోవడానికి ప్రయత్నము చేస్తూ: "ఈ ప్రపంచమంతా భగవంతుడే అని అనుభవపూర్వకంగా తెలిసికోవడం ఎలా?" అని అడిగారు.

మహర్షి: నీవు నీ దృష్టిని జ్ఞానమయంచేస్తే ఈ ప్రపంచమంతా భగవంతుడే అని గుర్తించ గలవు. పరబ్రహ్మమును తెలిసికోకుండా ఆయన సర్వవ్యాపకత్వాన్ని ఎలా తెలిసికో గలవు?

## భాషణములు 2 .

జ్ఞాన స్వరూపం ఏమిటి అని ఒకరు ప్రశ్నించారు.

మహర్షి: వ్యక్తి ఉన్న స్థితిని అనుసరించి జ్ఞానము ఉంటుంది. అది ఎలా అంటే జాగ్రత్ అవస్థలో వ్యక్తి స్థూల శరీరం స్థూలంగా నామ రూపములను గుర్తిస్తుంది. స్వప్నావస్థలో సూక్ష్మశరీరము మనస్సులో కల్పించబడిన అనేక నామరూపములను గుర్తిస్తుంది. సుషుప్తి అవస్థలో (గాఢనిద్రలో) స్థూల, సూక్ష్మ శరీరాలతో సంబంధము లేకపోవడంచేత ఎటువంటి గుర్తింపూ ఉండదు. అలాగే తురీయావస్థలో వ్యక్తి పరబ్రహ్మముతో తాదాత్మ్యము చెందడంవలన, ఆ వ్యక్తి సృష్టిలోని అన్నింటితోనూ సామరస్యము పొందుతాడు. ఇక తన ఆత్మకు భిన్నంగా ఉన్నది మరి ఏదీలేదు.

## భాషణములు 3

ఆనందం యొక్క స్వరూపము గురించి ఒకరు ప్రశ్నించేరు.

మహర్షి: ఆనందం తనకు బాహ్యముగా ఉన్న కారణాల వలన, తన విషయ సంపదలవలన అని ఎవరైనా అనుకుంటే దానికి అనుగుణంగా అవి పెరిగినపుడు ఆనందం పెరగడం అవి తగ్గినపుడు ఆనందం తగ్గడం జరగాలి. అలాగే వస్తు సంపదలు, ఆస్తిపాస్తులు లేనపుడు ఆ ఆనందం శూన్యమైపోవాలి. కాని మనిషి నిజమైన అనుభవం ఏమిటి? అది ఈ దృక్పథానికి అనుగుణంగా ఉందా?

గాఢనిద్రలో మనిషికి ఆస్తి మొదలైన విషయ సంపదేకాదు, శరీరం కూడా లేదు. అప్పుడు ఆ మనిషి దుఃఖించడానికి బదులుగా చాలా ఆనందంగా ఉన్నాడు. ప్రతి వ్యక్తి గాఢనిద్రను కోరుకుంటాడు. దీని సారాంశము ఏమిటంటే ఆనందం వ్యక్తి స్వభావం, అది బయటి కారణాలవల్ల వచ్చేదికాదు. వ్యక్తి తన ఆత్మసాక్షాత్కారాన్ని తప్పక పొందాలి. ఎందుకంటే, అది కలుషితం కాని పరమానంద బండాగారాన్ని తెరుస్తుంది.

## భాషణములు 4

చదువుకున్న యువకుడొకడు మహర్షిని ప్రశ్నించాడు. "హృదయం ఛాతీలో కుడివైపున అన్నారే, అదెట్లు? ఎడమవైపున అని భౌతిక శాస్త్రజ్ఞులు కనుగొన్నారుకదా. మీ వాదానికి ప్రమాణమేమిటి?

మహర్షి: నీవు చెప్పినట్లే శరీరంలోని అంగముగా అది ఎడమవైపునే ఉంది. అది కాదనడం లేదు. కాని నేను చెప్పేది భౌతికమైన హృదయం కాదు. ఇది ఉన్నది కుడివైపునే! ఇది నా అనుభవం. దానికి ప్రమాణాలు అక్కరలేదు. కాని ప్రమాణాలు లేక పోలేదు.

మలయాళంలో ఆయుర్వేద గ్రంథంలో శ్లోకమొకటి, మరియు "సీతోపనిషత్తు"లోని మంత్రమొకటి దీనిసే సమర్థిస్తున్నాయి అని మహర్షి ఆ శ్లోకాలను చదివి వినిపించారు.

## భాషణములు 5

మోరిస్ఫ్మన్ అను ఒక ఇంజనీరు, "అనుగ్రహం" గూర్చి ప్రస్తావించారు. "సముద్రంలో మునిగే ఉప్పు బొమ్మకు నీటిలో తడవకుండా తొడుగు (water proof) వేసినా రక్షించబడదు." ఈ ఉపమానం ఉచితంగా ఉందని అందరూ సంతోషాన్ని వ్యక్తంచేసేరు. దీనికి భగవాన్ "శరీరమే ఆ తొడుగు" అన్నారు.

## భాషణములు 6

ఒక సన్యాసి: మనస్సు చలించకుండా నిలిపేదెలా?

మహర్షి: నువ్వు నీ ఆత్మను మరచినపుడు విషయ ప్రపంచం కనిపిస్తుంది. నువ్వు నీ ఆత్మగా ఉంటే విషయ ప్రపంచం కనబడదు.

## భాషణములు 7

దక్షిణామూర్తి అష్టకంలోని చివరి శ్లోకములో చెప్పబడినట్లు సర్వశక్తి సంపన్నత్వము (ఈశ్వరత్వము) తోబాటు సిద్ధులను సాధించ వచ్చునా? అని ఒకరు అడిగిరి. దానికి మహర్షి "మొదట సర్వశక్తి సంపన్నత్వము (ఈశ్వరత్వము) సాధించి, తరువాత సిద్ధుల విషయము చూడవచ్చు."

## భాషణములు 8

అక్కడక్కడ సాధారణమైన ధోరణితో ఎంచుకొన్న మంత్రాలను జపిస్తే ఎవరికైనా ఏమైనా లాభం వుంటుందా?

మహర్షి: "ఉండదు. దానికి అర్హతకావాలి. ఉపదేశం పొందిఉండాలి." అంటూ దీనికొక కథ చెప్పారు మహర్షి. ఒక రాజు, తన మంత్రిని చూడడానికి వాని ఇంటికి వెళ్ళాడు. మంత్రి పూజామందిరంలో మంత్రజపం చేసుకుంటున్నారని చెప్పారు. అది పూర్తయే వరకు రాజు వేచి ఉండి, మంత్రిరాగానే ఆ మంత్రమేమిటని రాజు అడిగాడు. అది పరమ పవిత్రమైన గాయత్రి మంత్రమని అన్నాడు మంత్రి. దానిని తనకు ఉపదేశించమని రాజు మంత్రిని కోరాడు. దానికి తగిన శక్తి తనకు లేదన్నాడు మంత్రి. రాజు ఈ మంత్రాన్ని వేరేవారి వద్ద నేర్చుకొని మళ్ళీ మంత్రిని కలిసినపుడు గాయత్రిని చెప్పి తను చేస్తున్నది సరిగా ఉందాలేదా అని ప్రశ్నించాడు. మంత్రమైతే సరిగానే ఉందికాని, దాని గురించి చెప్పే అధికారం తనకు లేదన్నాడు మంత్రి. అది ఎందుకో తెలుప వలసిందిగా రాజు పట్టుబట్టాడు. అప్పుడా మంత్రి దగ్గరే ఉన్న భటుణ్ణి పిలిచి, రాజుని బంధించ వలసిందిగా ఆజ్ఞాపించాడు. భటుడు మంత్రి ఆజ్ఞను పట్టించుకోలేదు. ఎన్ని మారులు మంత్రి భటుణ్ణి ఆజ్ఞాపించినా భటుడు పట్టించుకోలేదు, సరికదా రాజుకు కోపం మాత్రం కల్గింది. మంత్రిని బంధించమని రాజు ఆజ్ఞాపించాడు. తక్షణమే ఆ ఆజ్ఞను భటుడు అమలుచేసాడు. మంత్రి పకపకా నవ్వనారంభించాడు. రాజు అడిగిన దానికి వివరణ అదే అని మంత్రి చెప్పాడు. "ఆజ్ఞ అదే, ఆజ్ఞను పాలించేవాడూ వాడే. కాని అధికారి మాత్రం వేరే. నా ఆజ్ఞకు ఫలితం సున్న. అదే మీరు ఆజ్ఞాపించి నపుడు ఫలితం వెంటనే రాలేదూ? మంత్రజపం విషయంలోనూ అంతే."

## భాషణములు 9

ఒకరు ప్రశ్నించారు: "శాస్త్రాలలో జ్ఞాని బిడ్డవంటి వాడని ఏల చెప్పేయి?" మహర్షి: ఒక విధంగా వారిద్దరికీ పోలిక ఉంది. ఏ విషయంలోగాని, ఆ విషయం జరుగుతున్నంతసేపే బిడ్డకి ఆసక్తి. తరువాత వాడా విషయమే తలపోయడు. అంటే ఆ

విషయం వానిని ఏ విధంగానూ అంటలేదు. ఆ విషయం మానసికంగా వానిపై ఏవిధమైన ప్రభావాన్ని చూపలేదు. జ్ఞాని విషయంలో కూడా అంతే.

## భాషణములు 10

“సద్విద్య - అనుబంధం”లోని 9వ శ్లోకములో నున్న మహర్షి సూచనలను అనుసరించి, ఆత్మసాక్షాత్కారంగావించుట ఎట్లు, అని ఒక దర్శనార్థి అడిగాడు. మనో నిగ్రహములోనే కష్టమున్నది అన్నాడు.

మహర్షి: ప్రాణ (వాయు) రోధనము వలన దానిని సాధించవచ్చును. వేరే సహాయం లేకుండానే నీవు స్వయంగా శ్వాస నిరోధనము అభ్యసిస్తే, మనస్సును నిగ్రహించవచ్చును. అలా కాకాపోతే, ఈ మనోనిగ్రహం, ఉన్నత శక్తి సన్నిధిలో కూడా అప్రయత్నంగా కలుగుతుంది. మహాత్ముల సాంగత్యం (సత్సంగము) యొక్క గొప్పతనం అటువంటిది.

## భాషణములు 11

"విధి (కర్మ)కు అంతమంటూ వుందా?"

మహర్షి: కర్మలను నశింపచేసే బీజాలు కర్మలలోనే ఉన్నాయి.

## భాషణములు 12

తనకు ఏదైనా చెప్పవలసినదని ఒక వ్యక్తి మహర్షిని అడిగాడు. ఏమి తెలిసికోవాలనుకుంటున్నావు అంటే అతడు: "స్వామీ, నాకేమీ తెలియదు. మహర్షి ఏమైనా సెలవిస్తే వినాలనుకుంటున్నాను, అంతే".

మహర్షి: నీ కేమీ తెలియదని తెలుసుకున్నావు కదా. ఆ తెలివి ఏదో వెదుకు అదే ముక్తి.

## భాషణములు 13

శ్రీమతి ఎం.ఎ.పిగాట్ అను ఆంగ్లేయ వనిత “గుప్తభారతదేశములో అన్వేషణ” (Search in Secret India) అనుగ్రంథాన్ని చదివి మహర్షి దర్శనానికి వచ్చింది. అనువాదకునిగా వ్యవహరించడానికి ఒక శిష్యుని ఏర్పాటు చేసారు. పసిబిడ్డలతో ఉన్న కొందరు స్త్రీలతో సహా చాలామంది దర్శనార్థులు ఆ సమయంలో హాలులో ఉన్నారు. ఆ ప్రదేశమంతా సందడిగా ఉంది. ఎట్టకేలకు అక్కడ మౌనము నెలకొంది. అనంత ఆకాశం వైపు చూస్తున్నట్లున్న మహర్షి "కోతి” అని మృదువుగా అన్నట్లు వినిపించింది. తన వెనక కాళ్ళ మీద నిలుచున్న పెద్ద కోతి చెంత ఒక పసిబిడ్డ వాకిలి వద్ద కనిపించింది. ఆ కోతి కొంచెంకూడా హాని చెయ్యకుండా రెండు చేతులతోనూ బిడ్డను లాలిస్తోంది. కోతి, బిడ్డ కూడా మహర్షి సన్నిధిలో పరస్పరం ప్రశాంతంగా ఉన్నారు. ద్వారానికి అటువైపుగా కూర్చొన్న తల్లి ఈ దృశ్యాన్ని గమనించలేదు. మహర్షి మాటవినగానే కోతి నేర్పుగా దుమికి కనుమరుగైంది. ఈసంఘటన ఆంగ్లేయ వనితను ఎంతగానో ఆకట్టుకొంది.

"సాక్షాత్కారమునకు గురువు అవసరమా?" అని మొదట శ్రీమతి పిగాట్ అడిగింది.

మహర్షి: ఉపదేశాలు, ఉపన్యాసాలు, ధ్యానము మొదలైన వాని కంటె అధికంగా గురువు అనుగ్రహమే సాక్షాత్కారాన్ని సిద్ధింపజేస్తుంది. మిగిలినవి రెండవ పక్షము మాత్రమే. అతి ప్రధానమూ, ముఖ్యమూ / ఆవశ్యకము అయినది గురు అనుగ్రహమే.

భక్తుడు: ఆత్మానుభవానికి ఆటంకపరచే అవరోధాలు ఏవి?

మహర్షి: మనస్సు యొక్క గాఢమైన అలవాట్లు (వాసనలు)

భక్తుడు: ఈ (మానసిక అలవాట్లును) వాసనలను దాటడం ఎలా?

మహర్షి: ఆత్మాజ్ఞానము వలననే.

భక్తుడు: ఇదొక విషవలయం, ఈ చిక్కు అంత సులభంగా విడదు.

మహర్షి: అహంకారము వల్లనే ఇన్ని చిక్కులూ, పరస్పర విరోధాలు, కల్లపైన ఊహలు రేపి కలత పెట్టేది ఈ అహంకారమే. ప్రశ్నలు అడిగేది, అన్వేషణ చేసేది ఎవరో కనుక్కో ఆత్మ తెలియబడుతుంది.

భ: ఆత్మానుభవానికి సాయపడేవేవి?

మ: శ్రుతి వాక్యాలు, జ్ఞానుల బోధలూ.

భ: ఆ బోధలు సంవాద, ఉపన్యాస, ధ్యానాదుల రూపంలో ఉండవచ్చునా?

మ: ఉండవచ్చును. కాని ఇవన్నీ రెండో పక్షం. ముఖ్యమైనది గురువు అనుగ్రహమే.

భ: అది లభించేదెంత కాలానికో?

మ: అది ఎందుకు తెలిసి కోవడం?

భ: ఆశ, ధైర్యం పెంచుకోడానికి.

మ: అటువంటి కోరిక కూడా ఆటంకమే. ఆత్మ ఎప్పుడూ ఉంది. అది లేక మరేది లేదు. ఆత్మగా ఉండు. అన్ని కోరికలూ సందేహాలూ మాయమవుతాయి అటువంటి ఆత్మే గాఢనిద్ర, స్వప్నము మరియు జాగ్రత్ అనే స్థితులకు సాక్షిగా ఉంటుంది. ఈ స్థితులన్నీ అహంకారానికి సంబంధించినవే. ఆత్మ అహంకారానికి కూడా అతీతమైనది. నీవు గాఢనిద్రలో లేవా? అప్పుడు గాఢనిద్రలో ఉన్నానని, ప్రపంచం తెలీదని నీకు తెలుసా? జాగ్రత్ అవస్థ (మెలుకువగా ఉన్న స్థితి)లో మాత్రమే గాఢనిద్రలో తెలివి లేదు అని చెప్తావు. కనుక నిద్రిస్తున్నపుడూ, మెలుకువగా ఉన్నప్పడూ ఉండే చైతన్యము ఒక్కటే. ఈ జాగ్రదావస్థలో ఉన్న చైతన్యము ఎటువంటిదో తెలుసుకొంటే మూడు స్థితులలోనూ ఉంటూ. వాటికి సాక్షిగా ఉన్న చైతన్యమును తెలిసికోగలవు. చైతన్యమును నిద్రలో ఉన్న విధంగా అన్వేషించడం వలన, అన్ని స్థితులకు సాక్షిగా ఉన్న చైతన్యాన్ని కనుక్కో గలవు.

గాఢనిద్రలో ఏమీ తెలియలేదన్న సంగతి జాగ్రదావస్థ (మెలుకువ)లో మాత్రమే చెప్తావు.

భ: అలా అయితే, నేను నిద్రపోతాను.

మ: అలాగే చేయి, ఏ హానిలేదు!

భ: అది శూన్యము

మ: ఆ శూన్యము ఎవరికి? కనుక్కో ఎప్పుడైనా సరే, నిన్ను నీవు లేననలేవుకదా? ఆత్మ ఎప్పుడూ ఉండనేఉంది. మూడు అవస్థలలోనూ (జాగ్రత్, స్వప్న, సుషుప్తి) అది ఎప్పుడూ ఉంది.

భ: నేను నిద్రిస్తున్నట్లుగా ఉంటూ, అదే సమయంలో జాగరూకుడనై ఉండాలా?

మ: అవును. జాగరూకతయే జాగ్రదవస్థ లక్షణం. కనుక ఇది నిద్రకాదు. నిద్రకాని నిద్ర. నీవు నీ ఆలోచనలతో పోతే, నీవశంలో నీవుండవు. అంతులేని వ్యూహంలో చిక్కుకుంటావు. .

భ: అంటే తలపులకు వెను దిరిగి వాని మూలం వెదకాలా.

మ: అవును అలాచేస్తే తలపులు అదృశ్యమయి ఆత్మ ఒక్కటే మిగులుతుంది. నిజానికి ఆత్మకు "లోపల" లేదు, "వెలుపల" లేదు. అవన్నీ అహంకారకల్పనలే. ఆత్మ శుద్ధమూ, కేవల పరమార్థమూ.

భ: ఇది బుద్ధితోనే తెలుస్తుంది. ఆత్మసాక్షాత్కారానికి బుద్ధి సహాయకారికాదా?

మ: చేస్తుంది. కాని కొంత వరకే. ఆత్మ బుద్ధికి అతీతమైనదని గుర్తించు కోవాలి. ఆత్మను చేరుకోవడంలో బుద్ధికూడా లయమయిపోవల్సిందే.

భ: నా ఆత్మజ్ఞానము ఇతరులకు సహాయపడుతుందా?

మ: తప్పక సహాయపడుతుంది. దానిని మించిన సహాయకారి లేదు. కాని అప్పుడు నీవు సహాయం చేద్దామంటే అన్యులెవరూ ఉండరే. ఎందుకంటే ఆత్మజ్ఞాని కేవలమూ ఆత్మనే గుర్తిస్తాడు. ఎలా అయితే కంసాలి అన్ని బంగారు ఆభరణాలలోని బంగారాన్ని మాత్రమే గుర్తిస్తాడో అలాగ. నీవు నీదేహంతో తాదాత్మ్యము చెందితేనే మిగిలిన దేహాలనూ, రూపాలను గుర్తిస్తావు. కాని నీదేహతాదాత్మ్యతను దాటితే దేహబుద్ధితో పాటు అన్ని నామరూపాలు మాయమయిపోతాయి.

భ: ఇది చెట్లుచేమలకు కూడా అన్వయిస్తుందా?

మ: అవి ఆత్మకు భిన్నంగా ఉండగలవా. విచారించు. నీవు వానిని చూస్తున్నావని అనుకుంటున్నావు. ఈ ఆలోచన ఆత్మ నుండి వెలుపలికి వచ్చిందే. అది పుట్టిన దెక్కడో కనుక్కో ఆపై తలపులుండవు. ఆత్మ ఒక్కటే మిగులుతుంది.

భ: సిద్ధాంతపరంగా అర్థమవుతోంది. కాని అవి ఇంకా అలానే వుంటున్నాయి.

మ: నిజమే. ఇది ఒక సినిమా లాంటిది. తెరపై వెలుగు, దానిపై అటూఇటూ పరుగెత్తే ఎన్నో ఛాయలు. ఏదో ఒక నాటక చిత్రణంలాగా చూచే వారికి కనిపిస్తుంది. ఆ నాటకంలోనే భాగంగా ప్రేక్షకులను కూడా చూపిస్తే?! అప్పుడు చూస్తున్నవారూ, చూడబడేది కూడా తెరయే. ఇది నీకు అన్వయించుకో. ఆ తెర నీవే. ఆత్మ అహంకారాన్ని కల్పిస్తుంది. ఎన్నో ఆలోచనలు దాన్ని చుట్టిపేస్తాయి. అదే ఆ ఆలోచనలను ఈ ప్రపంచంగా, నీవనే చెట్లూ చేమలుగా ప్రదర్శిస్తోంది. నిజానికి ఇవన్నీ ఆత్మకు భిన్నంగా లేవు. ఆత్మను నీవు దర్శించిన నాడు సర్వమూ అదే, ఎప్పుడైనా, ఎక్కడైనా ఆత్మ తప్ప మరేదీ లేదు.

భ: ఇప్పటికిది నాకు సిద్ధాంత పరంగా మాత్రమే అర్థమైంది. మీరు చెప్పిందైతే చాలా సులభంగా, సుందరంగా, సుసంగతంగా ఉంది.

మ: ఆత్మాసాక్షాత్కారము కాలేదు అనే తలపుకూడా అంతరాయమే. నిజంగా, ఉన్నది ఆత్మ ఒక్కటే.

## భాషణములు 14

వృద్ధుడు ఒకరు హాల్లోకి వచ్చి కూర్చున్నారు. అప్పుడు మహర్షి తమ అరుణాచల స్తుతి పంచకంలోని అక్షరమణమాలకు లక్ష్మణ శర్మగారి సంస్కృత అనువాదాన్ని చదువుతున్నారు. ఆ ముదుసలి మృదువుగా ప్రశ్నించారు. ఆత్మానుభవం మాటలకు అందదన్నారు. ఆత్మానుభవాన్ని వర్ణించడంలో మాటలు ఎప్పుడూ విఫలమౌతాయంటారు. మరెలా?

మహర్షి: అరుణాచల అష్టకంలో 3వ శ్లోకంలో "ఆత్మానుభవము అనిర్వచనీయమే అయినా, దాని ఉనికిని వాక్కు సూచించగలదు." అని ఉన్నది.

అంతలోనే ఆ ముదుసలిలో భావావేగం గోచరించింది శ్వాసదీర్ఘమూ, ప్రయాస పూర్వకమూ అయింది.

భగవాన్ ఎదుట సవినయంగా సాష్టాంగ నమస్కారము చేసి, రెండు మూడు నిముషాలకు గాని లేవలేదు. తరువాత కొంత సేపు ప్రశాంతంగా వుండి, వెళ్ళిపోయారు.
శ్రీరమణ భాషణములు

అతనికేదో ఆత్మానుభవమునకు సంబంధించిన ఉద్దీపన కలిగిందనడం స్పష్టము. మహర్షి దానిని గురించి ఏమంటారో తెలిసికోవచ్చాడు. భగవాన్ దానికి తగు విధంగా బదులిచ్చారు. ఆ వృద్ధుడు మహర్షి నుండి దృఢీకరణము పొంది సవినయంగా, ఆర్ద్రభావంతో భగవదనుగ్రహము స్వీకరించి వెళ్ళిపోయారు.

## భాషణములు 15

పరమాత్మ “అణోరణీయాన్, మహతో మహీయాన్" అన్న ఉపనిషద్వాక్యమును గూర్చిన ప్రశ్న వచ్చింది. (పరమాత్మ అణువుకంటే చిన్నది, అతి పెద్దదానికంటే పెద్దది.)

మ: అణువర్ణన సైతం తెలిసేది మనస్సుతోనే, అణువుగురించి కూడా మనస్సుకు తెలుస్తుంది. కనుక మనస్సు అణువుకన్నా సూక్ష్మము. దాని వెనుక ఉన్నది జీవాత్మ. మనస్సు కన్నా సూక్ష్మతరము. తమిళ్ భక్తుడు, వాగ్గేయకారుడు మాణిక్యవాచకర్, సూర్యకిరణంలో నర్తించే సూక్ష్మాతి సూక్ష్మ రేణువులను వర్ణిస్తూ "అందులో ప్రతి రేణువు ఒక్కొక్క విశ్వం అయితే, సూర్యకాంతి సర్వమూ పరబ్రహ్మము అనుకోవలెను" అన్నారు.

## భాషణములు 16

శ్రీ డగ్లస్ ఐన్స్లీ (శ్రీగ్రాంట్ డఫ్) ది ఇంగ్లండులోని ఒక ఉన్నత కుటుంబము. 70 ఏండ్ల వయస్సు, మద్రాసు మాజీ గవర్నర్ మేనల్లుడు. కవి, బహుగ్రంథకర్త. మునుపు ఏథెన్స్, పారిస్, హేగ్ మహపట్టణములలో బ్రిటిష్ దౌత్యాకార్యాలయాల్లో ఉద్యోగం చేసినవాడు. మద్రాసు వచ్చి గవర్నర్కు అతిథిగా ఉన్నాడు. పాల్ బ్రంటన్ నుండి పరిచయ లేఖతో మహర్షిని చూడవచ్చాడు. ఆరోజు, ఆ మరుసటి రోజు మహర్షిని దర్శించాడు. కాని భగవాన్ సన్నిధిలో ఒక గంటైనా లేడు. రెండు రోజులూ అతనూ, మహర్షీ ఒకరి నొకరు స్థిరంగా చూచుకుంటూ ఉన్నారేగాని, మాట్లాడు కొన్నదే లేదని చెప్పవచ్చు.

"అతని అలవాట్లు కఠినమైనవి. పగలు ఒంటి గంట దాకా ఏ ఆహారం ముట్టడు. అప్పుడు భోజనం. ఆపైన సాయంత్రం బిస్కట్లు కాఫీ-అంతే. నిద్రకు ముందు ఏమీ తినడు. అవివాహితుడు. ఖాళీ కడుపుతో కొన్ని మైళ్ళు నడవడం అలవాటు. మితాభాషి హుందాగా ఉంటాడు. మంద్రంగా, మృదువుగా మాట్లాడతాడు. హృదయంలోంచి మాట్లాడినట్లుగా ఉంటుంది. సర్ జాన్ ఉడ్రఫ్, సర్ సర్వేపల్లి రాధాకృష్ణన్, ఆక్స్ఫర్డ్ సంస్కృతం ప్రొఫెసర్ థామస్ ఈయన మిత్రవర్గంలోని వారు. వేదపారాయణం వినాలని అభిలాష, సోమవారం రీగా నుండి ఒక లేఖ వచ్చింది. దానిలోని ప్రశ్నలు “మరణించిన తర్వాత జీవాత్మ ఉండునా, ఉంటే దానిని చక్కగా సేవించుట ఎట్లు? ఈ ప్రశ్నలు ఢఫ్ అడిగిన ప్రశ్నలు ఏకీభవించడం చిత్రం.

రీగాకు పంపిన సమాధానాలు ఐన్స్లీకి చదివి వినిపించారు. ఆయన ఎదుట మహర్షి రచించిన “సద్విద్య" నుండి తమిళ పద్యములు, వేదములు పఠించబడ్డాయి. అవి విని అతడు ఆశ్చర్య ముగ్ధుడైనాడు. ఆ రాత్రి ఆయనకొక అనుభవం కల్గింది. మరునాడు మధ్యాహ్నం దాన్ని మహర్షికి నివేదిస్తూ ఉంటే, విన్నవారు ఆశ్చర్యచకితులయ్యారు. వక్షానికి కుడివైపున హృదయ మధ్యంలో విద్యుద్దీపకాంతి వంటి జ్యోతి ఒకటి కనిపించిందట. తనలోనే ప్రకాశిస్తున్న సూర్యుని కూడా చూచాడట. చిరునవ్వుతో మహర్షి "ఆత్మవిద్య" అనువాదం పితృదేవతలు ఉంటారా? ఉంటే వారిని సేవించేందుకు విధానమేది? వానికై చదివించారు. అందులో గూఢార్థమైన వాక్యం ఒకటి ఉన్నది. "పరమార్థజ్ఞానం అంటే ఆత్మప్రాప్తియే. ఆత్మ అంటే చిదాకాశం. ఇది మనస్సు లేదా చిత్త ఆకాశమునకు భిన్నమూ, విశిష్టమూనూ" ఈ వివరణ అతనికి బాగా నచ్చింది.

తర్వాత ఒకమారు ఐన్స్లీ గురించి మహర్షి ఇలా అన్నారు. “డెబ్బై ఏండ్ల ముదుసలి. తను సంపాదించిన ఆదాయంతో తీరికగా ఇంట్లో ఉండ వచ్చునే! కానీ, అతని శ్రద్ధ ఎంతటిదో చూడండి! ఈ వయస్సులో స్వదేశంవదలి ఆరువేల మైళ్ళు సముద్రయానానికి సాహసించి, దేశంకాని దేశంలో, రైళ్ళలో దూరప్రయాణానికి తట్టుకొని వచ్చాడు. ఇక్కడి భాష తెలుసునా, ఏమన్నానా? ఒంటరితనపు ఒడుదుడుకులూ, ఉష్ణదేశంలోని ఇబ్బందికరమైన వాతావరణం సహిస్తూ తనకు కొత్తవి, అసహజమైన పరిసరాల్లోని ఒత్తిడులను ఓర్చుకుంటూ వచ్చాడు. తన ఇంట్లో తాను హాయిగా ఉండవచ్చు. కాని శాశ్వత శాంతి కోసమైన తపన వానిని ఇంత దూరం తీసుకొని వచ్చింది. "నిజమే, ఎంత శ్రద్ధలేకుంటే, వచ్చి నాల్గు రోజులు కాలేదు, ఇంతలో ఇన్ని దివ్య అనుభూతులు కల్గుతాయా!” అంటూ ఆమోదించారంతా.

రీగా నుండి వచ్చిన జాబులో పితృదేవతలను (చనిపోయినవారి జీవాత్మల)ను సేవించే దెట్లు అన్న ప్రశ్న విషయంలో:
మహర్షి : స్థూల శరీరము "తాను" అనుకొన్న వానికి జగత్తు సత్యమే.

ఆలోచనలరూపమే ఈ నామరూపాల ప్రపంచము. తాను మరో శరీరము వలన జన్మించానని తలంచితే తన దేహమెంత నిజమో, ఆ దేహమూ అంతే నిజము. ఆ జన్మనిచ్చిన దేహము ఒక మారిక్కడ బ్రతికి ఉంటే మరణానంతరం కూడా అది ఉన్నట్లే, ఎందుకంటే ఇప్పటి సంతానము వాని నుండి తన జన్మ అనుకుంటున్నది కనుక. ఈ స్థితిలో పరలోకము కూడా సత్యమే. మృతుల కోసం పితృలకై కైంకర్యములు వారికి మేలు చేస్తాయి.

మరో విధంగా చూస్తే, ఉన్న సత్యం ఒక్కటే. దాని నుండే వ్యక్తి భావన (అహంకారం) జనించేది. ఈ అహంకారంలో పూర్వజన్మల వాసనాది బీజాలున్నాయి. వాసనలనూ, వ్యక్తిత్వాన్ని, ఇంద్రియ వ్యాపారాలను ప్రకాశింపజేసేది ఆత్మయే. వాసనాచయం రూపొంది ఇంద్రియాలకు విశ్వం వలె భాసిస్తుంది. ఆత్మకు ప్రతిరూపమైన (ఆత్మాభాసమైన) వ్యక్తి దానిని ప్రపంచంగానే గ్రహిస్తాడు. అహంకారం (వ్యక్తి) తాను దేహమను కోవడంతో ఆత్మ దానికి కనుమరుగు అవుతుంది. ఈ భ్రమకు ఫలితం అవిద్యా, తమస్సూ, ప్రస్తుత జీవితంలోని దుఃఖమూ. ఆత్మ నుండి పుట్టిన అహంకారము ఆత్మను మరిచిపోవడమే పుట్టుక. ఈ విధమైన వ్యక్తి జననము తల్లిని చంపినట్లు అయిందనమాట. మరల తల్లిని పొందడాన్ని కోరడం, నిజంగా ఆత్మను తిరిగి సాక్షాత్కరించే కోరికే. ఆత్మానుభూతి అన్నా అహంకార నాశనం అన్నా అదే. ఇదే తల్లికి శరణాగతి చేయడమంటే, ఎందుకంటే దీనివలన ఆమె నిత్యత్వాన్ని పొందుతుంది. తర్వాత మహర్షి తమిళములోని యోగవాసిష్ఠము నుంచి దీర్ఘతాపసి కథను చదివి వినిపించారు. ఆయనకిద్దరు కొడుకులు. పుణ్య, పాప వారి పేర్లు. తల్లితండ్రులు గతించాక చిన్నవాడు వారికై విలపించసాగాడు. వానిని ఓదారుస్తూ పెద్దవాడిలా అన్నాడు. "వారు పోయారని ఎందుకింతగా బాధపడతావు? వారెక్కడున్నారో చెప్పనా? మనలోనే ఉన్నారు? వారు మనమే. ఎలా అయితే నదిలో ప్రవాహము ఎన్నో బండలు, గుంతలు, ఇసుక తిన్నెలు, మిట్టపల్లాలను దాటి పారుతోందో, అదే విధంగా జీవిత ప్రవాహం ఎన్నో జన్మలు, పుట్టుకలు, చావులు సుఖదు:ఖాల ద్వారా సాగుతోంది. ఎలా అయితే నదీ ప్రవాహం వీటన్నిటి వలన ఆగిపోవడం లేదో అదే విధంగా జీవిత ప్రవాహం కూడా ఆగక ప్రవహిస్తోంది. నేను పేరు అనే అహంకారమనే ఎండమావిలో సుఖదుఃఖాల గుండా సాగుతోంది. నేను పేరు అనే అహంకార మనే ఎండమావిలో సుఖదుఃఖాలు, జనన మరణాలు మొదలైనవి కెరటాలు, ఆత్మ ఒక్కటే సత్యము. అందులోంచే ఈ అహంకారము కనిపిస్తూ అన్ని ఆలోచనల ద్వారా ప్రసరిస్తూ, ఈ ప్రపంచము వలే వ్యక్తీకరించబడుతోంది. ఈ ప్రపంచంలో తల్లితండ్రులూ, స్నేహితులూ, బంధువులూ కనిపిస్తూ, మాయమవుతూ ఉంటారు. ఇవన్నీ ఆత్మరూపాలే. అందువలన తల్లితండ్రులు ఆత్మకు భిన్నంగా, ఆత్మకు బయట లేరు. అందువలన దుఃఖించడానికి కారణం లేదు. ఇది తెలుసుకో, అనుభవంపొందు. ఆనందంగా ఉండు.!"

# భాషణములు 17

ఆక్స్ఫర్డ్ విశ్వవిద్యాలయంలోని ఆంగ్ల పరిశోధక విద్యార్థి డబ్ల్యు.వై. ఇవాన్స్ వెంట్జ్, పాల్ బ్రంటన్ ఇచ్చిన పరిచయ లేఖతో మహర్షిని చూడవచ్చాడు. ప్రయాణ శ్రమకు అలసి, విశ్రమించ గోరాడు. అతడు ఈ దేశానికి పలుమార్లు వచ్చివున్నవాడే. ఇచ్చటి జీవిత పద్ధతులతనికి అలవాటే. అతడు టిబెట్టు భాషనేర్చి అందులో "బుక్ ఆఫ్ దిడెడ్" (మృతుల గాథ), "మిలారేపా జీవితం" “టిబెట్ సీక్రెట్ డాక్ట్రిన్స్" (టిబెట్టుగూఢ తత్త్వాలు) అన్న గ్రంథాలను రచించాడు. ఆ మధ్యాహ్నం, అతడు మహర్షిని యోగ విషయంగా కొన్ని ప్రశ్నలు అడిగాడు. వెంట్జ్: జింకలు, పులులు మొదలైన జంతువులను యోగాసనముల కొరకై చంపవచ్చునా?

మ: మనస్సే పులి. మనస్సే జింక.

వెంట్జ్: అంతా మాయ అయితే ప్రాణివధ చేయవచ్చునా?

మ: మాయ ఎవరికి? అది చూడు, నిజానికి ప్రతీవాడు తన జీవితంలో ప్రతీ నిమిషమూ ఆత్మహత్య చేస్తూనే ఉన్నాడు.

వె: ఆసనాలలో ఉత్తమమైనది ఏది?

మ: ఏదైనా మంచిదే. బహుశః సుఖాసనం మేలు కావచ్చు. కాని అది జ్ఞాన మార్గానికి అంతా ముఖ్యం కాదు.

వె: ఆసనం స్వభావాన్ని సూచిస్తుందా?

మ: సూచిస్తుంది.

వె: పులిచర్మము, కంబళి, జింక చర్మములకు గల ప్రత్యేక గుణాలు, ఉపయోగాలు ఏమిటి?

మ: కొందరు వాటిని కనుగొని యోగగ్రంథాలలో వివరించారు. అవి అయస్కాంత శక్తిని ప్రసరింపచేయువానిని, ప్రసరింప చేయనివానిని (conductors and non-conductors of magnetism) 0. 5 3 మార్గములో అంత ప్రధానం కావు. నిజానికి ఆసనం అంటే ఆత్మస్థానమును కనుగొని ఆత్మయందు స్థిరముగా వుండుట అని అర్ధము. ఇది అంతర్గతమైంది. మిగిలినవి బాహ్యస్థితులకు సంబంధించినవి.

వె: ధ్యానానికి చాలా అనుకూలమైన సమయమేది?

మ: సమయము (కాలము) అంటే ఏమిటి?

వె: అది ఏమో తెలియజేయండి.

మ: కాలము అనేది ఒక తలపు (భావన). ఉన్నది సద్వస్తువు మాత్రమే. దాన్ని నీవు ఎలా ఊహిస్తే అది ఆ రూపంలో ఉంటుంది. దానిని నీవు కాలమంటే కాలం. ఉనికి అంటే ఉనికి (సత్ అంటే సత్) ఏదనుకుంటే అదే. దానికి కాలము అని పేరు పెట్టి, దినాలని, రాత్రులనీ, మాసాలనీ, సంవత్సరాలనీ, గంటలనీ, నిమిషాలనీ విభజించారు. జ్ఞానానికి కాలంతో పనిలేదు. కాని ఆ మార్గాన కొత్తగా ప్రవేశించే వారికి ఇట్టి నియమాలు మంచివే.

వె: జ్ఞాన మార్గము ఎటువంటిది?

మ: యోగ జ్ఞాన మార్గాలు రెండిటికీ మనస్సు యొక్క ఏకాగ్రత అవసరము. విశ్వ వ్యాప్తమైన సత్యము తో (చైతన్యముతో) వ్యక్తి యొక్క ఐక్యము యోగలక్ష్యము. ఈ సత్యము ఎప్పుడూ ఉన్నది, కొత్తగారాదు, ఇప్పుడు కూడా ఉండాలి, తప్పక ఉన్నది కూడా. అందువలన అసలు వియోగం ఎందుకు కల్గిందో తెలిసికోడానికి జ్ఞానమార్గం ప్రయత్నం చేస్తుంది. ఈ వియోగం సత్యవస్తువు నుండి మాత్రమే.

వె: మాయ అనగా ఏమిటి?

మ: మాయ ఎవరికో వెదుకు. అది నశిస్తుంది. సాధారణంగా అందరూ మాయ అంటే ఏమో తెలియగోరే వారే కాని అది ఎవరికి అని యోచించరు. అట్లు విచారించకపోవడం అవివేకం. మాయ తనకు వెలుపలిది, తెలియనిది. కాని అన్వేషించేవాడు లోపల ఉన్నాడు మరియు తెలియబడేవాడు. దూరముగా ఉండి తెలియని దానిని కనుక్కోడానికి ప్రయత్నించే బదులు సన్నిహితమూ, సుపరిచితము అయిన దానిని తెలిసికోప్రయత్నించు.

వె: యూరోపియన్లకు సౌకర్యంగా ఉండే ఏదైనా ఆసనం చెప్పగలరా?

మ: చెప్పవచ్చును. కాని ఆసనాలు గానీ, నిర్దిష్టమైన సమయాలు కానీ, ఏ ఉపకరణాలు కానీ లేనంత మాత్రాన ధ్యానం చెయ్యకూడదు అని లేదు అనే విషయం స్పష్టంగా తెలుసుకోవాలి.

వె: యూరోపియన్ల కొరకని మహర్షి వద్ద ఏదైనా ప్రత్యేకమైన బోధనా పద్ధతి ఉందా?

మ: అది వ్యక్తి మానసిక పరిణితిని, సన్నద్ధతను బట్టి ఉంటుంది. వీరికి ఇదే మార్గము అంటూ ఏమీ లేదు.

తర్వాత వెంట్జ్ యోగప్రారంభంలో కావలసిన వాటి గురించి ప్రశ్నలు అడుగగా మహర్షి ఇవన్నీ యోగానికి ఉపకరణాలని, యోగమే ఆత్మ సాక్షాత్కారానికి ఉపకరణమని, ఆత్మసాక్షాత్కారము జీవితగమ్యమని చెప్పారు.

వె: పని చెయ్యడం (కర్మ) ఆత్మసాక్షాత్కారానికి ఆటంకమా?

మ: కాదు. జ్ఞానికి ఆత్మ ఒక్కటే సత్యం. కర్మ కేవలం వ్యావహారికము. ఆత్మను అంటదు. జ్ఞాని పనిచేస్తున్నా కర్తృత్వ భావన ఉండదు. ఆపనులు అతడు కోరి చేసేవికాదు. ఆ పనులయందు ఎటువంటి మమత్వము లేక సాక్షి మాత్రుడుగా ఉంటూ పనులు చేస్తాడు.

అతడు చేసే పనులు ప్రత్యేకమైన లక్ష్యమును సాధించడానికి చేసేవికావు. జ్ఞాన మార్గములో సాధన చేస్తున్న సాధకుడు కూడా, కర్మలు చేస్తూనే ఆత్మవిచారము కొనసాగించవచ్చు. ఆరంభంలో ఇది కష్టంగా ఉన్నా, కొంత అభ్యాసము చేసేక పనులు ధ్యానానికి అడ్డుకావని తెలిసికొని సాధన చేసికోగల్గుతాడు.

వె: అభ్యాసము అంటే ఏమిటి?

మ: అహంకారానికి మూలమైన "నేను"ను నిరంతరం వెతకడం. "నేను ఎవడను?" కనుక్కో శుద్ధమైన “నేను” సత్యం, ఇదే అనందమైన సత్-చిత్- ఆనందం. ఇది మర్చిపోయినపుడు అన్నిరకాల కష్టాలూ తలఎత్తుతాయి. ఈసత్యాన్ని గట్టిగా అంటిపెట్టుకొని ఉంటే కష్టాలు వ్యక్తికి దుఃఖాన్ని కల్గించలేవు.

వె: ఆత్మాసాక్షాత్కారానికి బ్రహ్మచర్యం అవసరంకదా?

మ: బ్రహ్మము నందు ఉండడమే బ్రహ్మచర్యము. సామాన్యంగా ప్రజలు అనుకొనేటట్లు, బ్రహ్మచర్యమంటే పెండ్లిలేకుండా ఉండటంకాదు. నిజమైన బ్రహ్మచారి బ్రహ్మనిష్ఠలో ఉంటాడు, బ్రహ్మనందంలో ఉంటాడు. బ్రహ్మ ఆత్మకు వేరుగాలేదు.

అంటే ఆత్మానందంలో ఉంటాడు. ఆనందంకోసం వేరే కారణాలను ఎందుకు వెదకడం? అన్ని దు:ఖాలకు కారణం, నిజానికి ఆత్మ నుండి దూరమవడమే!

వె: యోగమునకు బ్రహ్మచర్యము విధికదా!

మ: అవును. బ్రహ్మచర్యము కూడా, మరెన్నో ఉపకరణాలవలే, ఆత్మాసాక్షాత్కారానికి ఉపయోగపడుతుంది.

వె: బ్రహ్మచర్యము అవలంబించి తీరవలసినదికాదా? గృహస్థునకు ఆత్మానుభవం కల్గుతుందా?

మ: ఖచ్చితంగా కల్గుతుంది. అది వాని మనోపరిపక్వత మీద ఆధారపడి ఉంటుంది. పెండ్లి చేసుకోనీ, మాననీ, ఆత్మాసాక్షాత్కారము సాధ్యమే. ఎందుకంటే అది ఇక్కడే, ఇప్పుడే వున్నది కనుక. అలా కాకుండా ప్రయత్నమువలన ఎప్పుడో పొందబోయేది, కొత్తదిగా సాధించ బోయేది అయితే దాని కోసం ప్రయత్నం వ్యర్థము. ఎందుకంటే సహజము కానిది శాశ్వతము కాదు. కాని నేను చెప్పేది ఏమిటంటే ఆత్మకేవలమూ, ఇప్పుడే, ఇక్కడే ఉంది.

వె: భగవంతుడు సర్వాంతర్యామి కనుక ఎప్పుడూ ఏప్రాణినీ చంపకూడదు. హత్యచేసినవాని ప్రాణాలు దీయడం సమాజానికి న్యాయమా? ప్రభుత్వము అలాచేయవచ్చునా? అలాచెయ్యడం తప్పని క్రైస్తవ దేశవాసులు ఆలోచించడం మొదలుపెట్టేరు.

మ: హత్య చేసే వానిని ఆ నేరము చేయడానికి ప్రేరేపించేది ఏది? అదే శక్తి వానికి శిక్షను కూడా విధిస్తోంది. సమాజంగానీ, ప్రభుత్వంగాని ఆ శక్తి చేతులలో ఒక ఉపకరణం మాత్రమే. నీవు చంపబడిన ఒక ప్రాణి గురించి మాట్లాడుతున్నావు కాని యుద్ధాలలో చనిపోయే అసంఖ్యాకులయిన జీవుల మాట ఏమిటి?

వె: అది నిజమే. ఏది ఏమైనా ఒక ప్రాణిని చంపడంతప్పే. యుద్ధాలు సమర్థింపదగినవా ఏమి?

మ: నిరంతరం ఆత్మయందు ఉన్న జ్ఞానికి, ఆత్మ స్థితునకు ఒకటైనా, అనేకమయినా, మొత్తంగా అయినా, అయే ప్రాణి నాశనం ఏ వ్యత్యాసమూ కల్పించదు. ఒకవేళ అతడే సర్వప్రాణ నాశనం చేసినా, ఆ శుద్ధాత్మునకు ఏ పాపం అంటదు. మహర్షి భగవద్గీత 18వ అధ్యాయం 17వ శ్లోకం ఉదహరించారు.

"యస్య నాహంకృతో భావో బుద్ధిరస్యన లిప్యతే హత్వాపి స ఇమాన్ లోకాన్ నహన్తిన నిబధ్యతే॥

"అహంకారము నుండి విముక్తుడై సంగరహితుడైన బుద్ధికలవాడు సర్వలోకములను సంహరించినప్పటికీ సంహరింపనివాడే. అతడు తన చర్యల ఫలితములచే బంధించబడడు."

వె: వ్యక్తి చేసే పనులు (చర్యలు) తరువాతి జన్మలలో అతనిపై ప్రభావమును చూపునా?

మ: నీవు ఇప్పుడు పుట్టివున్నావా? ఇతర జన్మల గురించి ఎందుకు ఆలోచిస్తున్నావు? జన్మగాని మరణంగాని లేదనేది సత్యం. ఆ పుట్టిందెవడో వాడినే మరణంగురించీ, దాని నివారణోపాయం గురించీ ఆలోచించనీ.

వె: ఆత్మాసాక్షాత్కారానికి మహర్షికి ఎంతకాలం పట్టింది?

మ: నామరూపాలు కనబడుతున్నాయి కాబట్టే ఈ ప్రశ్న అడగడం జరిగింది. ఇటువంటి భావనలు స్థూలదేహంతో అహంకార తాదాత్మ్యము వలన కలుగుతాయి.

అహంకారము సూక్ష్మశరీరము (లింగశరీరము)తో తాదాత్మ్యము చెందితే సూక్ష్మవిషయాలనే గుర్తిస్తుంది, కలలలోవలె. కాని గాఢనిద్రలో ఏ గుర్తింపూలేదు. కాని అక్కడ అహంకారంలేదా? ఒకవేళ అహంకారం లేకపోతే నేను నిద్రపోయేను అనే జ్ఞాపకం ఉండదు. నిద్రపోయినది ఎవరు? గాఢ నిద్రలో ఉన్నప్పుడు ఆ విషయం నువ్వు చెప్పడంలేదు. ఇప్పుడు మెలుకువగా ఉన్నప్పుడు ఆ విషయం చెప్తున్నావు. అందువలన అహంకారము మెలుకువగా ఉన్నప్పుడూ, కలలలోనూ, గాఢనిద్రావస్థలోనూ సమానంగా ఉంది. ఈ మూడు స్థితులలోనూ ఆధారంగా ఉన్నదేమోకనుక్కో. అదే ఈ మూడు అవస్థలకూ ఆధారం, సత్యం. అక్కడ ఉన్నది ఉనికి మాత్రమే. అక్కడ నువ్వు, నేను, అతనూ లేవు. భూత, భవిష్యత్, వర్త మానకాలాలూ లేవు. అది కాలానికీ, ప్రదేశానికీ అతీతం. అది వర్ణనాతీతం.అది ఎప్పుడూ ఉంది. నిత్యము.

అరటి చెట్టు గెలవేయకముందు మొదళ్ళలో మొలకలు వేస్తుంది. వాటిని తీసి వేరుగా నాటితే, తల్లి చెట్టులాగే అవీ ప్రవర్తిస్తాయి. అలాగే పురాణుడు, ఆది గురువు అయిన దక్షిణామూర్తి శిష్యులైన ఋషులకు మౌనవ్యాఖ్యతో సర్వసంశయాలూ తీర్చి, శిష్యసంతానమనే మొలకలను వదిలిపెట్టేరు. అవి నిరంతరం వర్ధిల్లుతున్నాయి. దక్షిణామూర్తి యొక్క మొలకే గురువు. ఆత్మజ్ఞానం పొందినప్పుడు ఈ ప్రశ్నేరాదు.

వె: మహర్షి నిర్వికల్ప సమాధిలో ప్రవేశిస్తారా?

మ: కనులు మూసుకొంటే అంతా నిర్వికల్పమే, తెరిస్తే (నిర్వికల్పానికి భిన్నమైనది అయినా, సంపూర్ణ శాంతిలో నిశ్చలమైనది) సవికల్పము. ఎప్పుడూ ఉండేది తనదైన సహజ సమాధిస్థితి.

## భాషణములు 18

వెంట్జ్: సిద్ధులు ఉన్న యోగులు ఉన్నారు. వారి గురించి మహర్షి అభిప్రాయం ఏమిటి?

మ: వినడం వలనగాని, ప్రదర్శన వలన గాని సిద్ధులు ఉన్నాయని తెలుస్తోంది.

అందుచే అవి మనస్సు పరిధిలోనికే వస్తాయి. వె: హిమాలయాల్లోని తన గురువుతో మద్రాసు నుండి మాట్లాడే ఒక యోగి గురించి బ్రంటన్ చెప్పారు.

మ: ఈ విషయం సాధారణంగా చెప్పే దూరశ్రవణం (టెలీపతీ) కంటే ఏమంత గొప్పకాదు. వినేవాడు లేకపోతే టెలీపతి లేదు. చూచేవాడు లేకపోతే టెలివిషన్ లేదు. దూరశ్రవణానికి, సమీప శ్రవణానికి తేడా ఏమి ఉంది? ముఖ్యమైనది వినేవాడు. శ్రోతలేకుండా శ్రవణం, ద్రష్టలేకుండా దర్శనం ఉండ జాలదు.

వె: అంటే విషయాన్ని కాకుండా విషయి (అంటే కర్త)ను గుర్తించమంటారు.

మ: మనస్సు ఉదయించిన తర్వాతనే విషయి, విషయము కూడా కనిపిస్తాయి.

అవి మనస్సులోనే ఉంటాయి. గుప్త శక్తులు (సిద్ధులు) కూడా మానసికాలే.

వె: అరుణాచలంపై జ్యోతి ఆవిర్భావము దర్శించ వీలవుతుందా?

మ: అవును, వీలవుతుంది.

వె: కైలాస పర్వతము, కాశీ మొదలైన పవిత్రప్రదేశాలు దర్శించడం వలన ఏదైనా ఆధ్యాత్మిక ప్రయోజనం ఉందా?

మ: వుంది.

వె: కాశీలో మరణించడం వలన లభించే ఫలము ఏదైనా ఉందా?

మ: ఉంది. నిజమైన కాశి, నిజమైన మరణము తెలిస్తే తాత్పర్యము స్పష్టమవుతుంది.

వె: అవి కూడా ఆత్మలోనివే అనేది మీ అభిప్రాయమా?

మ: అవును.

వె: శరీరంలో ఆరు చక్రాలు (షట్చక్రాలు) ఉన్నాయి. వానికి అనురూపంగా ప్రపంచంలో కూడా కేంద్రాలు ఉన్నాయా.

మ: అవును. ప్రపంచములో ఉన్నది శరీరంలోనూ, శరీరంలో ఉన్నది

ప్రపంచంలోనూ ఉన్నాయి.

వె: కాశి పావనమైనది అను విషయము విశ్వాసమా లేక బాహ్యముగా కూడా అది సత్యమా?

మ: రెండూనూ.

వె: కొందరు ఒక క్షేత్రము వైపు ఆకర్షించబడితే మరికొందరు వేరొక క్షేత్రము వైపు ఆకర్షించ బడతారు. ఇది వారి వారి స్వభావాలను బట్టి ఉంటుందా?

మ: అవును. వేర్వేరు దేశాల్లో, వేర్వేరు తావుల్లో పుట్టి, వారందరూ ఇక్కడ ఎలాకలుసుకొన్నారో చూడండి. మిమ్మల్ని ఇక్కడికి ఆకర్షించిన శక్తి ఎటువంటిది? దీనిని గ్రహిస్తే ఆ ఇతర శక్తిని కూడా గ్రహించవచ్చు.

## భాషణములు 19

స్మృతి, విస్మృతి (జ్ఞాపకం, మరుపు) స్థానము ఎక్కడ? అని గ్రాంట్స్ అడిగెను.

మ: చిత్తములో,

## భాషణములు 20

ఇవాన్స్వెంట్జ్: జ్ఞానికి ఏకాంతము కావాలా?

మహర్షి: ఏకాంతము మనస్సులో ఉంది. ఒకడు ప్రపంచంలోని కార్యకలాపాలలో ఉంటూ కూడా ప్రశాంతంగా ఉండవచ్చు. అటువంటి వ్యక్తి ఏకాంతంలో ఉన్నట్లే. ఇంకొకడు అడవిలో ఉంటూ కూడా మనోనిగ్రహంతో లేకపోవచ్చు. అతడు ఏకాంతంలో ఉన్నాడని చెప్పలేము. ఏకాంతము మనస్సుకి సంబంధించినది. కోరికలకు తగులుకొనిన వాడు ఎక్కడ ఉన్నా ఏకాంతం పొందలేడు. కోరికలతో సంగము లేనివాడు ఎక్కడున్నా ఎప్పుడూ ఏకాంతియే.

వెంట్జ్: అంటే, పనులను చేస్తూకూడా, కోరికను వదలి, ఏకాంతమును కాపాడుకోవచ్చునా?

మ: అవును. సంగముతో చేయబడిన కర్మ బంధము కాగా సంగరహితముగా చేయబడిన కర్మ బాధించదు. అతడు పని చేస్తున్నప్పుడు కూడా ఏకాంతములో ఉంటాడు.

వెంట్: టిబెట్టులో ఎందరోయోగులు ఏకాంతంలో ఉంటూ కూడా లోకోపకారంగా ఉంటారట. అది ఎలా?

మహర్షి: సాధ్యమే. మానవజాతికి చేయదగిన మహోపకారం ఆత్మసాక్షాత్కారము. అందువలన మహాత్ములు అడవుల్లో ఉన్నా లోకానికి సహాయకారులని చెప్పబడతారు. కానీ ఏకాంతానికి అడవులే శరణ్యాలు అనుకోకూడదు. నగరాల్లోకూడా ఎడతెగని కార్యకలాపాల్లో సైతం ఏకాంతమును పొందవచ్చును.

వె: మహాత్ములు మానవులతో కలిసి వారికి సహాయకారులుగా ఉండడం అవసరం కాదా?

మ: ఆత్మ మాత్రమే సత్యము. ప్రపంచము తదితరములు ఈ సత్యము మీద ఆధారపడినవే. జ్ఞాని ఈ ప్రపంచమును తన కంటె భిన్నంగా చూడడు.

వె: అంటే జ్ఞాని సాక్షాత్కారము వలన ప్రజలకు తెలియకుండానే వారి ఉద్ధరణకు సహాయము చేస్తాడు. అంతేనా?

మ: అవును. పైకి కనపడదుగాని ఆ సహాయము ఉండనే ఉంటుంది. జ్ఞాని లోకానికంతా హితమొనరుస్తాడు. అది లోకానికి తెలియక పోవచ్చు.

వె: జ్ఞాని ఇతరులతో కలిసి మెలగడం అంత మంచిది కాదా?

మ: కలిసి మెలగడానికి ఇతరులు ఏరీ? ఆత్మ ఒక్కటే. అది మాత్రమే ఉంది.

వె: అవునవును. నాకు తెలుస్తోంది. శ్రీకృష్ణుడు భగవద్గీతయందు: సంగములేకుండా కర్మలు చేయవలెనని, అట్టి పనులు సోమరితనము కంటే మంచిదని చెప్పి ఉన్నారు. కర్మ యోగమంటే ఇదేనా?

మ: వినువారి స్వభావమును (సంస్కారములను) బట్టి చెప్పడం జరుగుతుంది.

వె: ఏకాంతంలో ఉన్నవాడు సహాయకారి కాగలడను విషయం యూరోప్లో జనులకు అర్థంకాదు. ప్రపంచంలో పనిచేసే జనులే మిగిలిన వారికి సహాయం చెయ్యగలరని వారి నమ్మకం. ఈ భ్రమ ఎప్పుడు పోతుందో? ఎప్పుడైనా యూరోపియన్లు ఈ ఊహ నుండి బయట పడి సత్యాన్ని గ్రహిస్తారా?

మ: యూరోపు, అమెరికాల గురించి ఆలోచనమాను. వారు నీ మనస్సులో కాక ఎక్కడ ఉన్నారు? నిన్ను నువ్వు తెలుసుకో. అప్పుడు అన్నీ తెలియబడతాయి.

నీవు కలగని, అందులో ఎందరినో చూచి, మేల్కొన్న తర్వాత, నీవు కలలో చూచిన వాళ్ళు కూడా మేల్కొన్నారా అని తెలుసుకోడానికి ప్రయత్నిస్తావా?

వె: మాయా సిద్ధాంతము గూర్చి మహర్షి ఏమనుకుంటున్నారు?

మ: మాయ ఏమి? అది కూడా సద్వస్తువే (సత్యమే).
వె: మాయ అంటే భ్రాంతి కాదా?

మ: సద్వస్తువు (సత్యము) యొక్క ఆవిర్భావములను తెలుపుటకే మాయ ఉపయోగింపబడినది. అందువలన మాయ సత్యమే.

వె: కొందరు శ్రీశంకరాచార్యులు మేధావియేకాని జ్ఞాని కాదంటారు. నిజమేనా?

మ: శంకరులపై నీకా గొడవెందుకు? నీవెవరో తెలుసుకో, చాలు. ఒరులు వారి విషయంవారు జాగ్రత్త పడతారు.

వె: ఏసుక్రీస్తు ఎందరి వ్యాధులో కుదిర్చాడు. అది కేవలం సిద్ధిఏనా?

మ: ఆ వ్యాధులను నివారిస్తున్నానని ఆ సమయంలో ఏసుకు తెలుసా? ఆ శక్తులు తనవని ఆయనకు తెలిసి ఉండదు. ఒక కథ చెప్తారు. ఏసు ఒకసారి ఒక గుడ్డివానికి చూపునిచ్చాడు. కొంత కాలానికి వాడు దుష్టుడుగా మారాడు. కొన్నేండ్లకు ఏసు ఆ దారిని వచ్చాడు. వాని దుష్టత్వమును గుర్తించి ఎందుకిట్లు అయ్యావని అడిగాడు. గ్రుడ్డిగా ఉన్నప్పుడు తాను పాపం చేయలేకపోయానని, ఏసు తన గుడ్డి తనం నివారించిన తర్వాతనే తాను దుష్టుడనయ్యానని చెప్పి, తన దుష్టత్వానికి ఏసే బాధ్యుడు అని అన్నాడు.

వె: ఏసు సిద్ధులున్న పూర్ణపురుషుడు కాదా?

మ: తనకు సిద్ధులున్నాయని ఆయనకు తెలిసి ఉండదు.

వె: దూరశ్రవణం (టెలిపతీ) లాంటి సిద్ధులను సంపాదిస్తే మంచిదికాదా?

మ: టెలీపతీ కాని, రేడియోకాని దూరంనుండి, చూడడానికి, వినడానికి ఉపయోగపడతాయి. దూరం నుండి విన్నా, దగ్గర నుండి విన్నా, అదివినడమే. చూడడమైనా అంతే. అందులో తెడాలేదు. ఇందులో ముఖ్యమైనది కర్త. అంటే వినేవాడు లేదా చూసేవాడు. వినేవాడు (శ్రోత), చూచేవాడు (ద్రష్ట) లేకుండా వినడం, చూడడం అనేవి ఉండవు. ఈ రెండూ మనో వ్యాపారాలు. కాబట్టి సిద్ధులు మనస్సుకు సంబంధించినవే. అవి ఆత్మకు సహజ ధర్మాలుకావు.

సహజము కాకుండా సంపాదించుకొన్నది శాశ్వతము కాజాలదు. దానికై ప్రయాస వృథా. అది విస్తరించిన శక్తులను తెలియచేస్తాయి. మానవుడు పరిమితమైన శక్తితో ఉండి దుఃఖితుడుగా ఉన్నాడు. తాను ఆనందంగా ఉండాలనే భావనతో తన శక్తులను పెంచుకోవాలని చూస్తాడు. అది సత్యమవుతుందా అని ఆలోచించండి. వ్యక్తి పరిమిత జ్ఞానంతో దుఃఖితుడుగా ఉంటే, ఆ పరిమిత జ్ఞానం పెరిగితే దుఃఖం కూడా దానికి తగినట్లుగా పెరుగుతుంది కదా! సిద్ధుల (గుప్త శక్తుల) వలన ఎవ్వరికీ ఆనందం కలుగదు సరికదా అవి అతనిని ఇంకా ఎక్కువగా దుఃఖితుని చేస్తాయి.

అందుచేత ఈ శక్తులు దేనికోసం? సిద్ధులు కావాలనుకొనేవాడు, ఇతరులు తనను మెచ్చుకోవాలనే ఉద్దేశంతో ఈ శక్తులను ప్రదర్శించాలని అనుకుంటాడు. వానికి కావలసింది మెప్పుదల. అది రాకపోతే వానికి సుఖం లేదు. వానిని ప్రశంసించడానికి ఇతరులు ఉండి తీరాలి కదా! మరో చిక్కు! తనకన్న ఎక్కువ శక్తులు ఉన్న వాళ్ళను గురించి తెలియవచ్చును. దాని వలన అసూయ అందువలన దుఃఖమూ! ఆ ఎక్కువ సిద్ధులు ఉన్న వ్యక్తి అంతకంటే ఎక్కువ శక్తులు ఉన్న వానిని కలవవచ్చు. ఈ క్రమంలో ఎవరికీ సాటిలేని మేటి సిద్ధుడు, వీరందరి శక్తులు సర్వమూ క్షణంలో మన్ను కలిపేవాడు ప్రత్యక్షమౌతాడు. అతడే ఈశ్వరుడూ లేదా ఆత్మ. ఏది నిజమైన శక్తి? ఎక్కువ సంపదనిచ్చేదా, శాంతిని ప్రసాదించేదా? శాంతిని ప్రసాదించేదే పరమ సిద్ధి. (అత్యుత్తమమైనది)

వె: కాని యూరోప్, అమెరికాల్లో సామాన్య జనులు ఈ దృక్పథాన్ని మెచ్చుకోరు. వారికి శక్తి ప్రదర్శనలూ, ఉపన్యాసాలూ బోధలూ కావాలి.

మ: ఉపన్యాసాలు వ్యక్తులను సంస్కరించకుండా కేవలం వారికి కొన్ని గంటలు వినోదాన్ని కల్గిస్తాయి. కాని మౌనము శాశ్వతంగా లోకానికంతా హితం కల్గిస్తుంది.

వె: కాని మౌనం అర్థంకావడం కష్టం.

మ: అయితే మాత్రం ఏం? మౌనం అంటే వచోవిదగ్ధత. (వాక్పాటవము లేదా వాగ్ధాటి) ఉపన్యాసాలకు మౌనానికి ఉన్న వాక్పటుత్వం లేదు. మౌనం అవిచ్ఛిన్నమైన వ్యాఖ్యానము. ఆది గురువు దక్షిణామూర్తియే ఇందుకు లక్ష్యభూతుడు. శిష్యులైన ఋషులకు ఆయన చేసినది మౌనోపదేశమే.

వె: అయితేనేం. ఆయనకు శిష్యులు ఉన్నారు కనుక సరిపోయింది. నేటి పరిస్థితి వేరు. శిష్యులను వెతుక్కొని సాయపడవలసిన రోజులివి.

మ: ఇలా అనుకోవడం అజ్ఞానం. నిన్ను సృజించిన శక్తే ఈ ప్రపంచాన్ని కూడా సృష్టించింది. అది నిన్ను రక్షించిన పాటి, ఈ ప్రపంచాన్ని రక్షించదా?

వె: జీసస్ ప్రస్తావించిన “నష్టజీవి" (lost soul) గురించి భగవాన్ అభిప్రాయం ఏమిటి?

మ: నష్టపోవడానికి ఏముందో కాస్త చూడు. ఏమైనా ఉందా? సహజమైనదే ప్రధానమైనది. అదే శాశ్వతము, అది అనుభవానికి అందనిది. పుట్టినది పోక తప్పదు. సంపాదించినది పోక తప్పదు. నీవు పుట్టేవా? నీవు ఎల్లప్పుడూ ఉన్నావు. ఆత్మ ఎప్పటికీ పోజాలదు.

వె: ఎవ్వరూ కూడా (ఆధ్యాత్మికంగా) నశించరాదనే ఉద్దేశంతో బుద్ధుడు అష్టమార్గ సిద్ధాంతం చెప్పేరు.

మ: అవును. దానినే హిందువులు రాజయోగం అంటారు.

వె: ముముక్షువునకు యోగమార్గం మంచిదా?

మ: యోగం మనోనిగ్రహానికి సాయపడుతుంది.

వె: కాని అది అపాయకరములు అని చెప్పబడిన సిద్ధులు (గుప్తశక్తులు) తెచ్చుకోవడానికి ఉపయోగపడుతుందా?

మ: కాని నువ్వు “ముముక్షువు” (ఆధ్యాత్మ సాధకుడు) అని అన్నావు కాని సిద్ధులు కోరేవాడు అనలేదే!

## భాషణములు 21

శ్రీ ఎల్లప్ప చెట్టియార్ మద్రాసు ప్రెసిడెన్సీ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు, పలుకుబడిగల హిందువు. ఆయన అడిగేరు "శ్రవణము వలన కలిగిన జ్ఞానం కన్నా ధ్యానము వలన కలిగే జ్ఞానమే స్థిరమని ఎందుకు చెప్తారు?"

మహర్షి: అలా కాదు. కేవలం వినడం వలన అంటే పరోక్షజ్ఞానము స్థిరము కాదని, స్వానుభవము వలన కలిగినది అపరోక్ష జ్ఞానము స్థిరము అని చెప్తారు. అంతేకాదు, శ్రవణము బుద్ధితో సత్యమును అవగాహన చేసికొనడానికి సహాయపడుతుంది, మననము ఈ అవగాహనను స్పష్టం చేస్తుందని, చివరకు నిదిధ్యాసనము (ధ్యానము) సత్య సాక్షాత్కారాన్ని కల్గిస్తుందని చెప్పి ఉన్నారు. అలాగే ఇట్టి పరోక్షజ్ఞానము చాలునని, ఎందుకనగా ఇంతకుముందే, బహుశ పూర్వ జన్మలలో, అర్హతను పొందియున్న యోగ్యుడైన వ్యక్తి ఒక్కసారి మాత్రమే తనకు చెప్పబడిన సత్యాన్ని వినిన వెంటనే ఆత్మజ్ఞుడై అంటే పరమశాంతిలో సుస్థిరుడౌతాడు. అట్టి అర్హత లేని వ్యక్తి, సమాధి పొందుటకు ముందు, పైన నిర్దేశింపబడిన దశలను దాటి తీరవలెనని గట్టిగా నొక్కి చెప్పేవారు కూడా ఉన్నారు.

# భాషణములు 22

శ్రీమతి పిగాట్ మద్రాసు నుండి భగవాన్ దర్శనార్థియై మరల వచ్చేరు. ఆమె ఆహార నియమములకు సంబంధించి ప్రశ్నలు అడిగేరు.

భక్తురాలు: ఆధ్యాత్మిక సాధనలో నిమగ్నుడైన సాధకునికి ఎటువంటి ఆహారము నిర్దేశింపబడింది?

మ: సాత్త్వికము, అది కూడా మితంగా.

భ: సాత్త్వికాహారము అంటే?

మ: రొట్టె, పండ్లు, కాయగూరలు, పాలు మొదలైనవి.

భ: ఉత్తర భారతదేశంలో కొందరు చేపలు తింటారు. అలా చేయవచ్చునా? మహర్షి సమాధానం ఇవ్వలేదు.

భ: మా యూరోపియన్లకు ఒక విధమైన భోజనం అలవాటు. అది మారిస్తే ఆరోగ్యమేకాక మనస్సు కూడా బలహీనమవుతుంది. శరీర ఆరోగ్యము చూసుకోవాలి కదా?

మ: తప్పకుండా. శరీరం బలం తగ్గే కొద్దీ మనోబలం పెరుగుతుంది.

భ: మాకు అలవాటుపడ్డ భోజనం మారిస్తే ఆరోగ్యమూ మనోబలమూ కూడా క్షీణిస్తాయి.

మ: మనోబలమంటే మీ అర్థమేమిటి?

భ: లోకంతో సంగమును విడిచే శక్తి.

మ: ఆహార గుణం మనస్సుపై తన ప్రభావం చూపుతుంది. తినే ఆహారమే మనస్సును పోషిస్తుంది.

భ: నిజంగానా? అలా అయితే మా యూరోపియన్లు సాత్వికాహారంతో సరిపుచ్చుకొనేదెలా?

మ: (ఇవాన్స్ వెంట్జు ఉద్దేశించి) మేము తీసుకొనే ఆహారమే కదా నీవూ తీసుకొనేది? అది నీకు అనుకూలంగా లేదా?

ఇవాన్స్-వెంట్జ్: అనుకూలమే. కాని నేను ఈ భోజనానికి అలవాటుపడి పోయాను.

భ: అలా అలవాటు పడని వారి విషయమేమిటి?

మ: పరిస్థితులతో సర్దుబాటే అలావాటు. ప్రధానమైనది మనస్సు. నిజమేమిటంటే కొన్ని ఆహారపదార్థాలు రుచికరమైనవి, హితమైనవనీ మనస్సుకు నేర్పాలి. పోషక పదార్థాలు శాకాహారములోనూ, మాంసాహారములోనూ, రెంటిలోనూ సమృద్ధిగానే ఉన్నాయి. కాని మనస్సు తనకు అలవాటయిన వాటిని, రుచికరమని తాను తలచిన ఆహారాన్నే కోరుకుంటుంది.

భ: ఇదే విధంగా జ్ఞానికి కూడా ఆహార నియమాలు ఉన్నాయా?

మ: లేవు. ఆయన స్థిరంగా ఉంటాడు. తాను తీసుకునే ఆహారముతో ఆయన ప్రభావితుడు కాడు.

భ: మాంసాహారమును తయారు చేయాలంటే ఏదైనా జీవుని చంపవలసిందే కదా?

మ: యోగ సాధనా క్రమంలో అహింస అత్యంత ప్రధానమైనది.

భ: మొక్కలకు కూడా ప్రాణముంది కదా!

మ: అదే విధంగా నువ్వు కూర్చున్న రాతికి కూడా ప్రాణముంది!

భ: మేము క్రమంగా శాకాహారాన్ని అలవాటు చేసుకోవచ్చా?

మ: అవును, అదే మార్గము.

## భాషణములు 23

మరొకనాడు ఇవాన్స్ ్వంట్జ్ తన సంభాషణను ఇలా కొనసాగించాడు:

"ఒక వ్యక్తికి పలువురు ఆధ్యాత్మిక గురువులు ఉండవచ్చునా?"

మ: గురువు ఎవరు? ఎన్ని చెప్పినా సరే చివరకు గురువు ఆత్మయే. మనస్సు యొక్క పరిణితిని బట్టి ఆత్మ బయట గురువుగా వ్యక్తమౌతుంది. పురాతనుడూ, ప్రసిద్ధుడూ అయిన అవధూత యోగి (దత్తాత్రేయులు) తనకు ఇరవై నలుగురు కంటే ఎక్కువ గురువులు ఉన్నారని చెప్పారు. ఎవని నుండి మనము ఏదైనా నేర్చుకొనగలమో అతడే గురువు. అవధూతకు (దత్తాత్రేయులు) ఉన్నట్లు ఒకప్పుడు జడము (అచేతనము) కూడా గురువు కావచ్చు. ఈశ్వరుడూ, గురువూ, ఆత్మ అన్నీ ఒకరే.

ముముక్షువు (మోక్షము కోరేవాడు) ఈశ్వరుని (భగవంతుని) సర్వవ్యాపకునిగా భావించి, ఈశ్వరునే గురువుగా గ్రహిస్తాడు. కొంత కాలానికి భగవంతుడే వానికొక సశరీర గురువును సమకూరుస్తాడు. సాధకుడు ఆ మనుష్యునే సర్వమయునిగా గ్రహిస్తాడు. చివరకు ఆ సాధకుడు గురువు అనుగ్రహం వలన తన ఆత్మయే (అంటే తనే) సత్యవస్తువనీ, దానికి అన్యముగా ఏదీ లేదనీ తెలుసుకుంటాడు.

భ: భగవాన్ తన శిష్యులకు దీక్ష యిస్తారా?

మహర్షి మౌనం వహించారు.

కొంతసేపటికి ఒక భక్తుడు సమాధానమిచ్చే బాధ్యతను తనపై వేసికొని, ఇలా జవాబు చెప్పాడు.

"మహర్షి ఎవ్వరినీ తనకు వెలుపల ఉన్నట్లు తలంపరు. అందువలన ఆయనకు శిష్యులు లేరు. ఆయన అనుగ్రహము సర్వ వ్యాపకము. కావున మౌనంగానే ఆయన యోగ్యుడైన ఏ వ్యక్తిపైనైనా తన అనుగ్రహమును వర్షిస్తారు."

భ: ఆత్మజ్ఞానానికి శాస్త్ర అధ్యయనం ఎలా సహాయపడుతుంది?

మ: వ్యక్తిని ఆధ్యాత్మికతయందు ఆసక్తునిగా చేయునంత వరకే సహాయపడుతుంది.

భ: బుద్ధి ఎంతవరకు సహాయపడుతుంది?

మ: వ్యక్తి, బుద్ధిని అహంకారంలోనూ, అహంకారమును ఆత్మలోనూ కలిపే వరకే సహాయపడుతుంది.

## భాషణములు 24

శ్రీమతి పిగాట్: మీరు పాలు త్రాగుతారు కాని, గుడ్లు ఎందుకు తీసుకోరు?

మ: మచ్చిక చేయబడిన ఆవులు, తమ దూడలకు కావలసిన దానికంటే ఎక్కువ పాలు ఇస్తాయి. ఆ ఎక్కువ భాగం వదిలేస్తేనే వాటికి సుఖంగా ఉంటుంది.

భ: కోడిపెట్ట కూడా గ్రుడ్లను తనలో ఉంచుకోలేదు.
మ: కాని గుడ్లలోనుండి ప్రాణము కలుగవచ్చు.

భ: ఆలోచనలు తటాలున ఆగిపోయి, తర్వాత అంత హఠాత్తుగానే “నేను” నేను" అన్న స్ఫురణ పుట్టి కొనసాగుతుంది. అది అనుభవ విషయంగాని, బుద్ధికి సంబంధించినది కాదు. ఇది సరియేనా?

మ: నిస్సంశయంగా సరియే. "నేను-నేను” అన్న స్ఫురణ అనుభవంలోకి రావాలంటే ఆలోచనలు ఆగిపోవాలి. తర్కం పోవాలి. భావన ప్రధానం, తర్కం కాదు.

భ: అంతేకాక ఆ అనుభవం తలలోకాక రొమ్ము యొక్క కుడివైపున ఉంది.

మ: అవును. అది అలాగే ఉండాలి. ఎందుకంటే అక్కడ హృదయమున్నది కనుక.

భ: బయట చూడగానే అది మాయమవుతుందే, ఏమి చేయడం.

మ: దానిని గట్టిగా పట్టుకోవాలి.

భ: ఒక వ్యక్తి అట్టి స్మరణతో నిరంతరము ఉంటే, అతని పనులు ఎప్పుడూ సరిగా ఉంటాయా?

మ: అవి సరిగా ఉంటాయి. కాని ఆ వ్యక్తి పనులు ఒప్పులో, తప్పులో

పట్టించుకోడు. వాని పనులు దైవము చేసినవి. కావున అవి సరిగా ఉండి తీరవలె.

భ: అలా అయితే, అటువంటి వ్యక్తికి ఆహార నియమాలు ఎందుకు నిర్దేశించబడ్డాయి?

మ: నీ అనుభవం నీవున్న పరిసరాల ప్రభావం వలన కలిగినది. మరో పరిసరాల్లో (పరిస్థితులలో) ఈ అనుభవం సాధ్యమా?

ఆ అనుభవం కూడా వస్తూ పోతూ ఉన్నదే. అది శాశ్వతమయ్యే వరకు సాధన (అభ్యాసము) అవసరమే. ఈ అనుభవం మరల మరల కలగడానికి ఆహార నియమం సహాయపడుతుంది. వ్యక్తి ఆ సత్యమునందు సుస్థిరుడైనాక ఆహారనియమాలు వాటంతటవే సడలిపోతాయి. తినే వస్తువుల ప్రభావం మనస్సు పై పడుతుంది కాబట్టి ఆహారం శుద్ధమైనదిగా ఉంచుకోవాలి.

ఆమె తర్వాత ఒక శిష్యునితో అన్నది - "ఆయన నుండి వారి శక్తి తరంగాలు నన్ను గాఢంగా తాకుతున్నాయి. అందువలన హృదయ కేంద్రం చేరటం మునుపటి కంటే సులభతరం అవుతోంది?"

## భాషణములు 25

"ఆత్మ సాక్షాత్కారము (self realization)" రచయిత అయిన శ్రీ బి.వి. నరసింహస్వామి మునుపొక మారు భగవాన్ను ఇలా అడిగేరు. "నేను ఎవరు" దానిని తెలిసికోవడం ఎలా?"

మ: నిన్ను నీవే ప్రశ్నించుకో. అన్నమయకోశమనే ఈ దేహమూ, దాని ధర్మాలూ "నేను" కావు.

ఇంకా లోతుగా పోతే మనోమయకోశమనే మనస్సూ దాని వ్యాపారాలు "నేను" కావు.

ఆ తరువాతి మెట్టు ఈ ప్రశ్న: "ఈ ఆలోచనలూ ఎక్కడినుండి పుడుతున్నాయి?" ఈ ఆలోచనలు యాదృచ్ఛికముగానో, నామరూపాదులను బట్టియో, తర్కమూలంగానో జన్మిస్తాయి (పుడతాయి). అవి బుద్ధి యందు పనిచేస్తాయి. అలా అయితే వానిని తెలిసి కొనేవాడు ఎవరు? ఆలోచనల ఉనికి, వాని స్పష్టమైన రూపమూ, వాని వ్యాపారాలూ వ్యక్తికి తెలుస్తాయి. ఈ విశ్లేషణ వలన తెలిసేది ఏమిటంటే, వ్యక్తి యొక్క వ్యక్తిత్వము ఈ ఆలోచనల ఉనికిని వాని పరంపరను గుర్తిస్తుంది. ఈ వ్యక్తిత్వమే అహంకారము, లేదా ప్రజలు చెప్పే "నేను". ఇదే విజ్ఞానమయకోశమనబడే బుద్ధి. ఇది కూడా "నేను" యొక్క కోశమే. (ఆచ్ఛాదన లేదా తొడుగు వంటిది). నిజమైన "నేను" కాదు.

ఇంకా ప్రశ్నిస్తే, మరొక ప్రశ్న ఎదురౌతుంది. "ఈ నేను ఎవరు?" "ఎక్కడి నుండి ఇది వచ్చింది?" "నేను" అనేది నిద్రలో లేదే! అది తోచిన వెంటనే నిద్ర కలగానో, మెలకువగానో మారిపోతుంది. ప్రస్తుతం కలమాట అటుంచుదాం. మెలుకువ లోని ఈ "నేను" ఎవరు? "నేను" నిద్రలోనుండి జన్మించి ఉంటే, దాన్ని అవిద్య (అజ్ఞానము) కప్పి వుంటుంది. అట్టి అజ్ఞాన భరిత "నేను" వేదాలూ, జ్ఞానులూ చెప్పునట్టిది కాజాలదు. "నేను" నిద్రకు కూడా అతీతమైనది. "నేను" ఇప్పుడు ఇక్కడ ఉండి తీరాలి. అలాగే నిద్రలోనూ కలలోనూ కూడా ఆ అవస్థల (స్థితుల) లక్షణాలు లేకుండా ఉండి తీరాలి. అంటే "నేను" ఈ మూడు అవస్థలకు (జాగ్రత్ స్వప్న సుషుప్తి) అతీతంగా, వాటికి అధిష్ఠానంగా (వాటికి మూలంగా, ఆశ్రయంగా) ఆనందమయ కోశమును కూడా దాటి గుణాతీతంగా ఉండి తీరాలి. సంగ్రహంగా చెప్పాలంటే, "నేను" పంచకోశములకు అతీతమైనది, తర్వాత, అనాత్మ అయిన దానిని అంతటినీ నిరాకరించిన పిదప మిగిలి వెలిగేదే "నేను" సచ్చిదానందము.

ఖ: ఈ ఆత్మను అనుభవములోనికి తెచ్చుకునేదెలా?

మ: ఇప్పటి, పరస్పర ఆశ్రయ వ్యవహారస్థితిని దాటి పోవాలి. అప్పుడొకటి (ఆత్మ) తనకు భిన్నమైన దేనినో (అనాత్మను) చూస్తున్నట్లు తోస్తుంది. అనగా కర్త (విషయి) విషయము యొక్క ఎరుకతో ఉన్నాడు. చూచువాడు దృక్కు చూడబడేది దృశ్యము. ఈ రెండింటిలో అంతర్లీనమైన ఒక ఏకత్వము ఉండి తీరాలి. అదే "అహంకారము"గా పుడుతుంది. ఈ అహంకారమే చిత్ (బుద్ధి) యొక్క స్వభావము. అచిత్ (జడవస్తువు) చిత్ యొక్క అభావమే (లేక పోవడమే). కాబట్టి అంతర్లీనమైన మూలవస్తువు కర్తకు సంబంధించినదే కాని విషయమునకు కాదు. దృశ్యమంతా నశించే వరకు, దృక్కును వెదికితే ఆ దృక్కు క్రమంగా అత్యంత సూక్ష్మమై కేవల పరమార్థ దృక్కు ఒక్కటే మిగులుతుంది. ఈ విధానమును దృశ్యవిలయము (వస్తు ప్రపంచ అంతర్ధానము) అంటారు.

భ: దృశ్యములను ఎందుకు విడిచి పెట్టాలి? దానిని ఉన్నట్లే ఉంచితే సత్యానుభవం కలగదా?

మ: కలగదు. దృశ్యవిలయం అంటే విషయి విషయము (చూసేవాడు - చూడబడేది) వేరు వేరు అనే భావన తొలగించడం. విషయము (అంటే చూడబడేది మొ||) పారమార్థిక సత్యము కాదు. కేవలము వ్యావహారిక సత్యము మాత్రమే. దృశ్యమంతా (అహంకారముతో సహా) కూడా విషయమే. ఈ పారమార్థిక సత్యము కానిదాన్ని తొలగిస్తే మిగిలేదే సత్యము

(కేవల పరమార్ధ సత్యము). ఒక తాడును పాము అని భ్రమించినపుడు అది పాము అనే భ్రాంతిని తొలగిస్తే చాలు. సత్యము తెలుస్తుంది. భ్రాంతి తొలగకుండా సత్యము అవగతం కాదు.

భ: దృశ్య విలయము ఎప్పుడు, ఎట్లు సాధించాలి?

మ: వ్యావహారిక విషయి (కర్త) అనగా మనస్సు తొలగించబడినపుడే దృశ్యవిలయము పూర్తి అవుతుంది. విషయి విషయములను రెండింటినీ మనస్సే సృష్టిస్తుంది. ద్వైత భావనకు అదే మూలము. ఆత్మ పరిచ్ఛిన్నము, పరిమితము అనే భావనకు అదే మూలము. ఆ భ్రమకు ఫలితమైన దుఃఖమునకు కూడా అదే ఫలితము.
భ: ఈ మనస్సు ఎటువంటిది?

మ: ప్రాణము అభివ్యక్తమయ్యే మార్గములలో మనస్సు ఒకటి. ఒక కలప మొద్దునో, సూక్ష్మ యంత్రాన్నో మనస్సు అనరు. ప్రాణశక్తియే జీవిత వ్యాపారముగాను, దానిని తెలిసికొను చైతన్యంగానూ (మనస్సుగానూ) వ్యక్తమౌతుంది.

భ: మనస్సుకూ, విషయానికి గల సంబంధమేమి? మనస్సు తనకంటే వేరైన ఒక వస్తువుతో, అనగా ప్రపంచముతో సంసర్గము (సంబంధము) కలిగి ఉందా?

మ: ప్రపంచము కల మరియు మెలకువల్లో తెలుస్తుంది. లేదా ఈ ప్రపంచము గుర్తించుటకు మరియు ఆలోచనలకు విషయము. ఎందుకంటే ఈ రెండూ మనస్సు యొక్క వ్యాపారాలు. మెలకువ ఆలోచనలు, కల ఆలోచనలు లాంటివి లేకపోతే, ప్రపంచమును (జగత్తును) ప్రత్యక్షముగా గుర్తించలేము, అనుమానించలేము (ఊహించలేము). నిద్రలో ఇటువంటి వ్యవహారము లేదు, అందుచే వస్తువులుగాని, ప్రపంచముగాని నిద్రలో లేవు. కనుక నిద్రనుండి వెలువడిన అహంకారముచే ప్రపంచము సత్యము అను భావన కల్పితము కావచ్చును. ఈ ప్రపంచము సత్యము అను భావనను, ఆత్మ నిద్ర యందు తన స్వభావము వలన కబళించును లేదా అదృశ్యము చేయును. ప్రపంచము పుట్టుట, మాయమగుట సాలీడు తన గూడును సృష్టించుట, ఉపసంహరించుట వంటివి. జాగ్రత్ స్వప్న - సుషుప్తి (మెలకువ - కల - గాఢనిద్ర) ఈ మూడు అవస్థలకూ మూలమైన ఈ సాలీడు మనుష్యునిలోని ఆత్మ; దానిసే విశ్వపరంగా "బ్రహ్మము" (పరమాత్మ) అన్నారు. మనుష్యునిలోని ఆ ఈ పురుషుడూ, ఆదిత్యునిలోని అతడూ ఒక్కడే. (సయశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే స ఏకః) (త్రైత్తీరీయ ఉపనిషద్ 2.8.5; 3.10.4)

ఆత్మ లేదా బ్రహ్మము (సత్యము) అనభివ్యక్తముగా, నిష్క్రియంగా ఉన్నప్పుడు విషయి - విషయములు, దృక్ - దృశ్యములు (చూచేవాడు - చూడబడేది) మొదలైన ద్వంద్వములు లేవు. మనస్సు యొక్క మూలకారణమును అన్వేషణ చేస్తే మనస్సు, ఆత్మ లేదా బ్రహ్మము (సత్యము) యొక్క అభివ్యక్తము మాత్రమే అని తెలుస్తుంది. మనస్సునే సూక్ష్మ శరీరము అనియు, జీవుడే వ్యక్తిగతమైన ఆత్మ అని చెప్పబడును. వ్యక్తిత్వము మార్పుల యొక్క సారమే జీవుడు. వ్యక్తిత్వమే జీవుడు. ఆలోచన లేక మనస్సు దానియొక్క ఒక దశ, లేదా జీవుని యొక్క ఒక రకమైన అభివ్యక్తీకరణము. దీనియొక్క మొదటి స్థితి లేదా దశ వృక్షములు, లతలు మొదలైన జీవితము. ఈ మనస్సు ఎప్పుడూ మనస్సుకాని వస్తువు మీదో, ఇతర పదార్ధముల మీదో లేదా వాటికి సంబంధించో పని చేస్తున్నట్లు కనబడుతుంది కాని దానంతట అది పని చేస్తున్నట్లుగా ఉండదు. అందుచే మనస్సూ, పదార్థమూ (విషయములు) కలిసి ఉంటాయి.

## భాషణములు 26

భ: మనస్సు యొక్క స్వభావము అనగా దాని మూలకారణమును లేదా మనస్సు యొక్క పుట్టుకకు కారణమైన సత్యవస్తువును కనుగొనుట ఎలా?

మ: ప్రాముఖ్యతను బట్టి ఆలోచనలను ఒక క్రమంలో పెడితే "నేను" అన్న ఆలోచన అత్యంత ప్రధానమైనది. "అహం (నేను)" భావన ఆలోచనలన్నిటికీ కూకటివేరు, మూలస్కంధమూ (మూలస్తంభం). ప్రతీ భావమూ, ఆలోచన, ఒక వ్యక్తి

యొక్క ఆలోచనగానే పుడుతుందిగాని అహంకారముతో సంబంధము లేకుండా ఉన్నట్లు కనబడదు. కనుక ఆలోచనలనే వ్యవహారమంతా అహంకారము యొక్క పనియే.

ఉత్తమ పురుష (నేను) లేకుండా, ప్రథమ పురుష (వాడు), మధ్యమ పురుష (నీవు)లకు ఆస్కారము లేదు. "నేను" తోచకుండా "వాడు", "నీవు" తోచరు. ఈ విధంగా ఈ మూడూ కలిసి పుడతాయి. కలిసి మాయమౌతాయి. కనుక ఇప్పుడు ఈ "నేను" లేక వ్యక్తిత్వము యొక్క మూలకారణాన్ని వెతుకు. దేహధారియైన వ్యక్తికే "నేను" అనే భావన పుడుతుంది. కనుక అది ఒక దేహముతోగాని ప్రాణముతోగాని సంబంధము కలదై ఉండాలి. దానికని శరీరంలో ఏదైన ప్రత్యేకమైన స్థానం ఉందా?

వాక్కు, కామము మొదలైనవి మెదడుకు సంబంధించి ఉన్నట్లుగా, "నేను" భావన మెదడులోగాని, రక్తంలోగాని, ప్రేగులలోగాని ఏచోటికైనా సంబంధించి ఉన్నదా? ఆలోచన - ప్రాణములు మెదడుతో, వెన్నెముకతో ముడిపడి ఉన్నాయి. అక్కడి రక్తప్రసారము, వాటికి కావలసిన ఆహార, వాయువులు తగుపాళ్ళలో కలిసి నాడీపదార్థము (మజ్జ)గా మారుతుంది. దీనితోనే మెదడు, వెన్నుపాములు పుష్టిని పొందుతున్నాయి. ఈ విధంగా - కణప్రసారము, ఊపిరితీయుట, వదులుట; పోషణము మొదలగు వానితో సహా - వృక్ష జీవితము లేక ప్రాణశక్తి, జీవి యొక్క అంతర్భాగముగా లేదా సారముగా (లేదా వానియందు ఉన్నదానిగా) చెప్పబడుతుంది. ఈ విధంగా మనస్సును ప్రాణశక్తి యొక్క వ్యక్తరూపముగా భావించవచ్చు. దానికి హృదయం స్థానం కాబట్టి, మనస్సు జీవశక్తి యొక్క రూపమనీ, అది హృదయంలో నివసిస్తోందనీ అనుకోవచ్చు.

భ: మనోనాశము, దాని స్థానములో స్ఫురణ పెంపొందించాలంటే, ఆ రెండూ కూడా రెండు దశలా? లేక ఆ రెంటి మధ్య మనస్సు కానిది, స్ఫురణ కానిది ఏదైనా తటస్థమైన దశ ఉందా? లేదంటే మనోవ్యాపారము లేదు కాబట్టి అది ఆత్మజ్ఞానము (ఆత్మసాక్షాత్కారము)కు సంబంధించినదా?

మ: సాధకునికి ఈ రెండూ భిన్న దశలే. నిద్ర, కోమా, మూర్ఛ, ఉన్మాదము మొదలైన వాటితో కూడిన తటస్థమైన దశ కూడా ఉంది. దీనిలో మనో వ్యాపారము ఉండదు, ఆత్మ చైతన్యము ప్రవర్తించదు.

భ: ఆ మొదటి భాగాన్ని తీసుకుంటే, ఏవిధంగా మనస్సును తొలగించడం, వ్యావహారిక జ్ఞానాన్ని దాటడం?

మ: సహజంగానే మనస్సు చంచలం. దాన్ని ఈ చాంచల్యం నుండి తప్పించడం మొదటి మెట్టు. దానికి శాంతి చేకూర్చు. విక్షేపాలనుండి తప్పించు. లోపలకు చూసేటట్లు దానికి శిక్షణ ఇవ్వు. దీనిని ఒక అలవాటుగా (స్వభావముగా) చెయ్యి. ఇది బయట ప్రపంచాన్ని పట్టించుకోకపోవడం వలన, మరియు శాంతంగా ఉండడానికి కలిగే ఆటంకాలను నివారించడం వలన సాధ్యం.

భ: ఈ మనశ్చాంచల్యాన్ని మాన్పేదెలా?

మ: మనస్సును కలతపెట్టేవి బాహ్య సంపర్కం. తనకంటే వేరైన విషయాలతో పొత్తువలన మనస్సు చంచలమవుతుంది. అనాత్మయందు ఆసక్తి లేకపోవుట (వైరాగ్యము) మొదటి మెట్టు. తర్వాత వివేకము (అంతర్దృష్టి), ఆ తర్వాత ధ్యానము (ఏకాగ్రత) క్రమంగా అలవాటు అవుతుంది. వాటి లక్షణాలు మనస్సు, ఇంద్రియముల నిగ్రహము (శమము, దమము) వీని ద్వారా సమాధి (విక్షేపము లేని ఏకాగ్ర మనస్సు) కల్గుతుంది.

## భాషణములు 27

భ: వానిని అభ్యసించేదెలా?

మ: బాహ్య విషయముల నశించే స్వభావమును (అశాశ్వత స్వభావము లేదా క్షణభంగుర స్వభావమును) పరీక్షించుట అనే వివేకము వలన వైరాగ్యము కలుగుతుంది. కాబట్టి విచారము మనమెక్కవలసిన మొదటిమెట్టు. ఈ విచారము అప్రయత్నముగా సహజమైనపుడు, ధనకీర్తి భోగవిలాసాదుల పట్ల తిరస్కారభావం కలుగతుంది. "నేను" అన్న ఆలోచనపట్ల పరీక్ష స్పష్టమవుతుంది. "నేను" యొక్క మూలము హృదయం. ఇదే గమ్యం. ఒకవేళ సాధకుడు తాత్కాలికంగా ఈ విచారమార్గం (విశ్లేషణ ద్వారా లోపలికి చూచుట అనే పద్ధతి)కు అనుకూలంగా లేకపోతే, అతడు (లేక ఆమె) భక్తిని పెంచుకోవాలి. ఈ భక్తి ఒక ఆదర్శమునకై ఉండాలి. ఆ ఆదర్శం భగవంతుడు, గురువు, మానవజాతి, నైతిక నియమాలో (ధర్మమో) లేదా ఒక సౌందర్యభావము పట్ల అయినా ఉండవచ్చు. వీటిలో ఏదో ఒకటి ఆ వ్యక్తిని ముంచెత్తినప్పుడు (ఆవేశించినప్పుడు) ఇతర ఆసక్తులు సన్నగిల్లుతాయి, అంటే వైరాగ్యము (అసంగము) పెరుగుతుంది. ఆదర్శముయందు ప్రీతి పెరిగి చివరకు వేరే వాటికి తావీయదు. ఆ విధంగా ఏకాగ్రత తెలియకుండానే పెరుగుతుంది. ఇది దివ్యదృశ్య లేదా ప్రత్యక్ష సహాయములతోనో, అవి లేకుండానో కూడా జరుగుతుంది.

విచారం, భక్తీ ఈ రెండూ లేకపోతే, సహజమైన శాంతిదాయకమైన ప్రాణాయామమును ప్రయత్నించవచ్చు. దీన్ని యోగమార్గం అంటారు. ప్రాణానికి ముప్పు కల్గినప్పుడు ఆసక్తి అంతా ఆ ప్రాణ రక్షణలోనే కేంద్రీకృతమౌతుంది. శ్వాస బిగపట్టినప్పుడు, మనస్సు తనకు నచ్చిన బాహ్యవస్తువులవైపు పరుగెత్తలేదు. (పరుగెత్తదు). ఈ విధంగా శ్వాస నిలిచి ఉన్నంత వరకు మనస్సుకు శాంతి. ధ్యాస అంతా శ్వాస, దాని నియమనంపైనే ఉంటుంది. మిగిలిన ఆసక్తులు పోతాయి. నియమనం లేని (అడ్డదిడ్డంగా) శ్వాసవలన భావోద్వేగాలు (వాంఛలు) కలుగుతాయి. అదే మెల్లగా, క్రమంగా చేసే శ్వాసవలన శాంతి, ఆనందం కలుగుతాయి. ఆనందం ఉద్వేగం కూడా దుఃఖ ఉద్వేగంలాగే చాలా బాధ పెడుతుంది. ఈ రెంటిలో కూడా శ్వాస సక్రమంగా ఉండదు. (సంక్షోభంతో ఉంటుంది). నిజమైన శాంతే సంతోషము. (ఆనందము). భోగవిలాసాలు ఆనందాన్ని కల్గించవు. రాతిపైననో, చర్మంపైననో నూరిన కత్తివలె అభ్యాసం వలన మనస్సు సంస్కరించబడి నిశితమవుతుంది. అపుడు ఆ మనస్సు లోపలి మరియు బయటి సమస్యలను పరిష్కరించడానికి ఎక్కువ సమర్థవంతమౌతుంది. స్వభావంగా భక్తి విచార పద్ధతులు కుదరక, పరిస్థితులవలన లేదా వయస్సు వలన మూడవ పద్ధతి అయిన (యోగమార్గం) కూడా కుదరకపోతే ఆ వ్యక్తి కర్మమార్గము (సంఘసేవ లాంటి మంచి పనులు చేయుట) అవలంభించవచ్చు. ఆ వ్యక్తిలోని ఉదార స్వభావము వ్యక్తమవుట ఆరంభిస్తుంది. దానివలన వానికి దేనితోనూ సంబంధము లేకుండానే ఆనందము కలుగుతుంది. వానిలోని అహంకారము సన్నగిల్లి మంచితనము, సాధుత్వము పెరిగే అవకాశము కలుగుతుంది. అప్పుడతనికి పైన చెప్పిన మూడు మార్గాల్లో ఏదో ఒకటి అనుసరించేందుకు అవకాశము కలుగుతుంది. ఈ ఒక్క పద్ధతితోనే వాని స్ఫురణ (intuition) కూడా కల్గవచ్చు.

భ: ఒకే ఆలోచనా సరళిచేతగాని, ఒకే ప్రశ్నను పదేపదే వేసుకోవడం వలనగాని ఆత్మ సమ్మోహనము (self-hypnotism) జరుగుతుందా? విశ్లేషణకు వీలుకానిదీ, మౌళికమైనదీ, అస్పష్టమైనదీ, చేజిక్కనిదీ అయిన "నేను" అను భావమును వివరించుటకు తగినట్టి ఉపాయము చూడవద్దా?

మ: నిజమే కనుగొనవచ్చు. అది కళ్ళు మిరుమిట్లు గొలిపే స్పటికంలోనికో, వెలుగులోనికో, కాక ఏ శూన్యంలోనికో తేరిపార చూడడం వంటిదే.

భ: ఆ లక్ష్యముపై మనస్సును లగ్నము చేయగలమా? అది ఎలా?

మ: మనస్సు విక్షేపము పొందినచో "ఈ విక్షేపము ఎవరికి" అని ప్రశ్నించు. ఆ ప్రశ్న వెంటనే నిన్ను అహం ("నేను" అను) భావ స్థానమునకు తీసుకుపోతుంది. ఇది ఆచరణాత్మకమైనది.

భ: మనస్సు ఎంతకాలము హృదయమునందు ఉండగలదు లేక ఉంచబడగలదు?

మ: అభ్యాసము వలన ఆ కాలమును పొడిగించవచ్చు.

భ: ఆ అవధి ముగిసేక ఏమవుతుంది?

- మ: మనస్సు తన మామూలు స్థితికి వస్తుంది. హృదయము నందలి ఏకత్వము యొక్క స్థానమునందు నానావిధములయిన దృశ్య విషయములు చేరుతాయి. దానినే బహిర్ముఖమైన మనస్సు అంటారు. హృదయంగమమైన మనస్సును నిశ్చలమైన ప్రశాంత మనస్సు అంటారు.

భ: ఈ వ్యవహారమంతా బుద్ధికి సంబంధించినదా లేక అనుభవ ప్రధానమా?

మ: అనుభవమే.

భ: మనస్సు హృదయములో ఉన్నప్పుడు ఆలోచనలు ఎలా ఆగుతాయి?

మ: సంకల్ప బలం వలన, లేదా అలా అవుతుందని చెప్పే గురువు ఉపదేశంలో ప్రగాఢ విశ్వాసం వలన.

భ: ఈ పద్ధతి వలన కల్గే లాభం ఏమిటి?

మ: 1. సంకల్పం నెగ్గుతుంది ఏకాగ్రత పెరుగుతుంది.

2. మనోవికారాలపై విజయం - వైరాగ్యం పెరగడం.

3. ధర్మాచరణం పెరుగుతుంది అందరిపట్ల సమత్వం.

భ: ఆలోచించలేని దాన్ని గురించి ఆలోచిస్తూ వ్యక్తి తనను తాను సమ్మోహన పరచుకోవడం (self-hypnotism) ఎందుకు చెయ్యాలి? త్రాటకము (దీపమును చూడడం), ప్రాణాయామము, సంగీత శ్రవణం, అనాహత శబ్దములను వినడం, ప్రణవ (ఓంకార) ధ్యానం లేదా వేరే జప ధ్యానంలాంటి ఇతర పద్ధతులు ఎందుకు అవలంబించ కూడదు?

మ: త్రాటకము (వెలుగును అదే పనిగా చూడడం) వలన మనస్సు స్తబ్దమై, తాత్కాలికంగా అపస్మారం కలుగవచ్చు. దాని వలన శాశ్వతమైన ప్రయోజనం లేదు. ప్రాణాయామం కూడా సంకల్ప శక్తిని తాత్కాలికంగా జడం చేస్తుంది. సంగీత శ్రవణ ఫలితం కూడా అటువంటిదే. మంత్రము పావనమై, దివ్యమైన శక్తి సహాయము వలన ఆలోచనలను శుద్ధము చేసి వాటిని ఉన్నతమైన వానిగా మారిస్తేనే మంత్ర ధ్యానం ఉపయోగపడుతుంది. లేకుంటే దాని ఫలితం కూడా తాత్కాలికమే.

## భాషణములు 28

భ: ప్రాణాయామానికి, మనో నిరోధానికి సంబంధమేమిటి?

మ: బుద్ధి సంబంధమైన ఆలోచన; శ్వాసప్రక్రియ, రక్తప్రసారాది సకల జీవ వ్యాపారాలు రెండూ కూడా వ్యక్తి యొక్క జీవితంలో రెండు వేర్వేరు విషయాలు. ఈ రెంటికీ ప్రాణశక్తి (లేదా జీవితము) ఆధారము లేక ఆశ్రయము. (ఈ రెండూ ప్రాణముయందు, లేదా ప్రాణముతో కూడి ఉన్నాయి) వ్యక్తిత్వము, మిగిలిన
సకల వృత్తులూ, ప్రాణ వ్యాపారము ఈ శక్తినుండే పుడతాయి. శ్వాసనుగాని, ఇతర ప్రాణ వ్యాపారాలనుగాని బలవంతంగా అణచి వేస్తే ఆలోచనలు కూడా అణగిపోతాయి. ఆలోచనల వేగాన్ని మందగింపచేసి, దాన్ని ఒకచోట నిరుద్ధము చేస్తే, శ్వాసాది ప్రాణవేగం కూడా మందగించి, సమవేగమై, ప్రాణం నిలబడడానికి సరిపడే మాత్రంగా సన్నగిల్లుతుంది. ఈ రెండు పద్ధతులలోనూ ఆలోచనల విక్షేపం తాత్కాలికంగా ఆగుతుంది. వీటి పరస్పర సంబంధం మిగిలిన విషయాల్లో కూడా కనిపిస్తుంది. బ్రతకాలి అనే సంకల్పానికి సంబంధించి చూడు. ఇది ఆలోచనా శక్తి. అన్ని రకాల ప్రాణశక్తులూ సన్నగిల్లి, సుమారుగా పోతున్నప్పుడు కూడా ఈ సంకల్పమే చావును కొంచెం నిలిపేది (బాగుపరచేది). బ్రతకాలి అనే ఈ

సంకల్పశక్తి లేకపోతే మృత్యువు తొందరగా వస్తుంది. ఆలోచనే (తలంపె) ఈ శరీరంలోనూ, ఒక శరీరంనుండి ఇంకో శరీరానికి మారినప్పుడూ ప్రాణాన్ని తీసుకొని పోయేది అని అంటారు.

భ: 1. చిత్త ఏకాగ్రతకు మరియు
2. చిత్త విక్షేప నివారణకూ ఉపాయాలు ఏమి?

మ: శారీరికంగా జీర్ణాశయము మొదలగు అవయవాలను ఇబ్బంది పెట్టడం, ఉత్తేజ పరచడం చెయ్యకూడదు. అందుకై మితంగా, హితంగా ఆహారాన్ని తీసుకోవాలి. మిరపకాయలు, అతిగా ఉప్పు, ఉల్లిపాయలు, మద్యపానం, మత్తుమందులువంటి ఉత్తేజం కల్గించే పదార్థాలను వదిలేయాలి. మలబద్ధకమూ, మత్తు, ఉద్రేకములనూ కలిగించే పదార్థాలను దగ్గరకు రానీయకూడదు. ఇక మానసికంగా, ఒక లక్ష్యాన్ని ఎన్నుకొని దానియందే మనస్సును నిశ్చలం చెయ్యి. ఈ విషయంయందు ఆ శక్తి ఎలా ఉండాలంటే, వేరే ఎందులోనూ ఆసక్తి ఉండకూడదు. వైరాగ్యమన్నా, చిత్త ఏకాగ్రత అన్నా ఇదే. భగవంతుడో, మంత్రమో ఏదో ఒకటి ఎన్నుకోవచ్చు. అపుడు మనస్సుకు సూక్ష్మమును గ్రహించే నేర్పు అలవాటయి దానిలోనే నిమగ్నము కాగలదు.

భ: వాసనల వలన మనస్సు చలిస్తుంది. ఆ వాసనలను కూడా వదలడం వీలవుతుందా?

మ: అవును. ఎంతోమంది అలా చెయ్యగలిగారు. నమ్ము! తాము అలా చెయ్యగలమని నమ్మారు కనుక అలా చెయ్యగలిగారు. ఏ వాసనలూ తన్నంటని దానిపై మనస్సుని కేంద్రీకరించు. అప్పుడది సాధ్యమౌతుంది.

భ: ఈ అభ్యాసము ఎంతకాలం సాగాలి?

మ: విజయం సాధించేవరకు. యోగము- ముక్తి శాశ్వతమయ్యే వరకు. ఒక విజయం మరొక విజయం కల్గిస్తుంది. ఒక విక్షేపాన్ని జయిస్తే ఇంకో విక్షేపాన్ని జయించవచ్చు. ఈ విధానం అన్ని విక్షేపాలనూ జయించేవరకు కొనసాగించాలి. ఈ పద్ధతి ఎలాంటిదంటే, కోటనుండి వెలువడుతున్న శత్రు భటులను ఒక్కొక్కరినీ హతమారుస్తూ, చివరకి దుర్గాన్నే వశం చేసుకోవడం లాంటిది.

భ: ఈ పద్ధతికి గమ్యమేమి?

మ: సత్పదార్థ ప్రాప్తి. (సత్ సాక్షాత్కారం).

భ: సత్యస్వరూపము (లేదా తత్త్వము) ఏమిటి?

మ: 1. ఆది, అంతమూ లేని నిత్యస్థితి.

2. అవిచ్ఛిన్నమై, అనంతమూ, సర్వవ్యాపకమూ అయిన సత్తా.

3. అన్నిరూపాలలో, అన్నిమార్పులలో, అన్నిశక్తులలో, అన్ని పదార్థాలలో, అన్నిజీవులలో అంతర్లీనమైన సత్తా. అనేకములు (దృశ్యములు) మారును. కానీ ఏకం నిత్యము, శాశ్వతము.

4. త్రిపుటి, అనగా జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయములు. త్రిపుటి దేశ కాలములలో మాత్రమే గోచరించేది. సత్యవస్తువు దానికి ఆధారం. అతీతం కూడా. ఈ త్రిపుటి సత్యవస్తువు మీద ఎండమావులవంటిది. అది భ్రమ వలన కల్గుతుంది.

భ: "నేను" అనే తలంపుకూడా మిథ్య అయితే, ఆ మిథ్యను తొలగించు కొనేదెవరు?

మ: “తానె” మిథ్యయైన "నేను"ను తొలగించి "ఆత్మ"గా మిగులుతుంది. ఆత్మసాక్షాత్కారములో పైకి విరుద్ధంగా కనిపిస్తున్నా విరుద్ధంకాని విషయం. జ్ఞానులు ఇందులో ఏ విరోధాన్ని చూడరు. భక్తి విషయం చూడు. నేను ఈశ్వరుని దరిచేరి నన్ను తనలో కలుపుకొమ్మని ప్రార్థిస్తాను. విశ్వాసంతో ఏకాగ్రతతో నన్ను నేను అర్పించుకుంటాను. ఆ తర్వాత మిగిలేది ఏమిటి? మొట్టమొదట ఉన్న అహంకారంతో కూడిన “నేను” స్థానంలో, సంపూర్ణ ఆత్మ సమర్పణవల్ల మిగిలేది భగవంతుడే. దానిలో “నేను” అనే అహంకారం లీనమైపోయింది. దీనికే పరాభక్తి అనీ, ప్రపత్తి అనీ, శరణాగతి అనే పేర్లు. ఇది వైరాగ్యానికి పరాకాష్ఠ. సాధారణంగా నాదైన “ఇది అది" ఏవేవో వదుల్తూ వుంటావు. అందుకు బదులుగా "నేను - నాది" అనేవి వదిలేయి. అన్నీ ఒక్క దెబ్బతో వదిలిపోతాయి. సంగ్రహము (స్వంతము) అనే భావనా బీజమే నశిస్తుంది. చెడ్డను మొగ్గలోనే గిలిపేసి దాని బీజాన్ని దంచేసినట్లు అవుతుంది. అలా చెయ్యడానికి వైరాగ్యం చాలా దృఢంగా వుండాలి. నీట మునిగి చనిపోతున్నవాడు, పైకితేలి ప్రాణం దక్కించుకోవాలి అనే తహతహతో ఎలా ఉంటాడో అంత తీవ్రంగా సాధన ఉండాలి.

భ: గురువుగాని, ఇష్టదైవంగాని ఈ బాధను, శ్రమను తగ్గించలేరా? స్వస్వరూపాన్ని దర్శించే శక్తినివారు ఇవ్వలేరా? మనలను వారిగా మార్చి ఆత్మానుభవాన్ని ఇవ్వలేరా?

మ: సాధన మార్గంలో ఇష్టదైవం, గురువు ప్రబలంగా సాయపడేవారే! కాని ఆ సాయం ఫలించడానికి నీ ప్రయత్నం కూడా అవసరం. తప్పనిసరి. సూర్యుని చూడవలసింది నీవు. సూర్యుడుగాని, కంటి అద్దాలుగాని నీకై చూడగలవా? నీ నిజ స్వరూపాన్ని నీవు నీవుగానే చూడాలి. అందుకు పెద్ద సహాయం అవసరం లేదు కూడా!

భ: సర్వశక్తిమయుడగు భగవంతుని అపారశక్తికి, అల్పశక్తిమయుడైన జీవి సంకల్పశక్తికి (పురుషార్థమునకు) గల సంబంధమేమి?

1. భగవంతుని సర్వజ్ఞత్వము జీవియొక్క పురుషాకారము (free-will) కలిపి ఉండగలవా?

2. భగవంతుని యొక్క సర్వశక్తిమత్వానికి జీవియొక్క పురుషకారానికి పొత్తు కుదురునా?

3. ప్రకృతి ధర్మాలకు, భగవంతుని అమోఘ సంకల్పానికి సమన్వయమెలా?

మ: మన అల్పదృష్టికీ, మతికీ, ప్రస్తుతం మన చేతలు పురుషకారము (స్వతంత్ర సంకల్పము లేదా (free-will)గా కనబడుతున్నాయి. ఇదే అహంకారము, మన గతము కొన్ని ధర్మాలకు కట్టుబడినదిగా భావిస్తోంది. అంతేకాక ఈ పురుషకారము ధర్మనియమముల యొక్క క్రమంలో ఒక భాగంగా భావించబడుతుంది.

అహంకారము తన యొక్క పురుషకారము (free-will) ద్వారానే తాను అన్నీ చేస్తున్నట్లు భావిస్తుంది. ఈ దృష్టితోనే భగవంతుని సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్వాలను కూడా అహంకారము గుర్తిస్తుంది. దీనివలన జీవుడు బయట కనిపిస్తున్న వాటి ద్వారానే అహంకారము పనిచేస్తోంది అనే నిర్ణయానికి వస్తాడు. ప్రకృతి నియమాలు (ధర్మాలు) భగవంతుని సత్యసంకల్ప రూపాలు. అవి ఆయనచే ఏర్పరచబడినవే.

భ: విజ్ఞాన శాస్త్రము, మనస్తత్వ శాస్త్రము, శరీరమునకు సంబంధించిన జీవశాస్త్రము, వేదాంతము మొదలైనవి అధ్యయనము చేస్తే అవి 1. ఈ యోగ కౌశలమునకు, 2. ముక్తికి మరియు సత్యమే ఏకైకమని గ్రహించే ప్రజ్ఞనుగా ఇవ్వగలవా?

మ: చాలా కొంచెం. యోగానికి కొంత విద్య కావాలి. అది పుస్తకాల్లో దొరుకుతుంది. కాని కావలసింది వాటిని ఆచరణలో పెట్టడం, తెలిసి అభ్యసించే వారి ఉదాహరణ, వారితో పరిచయం, వారి ఉపదేశం, ఇవి అధికంగా సహాయం చేస్తాయి. ఇక రెండో విషయం. ఒక వ్యక్తి స్ఫురణచేత తెలిసికోవలసిన సత్యాన్ని గూర్చి, దాని ప్రవృత్తి, స్వభావాలను గూర్చి ఎంతో శ్రమ పడి ఒక నిర్ణయానికి రావచ్చు. అసలు స్ఫురణ అనుభవానికి సమానంగా ఉంటుంది. దానికి అభ్యాసం, అభ్యసించేవారి

పరిచయం అవసరం. కేవల పాండిత్యం వలన పెద్దగా ఉపయోగం లేదు. ఆత్మజ్ఞానం కలిగేక, పాండిత్యపు మాటలు, బరువులమూటై సముద్రంలో పారేసేదానికి తగినట్లుగా ఉంటుంది. అహంకారాన్ని అలా తొలగించడం సహజమూ, అవసరమూ కూడా.

భ: కల, మెలకువకు తేడా ఏమి?

మ: కలలో వ్యక్తి ఎన్నో రూపాలు తాలుస్తాడు. మెలకువ శరీరమునకు సంబంధించిన ఇంద్రియ విషయములను తల్చుకోగానే ఆ కలలోని రూపాలన్నీ ఈ శరీరంలోకి ప్రవేశిస్తాయి.

భ: సుఖ స్వరూపము ఏమిటి? అది ఆత్మనిష్ఠా? లేక విషయములోనిదా? లేక విషయి - విషయములకు గల సంబంధములోనిదా? నిత్య వ్యవహారాల్లో ఈ ఆనందము ఎక్కడా కనిపించదు. ఈ ఆనందం నిజంగా ఎటువంటి సందర్భాలలో వస్తుంది?

మ: ఇష్ట వస్తు సంబంధముగాని, దాని స్మృతిగాని కలిగి, అలాగే అనిష్ట వస్తువు సంబంధము దాని స్మృతులు లేనప్పుడు దానిని సుఖము లేదా ఆనందము అంటాము. నిజానికి ఈ సుఖము వ్యావహారికము. దీనిని సంతోషము (pleasure)అనడం మంచిది. కాని మనుష్యులు కోరేది సంపూర్ణము, శాశ్వతము అయిన ఆనందం. అది విషయములలో లేదు. అది పరమార్థ వస్తువులోనే ఉంది. ఇదే పరమశాంతి. ఇది బాధ-సంతోషములకు అతీతమైన మధ్యస్థమైన (తటస్థమైన) ఉదాసీన స్థితి.

భ: ఆనందమే మన సహజ స్వభావమంటారు కదా, అది ఏ అర్థంలో?

మ: పూర్ణసుఖమే బ్రహ్మము. పరిపూర్ణ శాంతి ఆత్మ లక్షణం. ఉన్నదదే, ఏకమూ, శుద్ధ చిత్స్వరూపము. వేదాంత విచారము చేతగాని, భక్తిమార్గ పర్యావలోచనం వల్లగాని తేలేదదే.

ఆనందానికై భగవంతుని ప్రార్థించి, వాని అనుగ్రహం వలన దాన్ని పొందుతాము. ఈ ఆనందాన్ని ఇచ్చేవాడు స్వయంగా ఆనందస్వరూపుడూ, అనంతుడూ అయి ఉండాలి. కావున ఈశ్వరుడే (భగవంతుడే) అనంతమైన శక్తి, ఆనందము గల ఇష్టదైవము. బ్రహ్మము ఆనందమయము, నిరాకారము, సంపూర్ణము. బ్రహ్మమునుండి, తర్వాత ఈశ్వరునినుండి జన్మించు పరిమితమైన జీవుల ఆధ్యాత్మిక స్వభావము కూడా ఆనందమే. జీవ శాస్త్రము ప్రకారము ఒక ప్రాణి ఏదైనా చేస్తోంది అంటే దానికి కారణం అట్టి పనులు సుఖముతో కలిసి ఉండడమే.

ఆహారము, వ్యాయామము, విశ్రాంతి, అందరితో కలవడం మొదలైనవి, వాటి వలన కల్గే సంతోషం ఇవి మన పెరుగుదలకు సాయపడతాయి. మనస్తత్వ శాస్త్రము ననుసరించి (తత్త్వ సిద్ధాంతపరంగా కూడా) సంతోష స్వరూపము ఇలాగే ఉండవచ్చు. మన స్వభావము ప్రధానంగా ఏకమూ, పూర్ణము, ఆనందమయమూ. ఇది అనుమానము (Hypothesis) గానే ఒప్పుకుందాం. పూర్ణమైన దివ్యత్వము, బ్రహ్మము. అదే భగవంతుడనీ, ప్రకృతి (మాయ) అనీ విభక్తం కావడంతో సృష్టి మొదలౌతుంది. ఆ మాయ రెండు విధాలు. 1. పరా మాయ. 2. అపరా మాయ. పరా మాయ ఈ సృష్టికి ఆధారము, ఆశ్రయము. అపరా మాయ పంచభూతాలూ, మనస్సూ, బుద్ధి మరియు అహంకారము (ఎనిమిది విధములు, అష్టకము).

జీవుడు పూర్ణుడే. కాని ఎదో ఒకచోట ఆ పూర్ణత్వము భంగమై ఏదో లోటు తోస్తుంది. అందులోంచి ఒక కోరిక, ఏదో పొందాలనో, ఏదో చెయ్యాలనో, ఆ కోరిక తీరగానే కొంత శాంతిస్తుంది. అహంకారము తృప్తిచెంది తిరిగి పూర్ణత్వాన్ని పొందుతుంది. అందుచేత సుఖం జీవి సహజస్థితి అనీ, స్వభావమనీ చెప్పవచ్చు. సుఖదుఃఖాలు వ్యావహారికాలు, పరిమితి గతికి చెందినవి. కోరిక తీరగానే పోతాయి. వ్యవహార సిద్ధమైన అభివృద్ధి ఆగి, వ్యక్తి బ్రహ్మములో అనగా పూర్ణ శాంత్యాత్మక వస్తువులో లీనమైనపుడు, వ్యక్తి క్షణికమైన, ద్వంద్వాత్మకమైన సంతోషమును వదలి పూర్ణ శాంత సుఖమును, పూర్ణమైన ఆనందమును అనుభవించగలడు. కనుక ఆత్మప్రాప్తియే సుఖము. అనంత జ్ఞాన దృష్టితో (అతి

లౌకిక దృష్టి – clairvoyance తోకాదు) తనను తాను ఆత్మగా గుర్తించుటయే, అదే మహోత్తమమైన శరణాగతి, స్వార్పణము. సంసారము దుఃఖమయము.

భ: అలా అయితే, పరిమితంగానైన ఈ సృష్టి, ఈ సంసారము, దుఃఖమయమూ, దుష్టమయమూ ఎందుకు అయింది?

మ: భగవదిచ్ఛ (భగవత్సంకల్పము).

భ: భగవంతుడు ఎందుకలా సంకల్పించేడు.

మ: అది అజ్ఞేయము (తెలుసుకొనుటకు వీలులేనిది) అతర్క్యము. ఆ సర్వశక్తికి ఇందులో ఏ నిమిత్తమునూ ఆపాదించలేము. సర్వసమర్ధము, సర్వజ్ఞము, అపరిమేయము అయిన అతనికి కోరిక ఏమిటి? సాధించవలసినది, పొందవలసినది ఏమిటి? ఆ దైవ సముఖాన (సమక్షములో) జరిగే ఏ కర్మలూ వానిని అంటవు. సూర్యుని ప్రాపంచిక కర్మలను చూడు. ఏకముగా ఉన్న బ్రహ్మము, అనేక మగుటకు ముందు దానికి బాధ్యతనూ, ఉద్దేశమునూ ఆరోపించడంలో అర్ధం లేదు. నిర్ణీత ఘటనల సందర్భంలో మటుకు, అత్యంత క్లిష్టమైన పురుషకార - ద్వైతవాదానికి ఈ దైవేచ్ఛ అనే సిద్ధాంతము చక్కని పరిష్కారము. మనకు సంబంధించినదిగాని, మనము చేసినదిగాని మనము చేయనిదిగాని; తగినవి చేయలేదని, తగనివి చేసామని వ్యధతో మనస్సు క్షోభపడే వేళల్లో, అందులో మన పురుషకారము (free will) ప్రమేయము, బాధ్యతలూ లేవని తప్పుకోవడం తెలివైనపని. దైవము సర్వవివేకి. సర్వశక్తిమంతుడు. మనం కేవలం విధి నిర్దిష్టాలైన పనిముట్లము (పరికరాలము). మనం చేసే పనులూ, పడే కష్టాలూ, ఆ భగవంతునికి ఎలా నచ్చితే అలాగే. అన్ని బరువు బాధ్యతలూ తనపైన వేసుకొని మనకాయన శాంతినిస్తాడు.

## భాషణములు 29

ఒకమారు సాయంకాలం ప్రశాంతంగా ఉంది. ఆకాశంలో మబ్బులు, అపుడపుడు పడుతున్న సన్నని తుంపరలకు చిరుచలి వేస్తున్నది. ఆశ్రమం హాలు కిటికీలు మూసి వున్నాయి. ఎప్పటివలే మహర్షి సోఫాపై కూర్చొని ఉన్నారు. ఆయనకు ఎదురుగా భక్తులు, కడలూరు బృందం వచ్చి ఉన్నది. అందులో ఇద్దరు ముదుసలి స్త్రీలు, ఒక సబ్జి. ఈ లోకంలో అశాశ్వతమైన, నశ్వరమైన అన్నిటి గురించి ఆయన ఈవిధంగా ప్రశ్నించారు.

"ఏకమూ, అవినాశి అయిన దానిని పొందుటకు సదసద్విచారణ (త్రికాల అబాధితమైన సత్యము - అదికాని అసత్యము లేదా మాయలకు సంబంధించిన వివేకము) మాత్రమే చాలునా?"

మ: జ్ఞానులూ, నిజమైన ముముక్షువులూ చెప్పి ఉన్నారు. బ్రహ్మనిష్ఠ మాత్రమే దానిని మనము తెలిసికొని అనుభవించేటట్లు చేయగలదు. అది మనకు సంబంధించినది మనలోనిది అగుట వలన, ఎంత విచారము చేసినా, అది మనలను సంగ పరిత్యాగము ద్వారా, ఆభాస విషయములను త్యజించుటకును, శాశ్వతమైన తత్త్వమును, సన్నిధిని మాత్రమే అంటిపెట్టుకొని ఉండుటకు ప్రోత్సహించుట ద్వారా మనలను ఒక మెట్టు ముందుకు తీసికొని పోగలదు.

ఆపైన సంభాషణ మరొకవైపు మళ్ళింది. "మోక్ష సామ్రాజ్య సిద్ధికి ఈశ్వరానుగ్రహము అవసరమా? జీవుని శ్రద్ధ, నిష్కపటమైన నిరంతర కృషి మాత్రము, ఎవనిని చేరుకుంటే మరల జనన మరణాలు కలగవో వానిని పొందుటకు చాలవా?

మహర్షి పెదవులపై అది, ఇది అనరాని మందహాసం విరిసింది. దివ్యమగు వారి ఉజ్జ్వలకాంతి, నలుదిశల వెలసి, అక్కడ ఉన్న వారిని చుట్టివేసింది. సత్యసారమూ, నిశ్చయమైన స్వరంతో మహర్షి ఇలా చెప్పారు. "ఆత్మ ప్రాప్తికి భగవదనుగ్రహం అవసరం. అదే భగవంతుడ్ని పొందేటట్లు చేస్తుంది. కాని అట్టి అనుగ్రహము, ముక్తి ప్రధానమూ, శ్రమయనక నిర్విరామంగా ప్రయత్నించే శ్రద్ధాళు భక్తునికీ, నిజమైన యోగికీ మాత్రమే ప్రాప్తిస్తుంది."

భ: యోగశాస్త్రాలలో ఆరుచక్రాలు చెప్పి ఉన్నారు. కాని జీవుడు హృదయంలో ఉంటాడంటారే! అది సరియేనా?

మ: అవును. జీవుడు గాఢనిద్రలో (సుషుప్తిలో) హృదయంలోనూ, మెలుకువగా ఉన్నప్పుడు మెదడునందు ఉంటాడు. హృదయము అంటే నాల్గు గదులతో కూడిన రక్తప్రసరణ చేసే మాంసఖండమనుకోరాదు. ఈ దృష్టిని బలపరిచే ప్రమాణ వాక్యాలున్నాయి. హృదయమనగా ఆ ప్రదేశ సమీపమున నరముల ముడి లేక నాడీ కేంద్ర సమూహము అనే అర్థాన్ని ఇచ్చే వాక్యాలు ఉన్నాయి. ఏ దృక్పథము సత్యము అనేది మనకు ముఖ్యము కాదు. ఆత్మకంటే తక్కువ విషయాలతో మనకు సంబంధం లేదు. ఆత్మ మనలోనిది. దానిపై సంశయాలు, చర్చలు అనవసరం.

"నేను" అన్న స్ఫురణ ఎందులోంచి వచ్చునో దానిని హృదయము అంటారని వేదశాస్త్రాలు చెప్తున్నాయి. ఆ స్ఫురణ ఈ మాంసపేటిక నుండి వస్తుందా? మన ఉనికిలో (సత్తులో) ఎక్కడో మధ్యప్రదేశంలో దాని స్థానం. ఆ “నేను”కు శరీరంలో ప్రత్యేకంగా ఒక తావంటూ లేదు. సర్వమూ అదే. అది తప్ప మరి వేరు ఏమీ లేదు. కాబట్టి లోకులూ, విశ్వం సర్వమూ, ఆత్మరూపున హృదయమే. కాని సాధకునికి సహాయంగా జగత్తులోనే, దేహంలోనే దానికొక నిర్ణీత స్థానం చూపించాలి. అందుకోసం హృదయాన్ని ఆత్మస్థానంగా చూపిస్తున్నాము.” కాని నిజానికి మనం అంతటా ఉన్నాము. ఉన్నదెల్లా మనమే. ఇతరమేమీ లేదు.

భ: చక్కగా విక్షేప రహితమైన మనస్సును (సమాధిని) సాధించడానికి దైవానుగ్రహము అవసరమన్నారు కదా! అది నిజమా?

మ: ఈశ్వరుడు మనమే. మనలను ఈశ్వరునిగా చూచు దృష్టియే దైవానుగ్రహము. అంటే దైవానుగ్రహం పొందడానికి దైవానుగ్రహమే అవసరం, అంటూ మహర్షి నవ్వసాగారు. అచటి భక్తులూ నవ్వులు కలిపారు.

భ: ఈశ్వర అనుగ్రహము, ఈశ్వర ప్రసాదములలో తేడా ఉందా?

మ: దైవచింతనే దైవ ప్రసాదము. దైవ స్వభావమే ప్రసాదము (తమిళంలో అరుళ్) దైవానుగ్రహంచేతనే నీకు దైవచింతన కలిగేది.

భ: గురువు అనుగ్రహం, ఈశ్వరానుగ్రహం వలన కల్గేదే కదా?

మ: ఆ ఇద్దరి మధ్య ఏల భేదం కల్పిస్తున్నావు? గురువు ఈశ్వరుడు ఒక్కరే. ఆయనకంటే వేరు కాదు.

భ: ధార్మిక జీవితం గడుపుకొంటూ, ఆత్మపై ఏకచింతన చేసే ప్రయత్నంలో పలుమారులు చ్యుతి, విఘ్నాలూ కలిగి ధ్యానము భంగమవుతోంది. ఏమి చేయాలి?

మ: చివరికదే చక్కబడుతుంది. నీ పట్టుదలే నీకు ప్రోత్సాహమిచ్చి, ధ్యానం భంగపడినప్పుడల్లా తిరిగి నీకు నిలకడనిస్తుంది. క్రమంగా అన్ని అంతరాయాలూ ఆగిపోతాయి. నీ ధ్యానధార మరింతగా సాగుతుంది. చివరికన్నీ సక్రమంగా ఫలిస్తాయి. స్థిర నిశ్చయముంటే చాలు.

## భాషణములు 30

దక్షిణదేశ నగరాల్లో ఒకచోట పెద్ద న్యాయవాది, ఎన్. నటేశయ్యర్, శాస్త్రాచారాలు పాటించేవాడు, ఇలా అడిగేరు.

“శివ విష్ణువులూ, కైలాస వైకుంఠాలూ నిజమేనా?

మహర్షి: నీ దేహంలో నీ ఉండేది ఎంత నిజమో, అవీ అంత నిజం.

భక్తుడు: నా శరీరంవలే, వాటికి వ్యావహారిక సత్యత్వం ఉందా లేక కుందేటికొమ్ములాగ అవి అసత్యములా?

మ: అవి ఉండడం నిజమే.

భ: అలా అయితే, వారు ఏదో ఒకచోట ఉండాలి కదా? ఎక్కడ ఉన్నారు?

మ: వారిని చూసిన వారు వారెక్కడో ఉన్నారని అంటున్నారు కదా. కనుక వారి మాట మనం ఒప్పుకుందాం.

భ: వారు ఎక్కడున్నారు?

మ: నీలో.

భ: అలా అయితే అది కేవలం తలంపే. దాన్ని, నేను సృష్టించి, నిగ్రహించవచ్చు.

మ: అంతా, అంతే కదా?

భ: కాని నేను అసలు అస్తిత్వమే లేని, కుందేటి కొమ్మును, సగం నిజమైన మృగతృష్ణలాంటి వాటిని ఊహించవచ్చు. అయినా నా కల్పనాశక్తితో సంబంధంలేని సత్యములు ఉన్నాయి కదా? ఈశ్వరుడూ, విష్ణువూ అట్టి సద్వస్తువులా?

మ: అవును.

భ: వారికి కూడా ప్రళయముందా?

మ: ఎందుకుండాలి? ఆత్మజ్ఞుడైన మనిషి ప్రళయాన్ని దాటి ముక్తుడు కాగల్గితే అంతకన్నా అపరిమేయమైన జ్ఞాన శక్తులు గల ఈశ్వరున కామాత్రం సాధ్యం కాదా?

భ: అయితే దేవతలూ, పిశాచములూ (భూతములు మొదలైనవి) కూడా ఉన్నట్లేనా?

మ: ఉన్నారు.

భ: మనము చైతన్య బ్రహ్మమును గ్రహించుట ఎట్లు?

మ: ఉన్నదేదో దానిగా తెలిసికోవాలి.

భ: వానిని స్వయం ప్రకాశమానమని అనుకోవచ్చునా?

మ: అది వెలుగు చీకటికి అతీతమైనది. జీవుడు ఆ రెంటినీ చూస్తాడు. ఆ రెంటినీ చూచే తెలివినిచ్చేది (జ్ఞానమంతుని చేసేది) ఆత్మ.

భ: ఆత్మలబ్ధికి "నేను దేహము కాను, కర్తనుకాను, భోక్తను కాను, అన్న

నేతి - నేతి మార్గం పాటించాలా?

మ: ఎందుకీ ఆలోచనలు? ఇప్పుడు నేను మనిషిని అనుకుంటున్నావా? అలా అనుకోకపోయినంత మాత్రాన మనిషివి కాకపోతావా?

భ: అలా అయితే "నేహ నా నాస్తికించన" (ఇక్కడ కొంచెం కూడా నానాత్వం లేదు) మొదలైన శృతి వాక్య స్మరణ చేయాలా?

మ: అది మాత్రం ఎందుకు?

భ: "నేను సత్యం" అని అనుకుంటే చాలా?

వ: ఆలోచనలన్నీ ఆత్మానుభూతికి విరుద్ధాలు, మనలను గురించిన ఆలోచనలనూ, అన్ని ఇతర ఆలోచనలనూ పరిహరించటమే సరియైన పద్ధతి. ఆలోచన ఒక విషయం. ఆత్మ నిష్ఠ అచ్చంగా వేరొకటి. (అంటే రెండూ పూర్తిగా విభిన్నమైనవి అని భావం).

భ: వ్యక్తి యొక్క ఆధ్యాత్మిక పురోగతిలో ఈ దేహాన్ని అదృశ్యం చేసుకోవడం అవశ్యకము లేక కనీసము లాభకరము కాదా?

మ: అలా అనుకోవడం ఎందుకు? అసలు నీవు దేహానివా?

భ: కాను, కాని ఆధ్యాత్మిక అభ్యున్నతి దేహమునందు ఒక మార్పును కల్గించాలి కదా?

మ: శరీరంలో నీవు కోరే మార్పు ఎటువంటిది? అది ఎందుకు?

భ: అంతర్ధానము (మాయమవడం) అభివృద్ధి చెందిన జ్ఞానమునకు నిదర్శనం కాదా?

మ: అలా అయితే, ఇతరులు చూస్తూ ఉండగా జీవితం గడిపినవారు, వారి

వాక్కులు, రచనలూ అన్నీ అజ్ఞానం అనుకోవాలా?

భ: కాని వసిష్ఠ, వాల్మీకులు అట్టి శక్తులు కలవారు కదా?

మ: జ్ఞానంతోపాటు అట్టి సిద్ధులను పెంచుకుంటే అది వారి ప్రారబ్ధము కావచ్చు. జ్ఞానానికి అవసరం కానివి, అంతరాయాలు కూడా కాగలవి నీకు లక్ష్యాలు ఎందుకు కావాలి? తన దేహం నలుగురికీ కనిపిస్తే జ్ఞాని ఏమైనా క్రుంగిపోతాడా?

భ: క్రుంగిపోడు.

మ: ఇంద్రజాలికుడు తటాలున మాయం కాగలడు. ఆ కారణం చేత అతను జ్ఞాని అవుతాడా?

భ: కాదు.

మ: కనిపించడం, కనిపించక పోవడం అనేవి చూచేవానికి (ద్రష్టకు) సంబంధించినవి. ఆ చూచేదెవడు? మొదట అది పరిష్కరించు. ఇతర విషయాలు అంత ముఖ్యం కాదు.

భ: సృష్టి ప్రక్రియను వేదాలు భిన్నభిన్నాలుగా చెప్పేయి. ఆకాశముతో సృష్టి ప్రారంభమని ఒకచోట, కాదు ప్రాణమని ఒకచోట, జలమని ఇంకొక చోట, మరొక చోట మరొకటి, వీనికి సమన్వయమెలా? అనేక వాక్యత వలన వేదాలలో నమ్మకము పోదా?

భ: వేర్వేరు కాలాల్లో, వేర్వేరు ఋషులు సత్యాన్ని భిన్న కోణాలలో చూసారు. తమ తమ దర్శనాన్ని చక్కగా వర్ణించారు. వారి వాక్కులలో విరోధముంటే నీకేం బాధ? అనశ్వరమైన ఆత్మతత్త్వాన్ని ఉపదేశించి, అదే నీవని చూపటమే వేదము యొక్క ప్రధాన లక్ష్యము.

భ: అంతవరకు నాకు నచ్చింది.

మ: మరి ఇతరమంతా అర్థవాదమనుకో. (ముఖ్య లక్ష్యానికి సహాయంగా ఉండే యుక్తి) సృష్టి క్రమాదికాలను తెలియగోరే అజ్ఞానుల కొరకు ఆ మాటలు.

భ: నేను పాపిని. హోమాది నిత్యకర్మలొనర్చిన వాడిని కాను. ఆ కారణంగా నాకు బాధాకరమైన పునర్జన్మలు తప్పవా? తమరు కరుణతో నన్ను రక్షించాలి.

మ: పాపివని అనుకోవటం ఎందుకు? దైవమందలి విశ్వాసమే నిన్ను పునర్జన్మలనుండి రక్షించుటకు సమర్థము. అన్ని భారాలూ ఆయనపై మోపు. తిరువాచకంలో ఇలా అన్నారు. "నేను కుక్క కన్నా నీచుడను. అయినా కరుణతో నన్ను రక్షించ పూనుకొన్నావు. ఈ జనన - మరణాల భ్రమను నీవే కల్పించావు. ఇంతకూ వితర్కించి ఇదమిత్థం అని నిర్ణయించడానికి నేనెవణ్ణి? ఇక్కడ నేను ప్రభువునా? ఓ మహేశ్వరా! పుట్టుక - చావులతో అనేక దేహములందు నన్ను పొరలింతువో లేక నీ చరణ సన్నిధియందు స్థిరముగా నిలుపుదువో, అది నీ ఇష్టము?" అందుచేత విశ్వాసంతో ఉండు. అది నిన్ను రక్షిస్తుంది.

భ: స్వామీ! నాకు విశ్వాసముంది. కాని అడుగడుగునా విఘ్నాలే. నేను ఏకాగ్రతను అభ్యసించిన వెంటనే బలహీనత, తల తిరగడం నన్ను బాధిస్తున్నాయి.

మ: ప్రాణాయామం సరిగా చేస్తే శక్తి వస్తుంది.

భ: ఉద్యోగ రీత్యా నాకెంతో పని ఉంది. కాని కోరిక మాత్రం సదా ధ్యానంలో గడపాలని. ఈ రెండూ పరస్పరమూ విరుద్ధములా?

మ: అవి విరుద్ధాలు కావు. నీవు రెండింటిని అభ్యసించి నీ శక్తులను పెంచుకొన్న కొలది రెంటిని నిర్వహించ సమర్థుడవౌతావు. ఉద్యోగ ధర్మాలు కలవలె కనిపిస్తాయి. భగవద్గీత ఇలా చెప్తోంది.

“యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ। యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతోమునేః॥ (భ.గీ. 2-69)

"సర్వ జీవులకు రాత్రి అయినది(శాశ్వత సత్య వస్తువు) యోగికి జాగ్రత్. జీవులు మేల్కొన్న విషయాలను (అశాశ్వత విషయాలను) ముని గుర్తించడు.

## భాషణములు 31

ఒక దర్శనార్థి: మోక్షమును పొందటానికి ఏమి చేయాలి?

మహర్షి: మోక్షమంటే ఏమిటో తెలిసికో.

భ: దానికై ఉపాసనా చేయాలా?

మ: ఉపాసన చిత్త నిరోధానికి, ఏకాగ్రతకు ఉపయోగపడుతుంది.

భ: విగ్రహారాధన చెయ్యాలా? దానిలో హాని ఏమయినా ఉన్నదా?

మ: "దేహమే నేను" అని భావిస్తున్నంత కాలం నష్టం లేదు.

భ: జనన - మరణ చక్రం నుండి బయటపడేదెలా?

మ: దాని అర్థమేమో తెలిసికో,

భ: నేను భార్యను, కుటుంబాన్ని వదలవద్దా?

మ: వారు నీకు ఎలా హాని చేస్తారు? మొదట నీవెవరో తెలిసికో.

భ: వ్యక్తి తన భార్యను, సంపదను, గృహాన్ని వదలాలి కదా?

మ: మొట్టమొదట సంసారం అంటే ఏమిటో తెలిసికో. అదంతా సంసారమా?

వాటి మధ్యలో ఉంటూ ఆత్మానుభవం పొందుతున్నవారు లేరా?

భ: దానికి కావలసిన సాధనాక్రమం ఏమిటి?

మ: అది సాధకుని యోగ్యతా, స్వభావాలను బట్టి ఉంటుంది.

భ: నేను విగ్రహారాధన చేస్తాను.

మ: దాన్నే సాగించు. దానివలన చిత్తం ఏకాగ్రమౌతుంది. ఏకాగ్ర చిత్తుడవుకా, అంతా చక్కబడుతుంది. మోక్షమెక్కడో ఉందనీ, దాన్ని వెతికి పొందాలని అందరూ అనుకుంటూ వుంటారు. అది పొరపాటు. మోక్షమంటే నీలో ఉన్నదానిని తెలిసికోవడమే. ఏకాగ్ర చిత్తుడవయినచో నీవు దాన్ని పొందగలవు. నీ మనస్సే జనన - మరణ చక్రం (సంసారం).

భ: నా మనస్సు చాలా చంచలమైనది. ఏమి చెయ్యాలి?

మ: ఏదో ఒక విషయం మీద నీ దృష్టిని లగ్నం చెయ్యి. దాన్ని గట్టిగా పట్టుకొనే ప్రయత్నం చెయ్యి. అంతా చక్కబడుతుంది.

భ: ఏకాగ్రత కష్టంగా ఉంది.

మ: అభ్యాసం చేస్తూ వుండు. అది ఊపిరి పీల్చుకొనేంత సులువౌతుంది. నీవు సాధించగల్గిన అన్నింటిలో అదే తలమానికంగా ఉంటుంది.

భ: మద్యాదుల విసర్జన, ఆహారశుద్ధి సహకారులు అవుతాయా?

మ: అవును. సహాయకారులౌతాయి.

అపుడు మహర్షి మనస్సును ఏకాగ్రం చేసి మౌనంగా శూన్యంలోకి చూచి ఆ విధంగా పృచ్ఛకునికి ఉదాహరణ చూపేరు.

భ: నాకు యోగము అవసరమా?

మ: అది మాత్రమేమిటి! ఏకాగ్రతకు సాధనమే కదా?

భ: ఏకాగ్రత బలపడడానికి కొన్ని సహాయాలు ఉంటే మంచిది కాదా?

మ: ప్రాణాయామాదులు అట్టివే.

భః ఈశ్వర దర్శనం సాధ్యం కాదా?

మ: ఎందుకు కాదు? అదీ, ఇదీ అన్నీ చూస్తున్నావు కదా. అట్లే అదీనూ, కాని ఈశ్వరుడంటే యేమో ముందు తెలిసికొంటే మంచిది. ఈశ్వరుని అందరూ ఎప్పుడూ చూస్తూనే ఉన్నారు. కాని అది వారికి తెలియడం లేదు. చూస్తూనే ఉన్నా, చూడని వారే అవుతున్నారు. ఎందుకంటే ఈశ్వరుని వారు ఎరుగరు కనుక.

భ: నేను విగ్రహారాధన చేసేటప్పుడు, మంత్ర జపమును, అంటే రామ, కృష్ణ మొదలైన నామాలను కూడా జోడిస్తే మంచిదా?

మ: మానసిక జపము చాలా మంచిది. ధ్యానానికది దారి తీస్తుంది. మనస్సు జపంతో తాదాత్మ్యము చెందిన తర్వాత నిజానికి పూజ అంటే ఏమిటో నీకు తెలుస్తుంది. పూజించబడే వస్తువులో వ్యక్తి యొక్క వ్యక్తిత్వము లీనమవడమే నిజమైన పూజ.

భ: పరమాత్మ మనకెప్పుడూ వేరుగా ఉన్నాడా?

మ: సామాన్యంగా అలాగే అనుకుంటారు. కాని అది నిజం కాదు. నీకతడు అభిన్నుడని భావించడం మొదలుపెట్టు. అపుడు ఈశ్వరునితో ఆత్మైక్యమును సాధిస్తావు.

భ: భగవంతునితో ఏకం కావడమే కదా, అద్వైతము బోధించేది?

మ: ఏకం కావడమేమిటి? ఈ ఆలోచన చేసేవాడు ఎప్పుడూ ఆత్మయే, సత్యమే. చివరికదే అనుభవంలో గ్రహిస్తాడు. నిద్రలో, కలలో మనం మన నిజ స్వరూపం మరచిపోతాము. కాని భగవంతుడు ఎల్లప్పుడూ ఉండే జ్ఞానమే.

భ: విగ్రహారాధనతోపాటు, గురువు మార్గదర్శకత్వం అవసరం కాదా?

మ: ఉపదేశం లేకుండా దానిని నీవు ఎలా ప్రారంభించావు?

భ: పురాణాలవలన.

మ: సరే, ఎవరైనా నీకు భగవంతుని గురించి వివరించారనుకుందాం. లేదా భగవంతుడే స్వయంగా వివరించాడనుకుందాం. అలా అయితే భగవంతుడే నీకు గురువు. గురువు ఎవరైతేనేం? గురువు, దైవం ఆత్మకు భిన్నము కావు. గురువే దైవం. ఆఖరికదే బోధపడుతుంది. మానుష గురువునకు దైవ గురువునకు వ్యత్యాసం లేదు.

భ: మనము చేసిన పుణ్యకర్మల ఫలితము మనలను వదలదని నా ఆశ. (నమ్మకం),

మ: ఆ విధంగా నువ్వు నీ ప్రారబ్ధాన్ని అనుభవిస్తావు.

భ: జ్ఞాని అయిన గురువు మార్గం చూపితే, చాలా సాయం కాదా?

మ: నీకు ఉన్న తెలివితో ప్రయత్నం నీవు చేస్తే నీ గురువు నీకు దొరుకుతాడు.

ఎందుకంటే తనకు తానై నిన్ను వెదుకుతూ వస్తాడు కనుక.

భ: ప్రపత్తి (ఆత్మసమర్పణము)కి, ఋషుల యోగమార్గానికీ భేదముందా?

మ: జ్ఞానమార్గము, భక్తిమార్గము (ప్రపత్తి) ఒక్కటే. విచారణవలె, ఆత్మ సమర్పణ కూడా ఆత్మానుభవాన్ని కల్గిస్తుంది. సంపూర్ణమైన శరణాగతి అంటే నీకు ఇక "నేను" అన్న ఆలోచన ఉండదని అర్థం. అప్పుడు నీ సంస్కారాలన్నీ ప్రక్షాళితాలై నువ్వు ముక్తుడవౌతావు. ఈ రెండు మార్గలలోనూ చివరకు నీకు వ్యక్తిత్వము మిగలడానికి లేదు.

భ: కర్మఫలం చేత స్వర్గాది లోకాలకు పోమా?

మ: నీ ఇప్పటి ఉనికి ఎంత నిజమో అవీ అంతే నిజం. మనం ఎవరమో విచారించి ఆత్మను తెలిసికొంటే, స్వర్గాదుల చింత ఎందుకు?

భ: పునర్జన్మనుండి తప్పించుకోడానికి ప్రయత్నించొద్దా?

మ: సరే, పుట్టిన వాడెవడో, ఇప్పుడు బాధపడుతున్న వాడెవడో చూడు. గాఢనిద్ర (సుషుప్తి) లో ఉన్నప్పుడు పునర్జన్మల గూర్చిగాని, నీ ఇప్పటి జన్మగూర్చిగాని ఆలోచించేవా? కాబట్టి నీ ఈ సమస్య ఎక్కడునుండి వచ్చిందో తెలుసుకో. పరిష్కారము దాని వెంటనంటే ఉంటుంది. పుట్టుకలేదు, ప్రస్తుత సమస్యలూ లేవు. దుఃఖము మొదలైనవి లేవని నీకే అర్థమౌతుంది. అదే సర్వమూ, అదే ఆనందం. దీనివలన పునర్జన్మ లేకుండా అయిపోతుంది. ఇంక పునర్జన్మవలన వచ్చే దుఃఖం గురించి మాటలేల!

## భాషణములు 32

ఒక దర్శనార్థి: మహాత్ములైన శ్రీ చైతన్య మహాప్రభు, రామకృష్ణ పరమహంస మొదలైనవారు భగవత్సన్నిధిలో విలపించి సిద్ధిపొందారు. ఆ మార్గం అవలంబించ వచ్చునా?

మ: అవును. ఈ అనుభవాల మధ్యలోంచి వారిని ఆకర్షిస్తూ బలీయమైన మహాశక్తి ఒకటుంది. ఆ మహాశక్తిని నమ్ముకో. నిన్నూ నీ గమ్యం చేరుస్తుంది. కన్నీళ్ళూ బలహీనతా లక్షణమంటారు. కాని పైన పేర్కొన్న వ్యక్తులు బలహీనులు అనడానికి లేదు. వారి కన్నీళ్ళు వారిని వశపరచుకొన్న మహా ప్రవాహం యొక్క తాత్కాలికమైన గుర్తులు మాత్రమే. మనం వారు సాధించిన లక్ష్యాన్ని గుర్తించాలి.

భ: ఈ భౌతిక దేహం అదృశ్యమై శూన్యంలో కలిసేట్లు చేయవచ్చా?

మ: ఎందుకీ ప్రశ్న? నీవు నీ దేహమేమో కనుక్కో

భ: వసిష్ఠ, విశ్వామిత్రులవలె మనమూ అంతర్ధానం కాగలమా?

మ: ఇవన్నీ కేవలం భౌతిక విషయాలు, మనకి ఆ శక్తి ఉన్న విషయాలలో ఇవి ప్రధానమా? నీవు ఆత్మవు కాదా? మిగిలిన విషయాల గురించి చింత ఎందుకు? సారాన్ని గ్రహించు. మిగిలిన విషయాలను సిద్ధాంతాలుగా గుర్తించి విడిచి పెట్టు. ఈ శరీరం మాయమవడం ముక్తి మార్గానికి ప్రధానం అనుకొన్నవారు తప్పే. అలాంటిదేమీ అవసరం లేదు. నువ్వు ఈ శరీరం కాదు. అది ఒక విధంగానో, వేరే విధంగానో మాయమవడంలో విశేషం ఏముంది? ఇలాంటి దానితో పెద్ద ప్రయోజనం ఏమీ లేదు. గొప్ప, తక్కువ ఎందులో ఉన్నాయి? సత్యాన్ని పొందడమే నిజమైన గెలుపు. "నేను" అనేది పోవడం ప్రధానం. దేహం మాయమవడం కాదు. ఆత్మ ఈ శరీరంతో తాదాత్మ్యం పొందడమే నిజమైన బంధం. ఈ తప్పు భావనను వదిలేసి, సత్యాన్ని అంతర్ దృష్టితో గుర్తించు. అదొక్కటే ఉపయోగపడుతుంది. ఒక బంగారు ఆభరణాన్ని, ఆ బంగారు పరీక్షకోసం కరిగిస్తే, అది ఎలా కరిగిస్తే ఏం? పూర్తిగానా, దాని వేరేవేరే భాగాలు కరిగించామా లేక అది ఏ ఆకారంలో ఉంటే ఏం? మన ఆసక్తి అంతా బంగారంలో ఉంది. చనిపోయిన వ్యక్తి తన దేహాన్ని చూడగలడా? మిగిలి ఉన్నవాడు కదా ఆ దేహంతో సంబంధం ఎట్లు తెగిందో ఆలోచించవలసింది. ఆత్మజ్ఞునికి చావులేదు. దేహమున్నా సరే, పోయినా సరే. వానికి ఆ దశలు రెండూ సమానమే. అతడు భేదాన్ని చూడడు. ఆ రెండింటిలో ఏ స్థితి మేలు అని అతడు తర్కించడు. జ్ఞాని దేహానికి ఏ గతి అయినా చూచేవాడు పట్టించు కోవలసిన అవసరం లేదు. నీ పని నీవు చూసుకో. ఆత్మను తెలుసుకో. ఆ తర్వాత నువ్వు ఎలా మరణిస్తే మేలో ఆలోచించడానికి కావలసినంత అవకాశం ఉంటుంది. ఆత్మ దేహంతో తప్పుగా కల్పించుకొనే తాదాత్మ్యం ఎలాంటి చావు మేలు మొదలైన చర్చలకు కారణం. నీవు అసలు దేహానివా? గతరాత్రి నిద్రలో నీకు నీ దేహ స్మృతి ఉందా? లేదే! ఇప్పుడు ఉండి నిన్ను బాధించేది ఏమిటి? అది "అహంకారం" దాన్ని వదుల్చుకొని సుఖంగా ఉండు.

## భాషణములు 33

ఒక దర్శనార్థి: "బ్రహ్మ సత్యం, జగన్మిథ్య" (పరబ్రహ్మము సత్యం, ప్రపంచము మిథ్య) అనేది శ్రీశంకరాచార్యుల వారి ప్రసిద్ధ వాక్యం. అయితే వేరే కొందరు "ఈ ప్రపంచం సత్యం" అని కూడా అంటారు. ఏది నిజం?

మ: రెండూను. మనఃపరిణతిని బట్టి, దశా భేదాలను బట్టి, విభిన్న దృక్పథాలలో అలా అంటారు. సత్యము అంటే సదా ఉండేది అనే నిర్వచనంతో సాధకుడు ప్రారంభిస్తాడు. తర్వాత అతడు ప్రపంచం మారుతూ ఉంటుంది కాబట్టి దాన్ని అసత్యమని నిరాకరిస్తాడు. ప్రపంచం నిజం కావడానికి వీలులేదు, “నేతి - నేతి" (న ఇతి - న ఇతి అంటే ఇది కాదు - ఇది కాదు) అని అతడు తర్కించుకుంటాడు. సాధకుడు చివరకు ఆత్మను చేరి అక్కడ ఏకత్వాన్ని ప్రబలమైన లక్షణంగా దర్శిస్తాడు. ఆ పిమ్మట, మొదట అసత్యమని నిరాకరించినది ఆ ఏకత్వములోని అంశమే అని గుర్తిస్తాడు. సద్వస్తులో లీనమైన వానికి, జగత్తు కూడా సత్యమే. ఉనికి “ఆత్మస్థితి” అది తప్ప మరేదీ లేదు. కొందరు వేదాంతులు సత్యానికి వేరే అర్థం చెప్పి, ఆ పదాన్ని వస్తు విషయాలకు అన్వయిస్తారు. ఆధ్యాసిక సత్యంలో (అంటే ప్రతిబింబిత సత్యంలో) తారతమ్యాలు ఉంటాయి.

1. వ్యావహారిక సత్యం - దైనందిన జీవితం. ఈ కుర్చీ నాకు కనబడుతోంది. కనుక సత్యం.

2. ప్రాతిభాసిక సత్యం - (భ్రాంతి). రజ్జు సర్పభ్రాంతి. తాడును చూసి పామనుకున్న వానికి, ఆ పామే సత్యము. ఇది కొన్ని సమయాల్లో, కొన్ని సందర్భాల్లో మాత్రమే జరుగుతుంది.

3. పారమార్థిక సత్యం - (ఉత్తమోత్తమం, చరమస్థితి) సత్యము ఎప్పుడూ ఒకే విధంగా ఉండేది. మార్చలేనిది.

సత్యము అనే పదాన్ని విస్తృతమైన అర్థంలో వాడితే జగత్తు వ్యావహారిక, ప్రాతిభాసిక సత్యాలు రెండూనూ. కొందరు నిత్యవ్యవహారంలో మనకు కనబడేది వ్యావహారికంగా కూడా సత్యం కాదనీ, ఇదంతా మనఃకల్పితమేనని అంటారు. వారి ప్రకారం, ఈ ప్రపంచం కేవలం ప్రాతిభాసికం. (మాయ).

# యోగిరామయ్యగారి స్వానుభవ కథనం

## భాషణములు 34

మహర్షి సన్నిధిలో కూర్చుంటే మనశ్శాంతి చేకూరుతుంది. మూడు నాల్గుగంటలు నేను సమాధిలో గడిపేవాణ్ణి. నా మనస్సు ఒక రూపాన్ని పొంది వెలుపలికి వచ్చినట్లు తోచేది. నిరంతర అభ్యాసము మరియు ధ్యానం వలన నా మనస్సు హృదయంలో ప్రవేశించి దానిలో లీనమైంది. అందుచేత మనస్సు విరామ స్థానం హృదయమని గ్రహించాను. దాని ఫలితం శాంతి. మనస్సు హృదయంలో లీనమైనప్పుడు ఆత్మసాక్షాత్కారం కల్గుతుంది. ఈ విషయం ధారణా స్థితిలో కూడా అనుభవం అవుతుంది.

ధ్యానాన్ని గురించి వివరించమని అడిగితే మహర్షి ఇలా అన్నారు.

“ఎవరైనా చనిపోతే వానికి చితిపేర్చి దేహాన్ని దానిపై పడుకోబెట్టి చితికి నిప్పు ముట్టిస్తారు. మొదట చర్మము, తర్వాత కండరాలు, ఆ వెనుక ఎముకలు, సర్వము కాలి భస్మమౌతాయి. ఆ మీద ఉన్నదేమి? మనస్సు. దేహంలో ఉన్న మనస్సులెన్ని? ఒకటా, రెండా అని ప్రశ్న. రెండైతే ప్రతివాడూ “నేను” అంటాడే కాని “మేము” అనడే. కాబట్టి ఉన్నది ఒక మనస్సే. దాని పుట్టుకెక్కడ? దాని స్వరూపమేమిటి? ఇలా విచారణ చేస్తూపోతే మనస్సులయమౌతుంది. ఆ తర్వాత మిగిలేదే “నేను”, “నేనెవరు?" ఇది తరువాతి ప్రశ్న. నేను కేవలమూ ఆత్మను - ఇది ధ్యానము. నేనట్లే అభ్యసించాను. ఈ పద్ధతిలో దేహవాసన నశిస్తుంది. అహంకారం నశిస్తుంది. ఆత్మయే స్వయంప్రకాశంగా వెలుగుతుంది. మనోలయానికి యోగారూఢునితో కలిసి ఉండడం ఒక మార్గం. వారు సమాధిలో పూర్ణప్రజ్ఞులు. వారికి అలవోకగా, సహజంగా, శాశ్వతంగా ఆత్మానుభవం కలిగి ఉంటుంది. వారితో మెలుగుతూ సహానుభవ సంపర్కాలు పెంచితే, వారి వలన సమాధి స్థితిని క్రమంగా అలవాటు చేసుకోవచ్చును.”

## భాషణములు 35

బాగా చదువుకున్న ఒక వ్యక్తి భగవాన్ను ద్వైత, అద్వైతముల గురించి అడిగారు.

మ: దేహంతో తాదాత్మ్యమే ద్వైతం. దేహంతో తాదాత్మ్యం లేకపోవడమే అద్వైతం.

## భాషణములు 36

గొప్ప కుటుంబంలో పుట్టిన ఒక విశిష్టమైన మహిళ ఉత్తర భారతదేశం నుండి తన కార్యదర్శిని వెంటబెట్టుకొని మధ్యాహ్న సమయంలో వచ్చిరి. కొన్ని నిముషాలు నిరీక్షించి, మహర్షి భోజనం తర్వాత హాలులోకి తిరిగి వచ్చిన తర్వాత ఆయనను ఇట్లు అడిగినది. "మహరాజ్! మనము చనిపోయిన వారిని చూడగలమా?"

మ: చూడగలము.

భక్తురాలు: యోగులు వారిని మనకు చూపగలరా?

మ: అవును. వారిని చూపవచ్చు. కాని వారిని చూపమని నన్ను అడగవద్దు. కారణం నేను అలా చెయ్యలేను.

భ: మీరు వారిని చూస్తారా?

మ: అవును. కలలో చూస్తాను

భ: యోగం ద్వారా మనం లక్ష్యం చేరగలమా?

మ: చేరగలము.

భ: యోగం గురించి మీరు వ్రాసి ఉన్నారా? ఆ విషయంలో మీరు వ్రాసిన గ్రంథాలు ఉన్నాయా?

మ: ఉన్నాయి.

ఆమె వెళ్ళిన తరువాత భగవాన్ ఇలా అన్నారు. "మన బంధువుల పుట్టుక ముందు గురించి మనకు తెలుసా? అలాంటప్పుడు వారు పోయిన తర్వాత విషయం గురించి ఎందుకు?"

## భాషణములు 37

"కర్మ అంటే ఏంటి?" అని ఒకరు అడిగేరు.

మ: ఫలితాలు ఇవ్వడం మొదలు పెట్టిన పూర్వం చేయబడిన కర్మలను ప్రారబ్దకర్మ అంటారు. పూర్వం చేయబడి భవిష్యత్తులో ఫలితాలను ఇచ్చే నిలువ వున్న కర్మలను సంచిత కర్మ అంటారు. ఇది, కూరగాయలకు బదులుగా గ్రామీణులు పుచ్చుకునే ధాన్యము మొదలైన వాటిలా చాలా రకాలుగా ఉంటుంది. ఈ విధంగా వినిమయంగా పుచ్చుకొన్న ధాన్యములో, బియ్యం, రాగి, బార్లీ మొదలైనవి ఉండవచ్చు. కొన్ని నీటి మీద తేలవచ్చు. కొన్ని నీటిలో మునగవచ్చు. వాటిలో కొన్ని మంచివి, చెడ్డవి, ఉపేక్షించ దగినవి ఉండవచ్చు. అనేక రకాలైన సంచిత కర్మలలో అతి బలీయమైనవి తర్వాత జన్మలో ఫలితం ఇచ్చినపుడు అవి అక్కడ ప్రారబ్ధకర్మలు అవుతాయి.

## భాషణములు 38

ప్రస్తుత పరిచారకులలో ఒకరు, మొదటిసారి భగవాన్ వద్దకు వచ్చినపుడు, "మోక్షమునకు మార్గమేది" అని అడగగా "ఇంతకుముందు చేపట్టిన మార్గమే మోక్షానికి చేరుస్తుంది" అని మహర్షి సమాధానమిచ్చారు.

# భాషణములు 39

ఆర్. శేషగిరిరావు అనే దర్శనార్థితో మాట్లాడుతూ, భగవాన్ ఇలా అన్నారు. "ఆత్మజ్ఞాని మాత్రమే చక్కని కర్మయోగి కాగలడు." "నేను కర్తను అను భావన నశించిన తర్వాత ఏమి జరుగుతుందో చూద్దాం. శ్రీ శంకరాచార్యుల వారు నిష్క్రియత్వమును (ఉదాసీనతను) ఉపదేశించారు. కాని ఆయన భాష్యాలను వ్రాసి వాదనలలో పాల్గోలేదా? పనులు చేయడం గురించి, చేయకపోవడం గురించి బాధపడవద్దు. నిన్ను నీవు తెలుసుకో. తర్వాత అది ఎవరి కర్మ అగునో విచారిద్దాం. అది ఎవరిది? కర్మ తనంతట తాను పూర్తిచెందుగాక. కర్త ఉన్నంత కాలం, అతడు తన కర్మలను అనుభవించి తీరాలి. అతడు తాను కర్తను అని అనుకోకపోతే అతనికి కర్మలేదు. అతడు ప్రాపంచిక జీవితాన్ని పరిత్యజించిన సన్యాసియే."

భ: అహంకారం ఎలా పుడుతుంది?

మ: దానిని తెలిసికోవడం ముఖ్యం కాదు. వర్తమానాన్ని తెలిసికో. దాన్ని తెలిసికోకుండా ఇతర కాలాల గురించి ఎందుకు చింతిస్తావు? మహర్షి ఒకసారి ఒక ప్రశ్నకు సమాధానం ఇలా చెప్పారు.

"ప్రపంచం నీ లోపల ఉందా లేక బయట ఉందా? అది నీకంటే వేరుగా ఉంటుందా? ప్రపంచం నీదగ్గరకు వచ్చి "నేను ఉన్నాను" అని నీకు చెప్తుందా?"

## భాషణములు 40

ఇంతకు ముందు ప్రశ్నలు అడుగుతున్న ఒక బ్రాహ్మణుడు ప్రశ్నలు ఇలా కొనసాగించారు. “ఒక కర్మ మనదని కాని, మనది కాదనికాని మనకెలా తెలుస్తుంది."

మ: కర్మఫలాలు ఆ వ్యక్తిని బాధించకపోతే ఆ వ్యక్తి ఆ కర్మలనుండి విముక్తుడే అని అర్ధం.

భ: బుద్ధితో తెలియబడే జ్ఞానం చాలునా?

మ: బుద్ధితో తెలిసికోకపోతే దాన్ని అభ్యసించేదెలా? మొదట దానిని బుద్ధితో తెలిసికొని తర్వాత దానితో ఆగవద్దు. దాన్ని అభ్యసించాలి. తర్వాత మహర్షి కొన్ని వ్యాఖ్యలు చేసారు.

"నీవు ఒక సిద్ధాంతానికి కట్టుబడితే, మిగిలిన సిద్ధాంతాలను ఖండించక తప్పదు. మతాధిపతుల విషయము అలాంటిదే."

ప్రజలందరూ ఒకే విధమైన పనులను (కర్మలను) చేస్తారని అనుకోలేము. ప్రతి వ్యక్తి తన స్వభావాన్నిబట్టి, గత జన్మలను బట్టి పని చేస్తాడు. జ్ఞాన, భక్తి, కర్మలు మూడూ విడదీయరాని విధంగా కలిసి వున్నాయి. రూప ధ్యానం మనిషియొక్క మనస్సును బట్టి ఉంటుంది. ఇతర రూపాలను వదిలించుకొని, ఒకే రూపానికి పరిమితమవడానికి అది ఉద్దేశించబడింది. అది లక్ష్యానికి చేరుస్తుంది. మొదటలో మనస్సును హృదయంలో నిలపడం అసాధ్యం. కాబట్టి ఈ సహాయాలు అవసరం. శ్రీకృష్ణుడు నీకు, నాకు ఎవరకీ జన్మలేదని చెప్పి తర్వాత తాను ఆదిత్యాదుల కంటే ముందు జన్మించానని చెప్పాడు. అర్జునుడు ఆ విషయంలో విభేదించాడు. అందువలన ప్రతి వ్యక్తి తన ఆధ్యాత్మిక పరిణతినిబట్టి భగవంతుని గురించి ఆలోచిస్తాడు.

జాగ్రదావస్థలో దేహమే నేను అని చెప్తావు. నిద్రలో దేహం కావు. ఒక వ్యక్తికే అనేక విధాలైన శరీరాలు ఉన్నప్పుడు, ఆ ఈశ్వరునకు అనంతమైన శక్తులు ఉండకూడదా? వ్యక్తి ఏ విధానమును అనుసరించినా, ఆ విధానాన్ని జ్ఞానులు ప్రోత్సహిస్తారు. ఎందుకంటే, అది ఇతర విధానాలవలె, లక్ష్యానికి చేరుస్తుంది.

## భాషణములు 41

భ: స్వర్గ, నరకాలు ఉన్నాయా?

మ: అక్కడకు వెళ్ళేవాడు ఒకడు ఉండాలికదా! అది కలలాంటిది. మనం దేశకాలాలను కలలో కూడా చూస్తాం. కల నిజమా? లేక జాగ్రద్దశ నిజమా?

భ: అంటే మనం కామం, క్రోధం మొదలైనవి వదలించుకోవాలి.

మ: ఆలోచనలను వదులు, అపుడు నీవు దేనినీ కూడా వదులుకోవలసిన అవసరం లేదు. దేనినైనా చూసేదానికి నీవు వుండాలి. అదే ఆత్మ. ఆత్మ నిత్య జ్ఞానవంతం.

భ: తీర్థ యాత్రాదులు మంచివా?

మ: అవును.

ఆత్మను చేరడానికి ఎలాంటి ప్రయత్నం చెయ్యాలి?

మ: అహంకారాన్ని నశింపచెయ్యాలి, ఆత్మను చేరలేం. ఎందుకంటే ఆత్మలేని... క్షణము కాని ప్రదేశం గాని ఉన్నదా? అది కొత్తది కాదు. నీవు ఉన్నట్లే ఉండు. కొత్తది శాశ్వతం కాదు. సత్యమైనది ఎప్పుడూ ఉండి తీరాలి.

భ: జ్ఞానయజ్ఞముగాని, ఇతర యజ్ఞములుగాని ఏమిటి?

మ: ఇతర పద్ధతులన్నీ (వివిధ యజ్ఞములన్నీ) జ్ఞానయజ్ఞము కొరకే ఉన్నాయి జ్ఞానము సంపాదించడానికి అభ్యాసము అవసరము.

భ: జీవన్ముక్తులలో భేధాలు ఉన్నాయా?

మ: వాళ్ళు బయట వేరే విధంగా ఉంటే ఏమి? వారి జ్ఞానంలో తేడా ఏమీలేదు.

భ: ఒక గురువుపట్ల భక్తితో ఉన్నప్పుడు, మిగిలిన మహాత్ములను గౌరవించ వచ్చునా?

మ: గురువు ఒక్కడే. ఆయన దేహం కాదు. బలహీనత ఉన్నంతకాలం బలమైన ఆలంబనం అవసరం.

భ: జి. కృష్ణమూర్తిగారు "గురువు అవసరం లేదు" అని అంటారు.

మ: అది ఆయనకు ఎలా తెలిసింది? ఆత్మానుభవం వచ్చాకనే అలా చెప్పవచ్చు, దానికి ముందుకాదు.

భ: మీరు మహాప్రయత్నముతో ఈ స్థితిని సాధించేరు. మాలాంటి అల్పజీవుల గతి ఏమిటి?

మ: మనం మన ఆత్మలో ఉన్నాం. ఈ ప్రపంచంలో లేము.

భ: స్వర్గం-నరకం, ఇవి ఏమిటి?

మ: స్వర్గం, నరకం నీతోనే వస్తాయి, నీ కామం, క్రోధం మొదలైనవి వీటిని సృష్టిస్తాయి. అవి కలల వంటివి.

భ: మనిషి తన దృష్టిని కనుబొమల మధ్య నిలిపి, తన శ్వాసను నిరోధిస్తే పరమస్థితిని పొందుతాడు. గీత చెప్తోంది. దానిని చేయడం ఎలా?

మ: నువ్వు ఎప్పుడూ ఆత్మలోనే ఉన్నావు. దానిని పొందడం అనీ వేరే ఏమీ లేదు. కనుబొమల మధ్య దృష్టి నిలపడం కేవలం సావధానం కోసమే, (ఉపాసనా స్థానంగా మాత్రమే).

భ: మీరు హృదయం ధ్యానస్థానం అని చెప్పి ఉన్నారు కదా!

మ: అవును. అది కూడా ధ్యానస్థానమే.

భ: హృదయమంటే ఏమిటి?

మ: అది ఆత్మయొక్క కేంద్రం. ఆత్మ కేంద్రములన్నిటికీ కేంద్రం. హృదయం సూక్ష్మ కేంద్రం. భౌతిక కేంద్రము కాదు.

భ: అనుభవాత్మకమైన వివేకానికి జ్ఞానం అనే పదం వాడతారు. కాని అదే పదాన్ని ఆ విధానానికి లేదా పద్ధతికి కూడా వాడతారు. ఎందుకు?

మ: "జ్ఞానం"లో విధానము లేదా పద్ధతి కూడా ఇమిడి ఉంది. ఎందుకంటే చివరికి అది అనుభవానికి దారితీస్తుంది.

భ: తన జ్ఞానం అసంపూర్ణమైనప్పటికీ, ఒక వ్యక్తి ఆ జ్ఞానాన్ని ఇతరులకు బోధించవచ్చునా?

మ: వాని ప్రారబ్ధము అలా వుంటే అలాగే.

భగవద్గీత ఏడవ అధ్యాయంలో కర్మ ఒక సాధనమా అని అర్జునుడు అడిగాడు. కర్తృత్వ భావన లేకుండా చేయబడినచో కర్మకూడా ఒక సాధనమని శ్రీకృష్ణుడు బదులు చెప్పేరు.

కర్మలను నిరాకరించే శాస్త్రాలు కూడా కర్మలను అంగీకరిస్తాయా? కర్తృత్వ భావనతో చేయబడిన కర్మలను శాస్త్రం అంగీకరించలేదు. కర్మలను వదలవద్దు. అలా కర్మలను వదలడానికి లేదు. కర్తృత్వభావనను వదులు. కర్మలు వాటంతట అవే నడుస్తాయి. లేదంటే కర్మలు నిన్ను వదిలేస్తాయి. ఒకవేళ కర్మ నీ ప్రారబ్ధం వలన నీకు ఉంటే నువ్వు వద్దనుకున్నా, వద్దనక పోయినా చేయవలసి వస్తుంది. కర్మ నీకు లేకపోతే, నువ్వు కర్మలలో ప్రయత్నపూర్వకంగా తగులుకొన్నా కర్మలను చేయడం జరగదు. జనకుడు, శుకుడు మొదలైనవారు అహంకారం లేకుండా కర్మలు చేసేరు. కర్మ కీర్తికోసం చేయవచ్చు లేదా స్వార్థం లేకుండా అందరి మంచికోసం కూడా (లోకసంగ్రహం) చేయవచ్చు. అయితే కూడా కొందరు పదిమంది మెప్పుకోసం పనులు చేస్తారు. ఇది నిజంగా స్వార్థమే.

భ: దేనిని తెలిసికొంటే అన్ని సందేహాలు తొలుగుతాయో అది ఏమిటి?

మ: సందేహించే వాడిని తెలుసుకో. ఈ సందేహించే వాడిని పట్టుకుంటే, సందేహాలు మళ్ళీ లేవవు, ఇక్కడ సంశయించేవాడు అతీతుడు. మళ్ళీ సందేహించేవాడు లేనప్పుడు, సందేహాలే రావు. అవి ఎక్కడనుండి వస్తాయి. అందరూ జ్ఞానులు, జీవన్ముక్తులే. ఆ విషయం వాళ్ళకు తెలీదు, అంతే! సందేహాలను సమూలంగా తీసేయాలి. అంటే సందేహించే వాడిని సమూలంగా తీసేయాలి. ఇక్కడ సందేహించేవాడు మనస్సే.

భ: దీనికి పద్ధతి ఏమిటి?

మ: "నేను ఎవరు" అనేది విచారణ.

భ: జపము చేయవచ్చా?

మ: "నేను ఇది" అని నీవు ఎందుకు అనుకోవాలి? విచారణ చేయి. ఆలోచనలు ఆగిపోతాయి. ఉన్నది, అంటే ఆత్మ, తప్పించుకోలేని అవశేషంగా తెలుస్తుంది.

భ: హఠయోగం అవసరమా?

మ: అది సహాయాలలో ఒకటి, ఎప్పుడూ అవసరం కాదు. అది వ్యక్తి మీద ఆధారపడి వుంటుంది. విచారణ ప్రాణాయామం కంటే గొప్పది. యోగవాసిష్ఠంలో చూడాల అహంకారాన్ని చంపడానికి విచారణే చేయమని శిఖిధ్వజుడుకి చెప్పింది. ప్రాణాన్నిగాని, బుద్ధినిగాని అంటిపెట్టుకోవడం వలన సత్యాన్ని పొందవచ్చు. మొదటిది హఠయోగం, రెండవది విచారణ.

భ: ఆత్మవిజ్ఞానం కలిగిన పిదప కూడా జ్ఞానికి వ్యక్తిత్వము ఉంటుందా?

మ: ఆయన వ్యక్తిత్వము ఎలా నిల్పుకోగలడు? సాధారణంగా కూడా, లౌకికంగాగాని, పరలోకపరంగాగాని ఏ పనినైనా ప్రారంభించడానికి ముందు ఆచమనం, ప్రాణాయామము చెయ్యాలని చెప్తారు. అంటే మనస్సు యొక్క ఏకాగ్రత

కార్యాన్ని సాధిస్తుందని అర్థం. భ: నేను “నేతి -నేతి" (న ఇతి - న ఇతి, ఇది కాదు - ఇది కాదు) అని

ధ్యానిస్తున్నాను. మ: వద్దు. అది ధ్యానం కాదు. మూలాన్ని కనుక్కో నువ్వు తప్పక ఆ మూలాన్ని చేరాలి. అసత్యమైన "నేను" మాయమై నిజమైన “నేను” అనుభవంలోకి వస్తుంది. రెండవ దానికి భిన్నంగా మొదటిది ఉండలేదు.

## భాషణములు 42

మదనపల్లి నుండి శ్రీడంకన్ గ్రీన్లీస్ ఇలా వ్రాసారు: “కొన్ని సమయాల్లో వ్యక్తికి చాలా స్పష్టమైన చైతన్య స్ఫురణలు కలుగుతున్నాయి. ఆ చైతన్య కేంద్రం వ్యావహారికమైన ఆత్మకు వెలుపల ఉన్నది, మరియు ఆ చైతన్యము సర్వమును తనలో చేర్చుకొన్నదిగా కనిపిస్తోంది. ఆ స్ఫురణలు పొందుట, నిలుపుకొనుట, విస్తరింపచేసుకొనుట అనే విషయంలో ప్రయత్నం చేయడానికి, వేరు వేరు సిద్ధాంతాలలో మనస్సు చింతించడానికి భగవాన్ ఎలా ఉపదేశమిస్తారు? అలాంటి అనుభవాలను పొందడానికి, అభ్యాసం చేసే దానికి ఏకాంతం (అన్ని పనులనుండి విరమణ) అవసరమా?

శ్రీభగవాన్ ఇలా చెప్పారు: 'వెలుపల' - ఎవరికి 'లోపల' లేక 'వెలుపల' ఉంది? కర్త (విషయి), విషయము ఉన్నంతకాలము మాత్రమే ఆ స్ఫురణలు ఉండగలవు. మరియు ఈ రెండు (కర్త, విషయము) ఎవరికి ఉన్నాయి? ఈ రెండు కూడా కర్తలోనే కలిసి పోతాయి. కర్తలో ఎవరున్నారో కనుక్కో ఆ విచారణ కర్తకు అతీతమైన శుద్ధచైతన్యానికి నిన్ను చేరుస్తుంది.

వ్యావహారికమైన ఆత్మ అంటే మనస్సే. ఈ మనస్సు పరిమితులతో కూడినది. కాని శుద్ధ చైతన్యం పరిమితులకు అతీతమైనది. ఇదిపైన చెప్పబడిన విధంగా విచారణచేత పొందబడుతుంది.

పొందుట (సంపాదించుట): ఆత్మ ఎప్పుడూ ఉన్నదే. ఆత్మజ్ఞానాన్ని పొందటానికి ఉన్న ఆటంకాలను పోగొట్టే ప్రయత్నం వ్యక్తి చేస్తాడు.

నిలుపుకోవడం: ఒకసారి ఆత్మను పొందితే అది ఇప్పుడు ఇక్కడే ఉన్నట్లు తెలుస్తుంది. అది ఎప్పుడూ పోలేదు.

పెంచడం: (విస్తరింప చేయడం): ఆత్మను పెంచడం (విస్తరింపచేయడం) అనేది లేదు. ఎందుకంటే ఆత్మ ఎప్పుడూ సంకోచ, వ్యాకోచాలు లేనిది కాబట్టి.

ఏకాంతవాసం: ఆత్మనిష్ఠయే ఏకాంతవాసం. ఎందుకంటే ఆత్మకు భిన్నమైనది (అన్యమైనది) ఏదీ లేదు. ఏకాంతవాసము అనగానే, ఒక చోటనుండి మరొకచోటకు పోవడం అని అర్థమొస్తుంది. ఆత్మకంటే వేరుగా ఆ చోటుగాని, ఈచోటుగాని లేదు. అంతా ఆత్మేకాబట్టి ఏకాంతవాసం అసాధ్యం, అసంగతం.

అభ్యాసము: అంటే ఆత్మవిచారణే.

# భాషణములు 43

వేలూరు కలెక్టరు శ్రీ. ఎస్. రంగనాథన్, ఐ.సి.ఎస్; శ్రీ రామమూర్తిగారు, ఐ.సి.ఎస్, మరియు పుదుక్కోట మాజీదీవాన్ శ్రీ టి. రాఘవయ్య, ఆశ్రమాన్ని సందర్శించారు. శ్రీ రంగనాథన్ అడిగారు. "మనస్సును ఎలా నిగ్రహించాలో దయతో నాకు ఉపదేశించండి".

మ: దానికి రెండు పద్ధతులున్నాయి. ఒకటి మనస్సు ఎలాంటిదో కనుగొనడం, అప్పుడు అది నశిస్తుంది. రెండవది, ఏదో ఒక దానిమీద దృష్టిని కేంద్రీకరించడం, అప్పుడు మనస్సు నిశ్చలంగా ఉంటుంది.

ప్రశ్న అడిగిన ఆయన (పృచ్ఛకుడు) మరింత వివరణ కోసం ప్రశ్నలను మళ్ళీ అడుగగా భగవాన్ మరింత వివరణతో అదే జవాబు చెప్పేరు. పృచ్ఛకుడు తృప్తి పడినట్లు కనబడలేదు.

శ్రీ రాఘవయ్య: మేము లౌకిక మానవులం కనుక ఏదో ఒక దుఃఖమో లేక మరొకటో ఉంటూ ఉంటుంది. దానిని దాటడం ఎలాగో మాకు తెలీదు. మేము భగవంతుడ్ని ప్రార్థిస్తాం. అయినా తృప్తి కలగలేదు. మేము ఏమి చెయ్యాలి?

మ: భగవంతుడ్ని నమ్మండి.

భ: మేము శరణాగతి చేసేం. అయినా సహాయం లేదు.

మ: సరే. మీరు శరణాగతి చేస్తే భగవంతుని సంకల్పానికి కట్టుబడి ఉండగల్గాలి కాని మీకు ఇష్టము లేని దాని గురించి దుఃఖించ కూడదు. విషయాలు, అవి బయట కనిపించే స్థితినుండి వేరే విధంగా మారవచ్చు ఎన్నోసార్లు కష్టాలు మనుషులకు భగవంతునియందు విశ్వాసాన్ని కల్గిస్తాయి.

భ: కాని మేము లౌకికులము. భార్య, పిల్లలు, మిత్రులు, బంధువులు ఉన్నారు. వారి ఉనికిని పట్టించుకోకుండా, మాలో ఏ కొంచెము వ్యక్తిత్వము నిలుపుకోకుండా దైవ సంకల్పానికి వదిలేయలేము.

మ: అంటే మీరు చెప్పిన విధంగా శరణాగతి చెయ్యలేదని అర్థం. భగవంతునియందు మాత్రమే విశ్వాసం ఉంచాలి.

శ్రీ రామమూర్తి: స్వామీజీ, నేను బ్రంటన్ వ్రాసిన "ఎ సెర్చ్ ఇన్ సీక్రెట్ ఇండియా" పుస్తకం చదివేను. అందులోని ఆఖరి అధ్యాయం నాకు చాలా నచ్చింది. అందులో ఆలోచనలు లేకుండా తెలివిగా ఉండవచ్చని ఉంది. ఈ శరీరాన్ని మర్చిపోయి ఆలోచించ వచ్చునని తెలుసు. మనస్సే లేకుండా ఆలోచించ వచ్చునా? ఆలోచనలకు అతీతమైన చైతన్యశక్తిని పొందవచ్చునా (పొందగలమా?).

మ: అవును. ఉన్న చైతన్యం ఒకటే. అదే మెలుకువ, కల, గాఢనిద్రలలో ఉంది. నిద్రలో “నేను" లేదు. 'నేను' ఆలోచన మెలుకువతో మొదలవుతుంది. అప్పుడు ప్రపంచం కూడా మొదలవుతుంది. నిద్రలో ఈ "నేను" ఎక్కడుంది? అది అసలు ఉందా లేదా? అప్పుడు కూడా ఉండేఉంటుంది కాని నువ్వు ఇప్పుడు అనుకొనేవిధంగా కాదు. ఇప్పుడు ఉన్నది కేవలం “నేను” ఆలోచన. కాని నిద్రలో “నేను” నిజమైన “నేను”. అది ఎప్పుడూ ఉంది. అది చైతన్యం. అది నువ్వు తెలుసుకొంటే, అది ఆలోచనలకు అతీతమైనదని తెలుస్తుంది.

భ: మనస్సు లేకుండా ఆలోచించవచ్చా?

మ: ఆలోచనలు కూడా వేరే విధమైన కార్యకలాపాలవంటివే, పరబ్రహ్మమునకు అవి కలతకాదు

భ: వ్యక్తి ఇతరుల మనస్సులను తెలుసుకోగలడా?

శ్రీ గురువు యథాప్రకారం, ఇతరుల గురించి చింతపడడానికి ముందు తన ఆత్మను తెలిసికొమ్మని చెప్పారు. "తన ఆత్మకంటే వేరేగా ఇతరులు ఎక్కడ ఉన్నారు?" అని గురుదేవులు ప్రశ్నించారు.

శ్రీరాఘువయ్య: ఆధ్యాత్మిక అనుభవాలను, లౌకికమైన అనుభవాలతో సమన్వయం చేయడం ఎలా?

మ: అనుభవం అనేది ఒక్కటే. ప్రాపంచికమైన అనుభవాలన్నీ మిథ్యాహంకారం మీద ఆధారపడి నిర్మించబడినవే కాక మరి ఏమిటి? ఈ ప్రపంచంలో అవి విజయవంతమైన వ్యక్తిని, తమకు ఆత్మ తెలియునా అని అడగండి. 'తెలియదు' అనేదే జవాబు. ఆత్మ తెలియకుండా ఏవడైనా తెలిసికొనేది ఏముంది? ప్రాపంచిక జ్ఞానమంతా కూడా ఇలాంటి బలహీనమైన పునాది మీద ఆధారపడి ఉంది.

శ్రీరామమూర్తి: మిథ్యాత్మకు భిన్నంగా సత్యాత్మను తెలిసికొనెదెలా? (నిజంకాని 'నేను'కు భిన్నంగా నిజమైన 'నేను'ను తెలిసికొనేది ఎలా?)

మ: తనను తాను ఎరుగని వాడు ఎవడైనా ఉన్నాడా? ప్రతీ వ్యక్తి తనను తెలిసికొని కూడా తెలిసికొనడు. ఇది ఒక విచిత్రమైన విషయం. (బయటికి విరుద్ధమనిపించే సత్యం) తరువాత గురుదేవులు ఇలా వివరించేరు. “మనస్సు ఉందా అని విచారిస్తే లేదని తెలుస్తుంది. అదే మనో నిగ్రహం. దానికి భిన్నంగా మనుస్సు ఉన్నట్లు గ్రహించి, వ్యక్తి దానిని నిగ్రహించాలనుకుంటే, దొంగను పట్టుకోడానికై మనస్సే స్వయంగా పోలీసుగా మారినట్లు, మనస్సే మనస్సును నిగ్రహించడంతో సమానమవుతుంది. ఈ విధంగా మాత్రమే మనస్సు తనను తాను తప్పించుకొంటూ, మనుగడ సాగిస్తుంది.

## భాషణములు 44

ఏకనాథరావు అను ఒక ఇంజనీరు - "విచారణ చెయ్యడానికి ఏకాంతము అవసరమా?" అని భగవాన్ని అడిగేరు.

మ: ఏకాంతము అంతటా ఉంది. వ్యక్తి ఎప్పుడూ ఒంటరివాడే. ఆ ఒంటరితనాన్ని బయట వెదకకుండా లోపల కనుక్కోవడమే వాని కర్తవ్యము.

భ: పనులతో కూడిన వ్యావహారిక దినచర్య చాలా విక్షేపముతో కూడినది.

మ: నిన్ను నువ్వే విక్షేపము పొందకుండా చూసుకో. ఎవరికీ విక్షేపము అని విచారణ చెయ్యి. కొంచెం అభ్యాసం చేసేక అది నిన్ను అంతగా బాధించదు.

భ: ప్రయత్నమే అసాధ్యంగా ఉంది.

మ: ప్రయత్నం చెయ్యి. దానిని కనుక్కోవచ్చు. అనుకున్నంత కష్టంకాదు.

భ: కాని దానికి జవాబు లోపల వెదకడం వలన రాదు కదా!

మ: విచారణ చేసేవాడే జవాబు. వేరే జవాబు ఏదీ రాదు. కొత్తగా వచ్చేది నిజం కాదు. ఎప్పుడూ ఉండేదే నిజం.

## భాషణములు 45

ఒక దర్శనార్థి: మోక్ష మార్గం చాలా కఠినమైనది. ప్రాపంచిక విషయాలు అర్థం చేసుకోవడం సులభం. కాని ఇది అలా కాదు.

మ: అవును. మనస్సు ఎప్పుడూ బయట విషయాలకు సంబంధించిన జ్ఞానం కోసం ప్రయత్నం చేస్తుంది. లోపలికి సంబంధించిన జ్ఞానాన్ని పట్టించుకోదు.

భ: భగవాన్తో ఒకరోజు ఇక్కడ ఉంటే బాగుంటుంది. రెండురోజులుంటే చాలా బాగుంటుంది. మూడు రోజులుంటే ఇంకా బాగుంటుంది. అలాగే ఎప్పుడూ ఇక్కడే ఉంటే, మరి మా సాధారణ లౌకిక జీవితం గడిచేది ఎలా?

మ: ఇక్కడున్నా, ఎక్కడున్నా సమానమే అని, సమానమైన ఫలితమే ఉంటుందని అర్థం చేసుకోవాలి.

## భాషణములు 46

నాగర్ కోయిల్ నుండి వచ్చిన శ్రీరామచంద్ర అయ్యర్ ఉపదేశసారం మలయాళ అనువాదగానం విన్న తర్వాత సహజంగా అంత సరళంకాని తన పద్ధతిలో మనస్సు గురించి, ఏకాగ్రత గురించి, మనో నిగ్రహాన్ని గురించి అడిగారు. దేహంతో ఆత్మ తాదాత్మ్యమే మనస్సు అని స్వామి చెప్పిరి. అది కల్పితమైన అహంకారం. ఆ అహంకారం మళ్ళీ నిజంకాని దృశ్యాలను కల్పించి వానితో తిరుగుతున్నట్లు కన్పిస్తుంది. ఇవి అన్నీ అసత్యములే. ఆత్మయే ఏకైక సత్యం. మిధ్యాతాదాత్మ్యం నశిస్తే ఆత్మ (సత్యం) యొక్క ఉనికి స్పష్టమవుతుంది. సత్యవస్తువు (ఆత్మ) ఇక్కడ, ఇప్పుడు లేదని దీని భావం కాదు. అది ఎల్లప్పుడూ, శాశ్వతంగా ఒకే విధంగా ఉంది. అది ప్రతివ్యక్తి అనుభవంలో కూడా ఉంది. ఎందుకంటే ప్రతి వ్యక్తికి తానున్నట్లు తెలుస్తుంది. "అతడు ఎవడు?" విషయిగా (అధిష్టానంగా) "నేను ఎవరు?" మిథ్యాహంకారం విషయములతో కలిసి ఉంది. ఈ అహంకారమే దాని యొక్క విషయం కూడా. విషయముగా ఉండడమే మిథ్య. విషయి మాత్రమే సత్యము. శరీరమనే విషయంతో ముడిపడి పోవద్దు. లేకపోతే ఈ మిథ్యాఅహంకారం ఉదయిస్తుంది. దానినుండి ఈ ప్రపంచం. ఆపై దుఃఖంతో కూడిన నీ కదలికలు. నీవు ఇదో, అదో, మరేదో అనుకోక. అలాగే ఫలానా ఫలానాగా అవ్వాలనో, వీరో-వారో అవ్వాలనో అనుకోక. ఈ అసత్యాన్ని వదిలేయ్. సత్యం తానుగా తెలుస్తుంది. శాస్త్రాలు ఏమి చెప్తున్నాయంటే ఆత్మ నిత్య సిద్ధము, ఎప్పుడూ ఉండేది. కాని అజ్ఞాన నివృత్తి గురించి మాట్లాడతాయి. ఒకవేళ ఆత్మ నిత్యము (ఎప్పుడూ) మరియు సిద్ధ (ఉండేది) అయివుంటే ఈ అజ్ఞానము ఎలా ఉంటుంది? ఈ అజ్ఞానము ఎవరికి? ఇవి పరస్పరము విరుద్ధము. కాని ఈ రకమైన వాక్యాలు, నిజమైన సాధకునికి (ముముక్షువుకు) మార్గదర్శనం కోసం చెప్పబడినవి. దానికి స్పష్టమైన సత్యాన్ని సరళంగా సూటిగా చెప్తే అర్థం కాదు. ఎలా అంటే "సత్వం నాహం, నేమే జనాధిపా:" (భగవద్గీత 2.12) (నీవు లేవు, నేను లేను, ఈ రాజులు లేరు) శ్రీకృష్ణుడు సత్యాన్ని చెప్పేడు కాని అర్జునునికి అర్థం కాలేదు. తర్వాత శ్రీకృష్ణుడు స్పష్టంగా చెప్తాడు. ప్రజలు తనను శరీరంగా చూస్తారు. కాని నిజానికి తను పుట్టింది లేదు, చావు కూడా లేదు. కాని అర్జునునికి మొత్తం గీత కావలసి వచ్చింది, సత్యం అర్థం అవడానికి.

చూడు, ఆత్మ ఒక్కటే ఉన్నది. ఇదిగా అదిగా ఉన్నది కాదు. కేవలం ఉన్నదిగా మాత్రమే. ఉండు - అజ్ఞానం అంతమవుతుంది. ఈ అజ్ఞానం ఎవరికి అని విచారణ చెయ్యి. నువ్వు నిద్ర నుండి లేచినపుడు ఈ అహంకారం కూడా లేస్తుంది. గాఢనిద్రలో నువ్వు నిద్రలో ఉన్నాను అని చెప్పవు, లేదా నేను లేస్తాను అనిగాని, ఎంతసేపుగానో నిద్రపోతున్నాననిగానో చెప్పవు. కాని నువ్వు అక్కడ ఉన్నావు. నువ్వు నిద్ర నుండి లేచేకనే చెప్తావు, నేను నిద్ర పోయేను అని. ఈ మెలుకువలో నిద్ర కూడా కలిసి ఉంది. నీ శుద్ధమైన ఉనికిని తెలుసుకో. ఈ శరీరంతో భ్రాంతి చెందక. ఈ శరీరం ఆలోచనల ఫలితం. ఈ ఆలోచనలు వాటి ఆటలు అవి ఆడతాయి. కాని నువ్వు వాటి వలన బాధితుడవు కావు. గాఢనిద్రలో నీ శరీరం గురించి నీకు చింతలేదు. అలాగనే ఎప్పుడూ ఉండవచ్చు.

శ్రీఏకనాథరావు: ఎవరైనా ఇలాంటి (విచారణాయుక్తమైన) జీవితాన్ని, జీతం సంపాదించుకుంటూ బ్రతికే లౌకిక జీవితంలో సమన్వయం చేయడం ఎలా?

మహర్షి: కర్మలు ఏ బంధాన్ని కల్గించవు. బంధం అనేదే ఒక తప్పు అభిప్రాయం. "నేను కర్తను" ఇలాంటి ఆలోచనలను వదిలేయ్. నీ జోక్యంతో అడ్డుపెట్టకుండా శరీరం, ఇంద్రియాలు వాటి పని వాటిని చెయ్యనీ.

## భాషణములు 47

ఒక మలయాళీ సందర్శకుడు ఈ ప్రపంచం యొక్క దుఃఖంపట్ల తన బాధను వ్యక్తము చేస్తూ, అట్టి వేదనామయమైన పరిసరాల మధ్యలో "ఆత్మాన్వేషణ" స్వార్థపరంగా కనిపిస్తుందని తన అభిప్రాయాన్ని వ్యక్తపరిచాడు.

మ: సముద్రానికి తన తరంగం గురించి తెలీదు. అట్లే ఆత్మకు తన అహంకారం గురించి తెలీదు. (అహంకారము యొక్క మూలాన్ని అన్వేషించడం అనగా శ్రీభగవాన్ అభిప్రాయమేమిటో - ఇది స్పష్టం చేస్తుంది).

## భాషణములు 48

ఒక దర్శనార్థి శ్రీభగవానిని ఇలా అడిగారు:

"మీరు భగవాన్ కాబట్టి నాకు ఎప్పుడు జ్ఞానం వస్తుందో మీకు తెలుస్తుంది. నేను ఎప్పుడు జ్ఞానిని అవుతానో చెప్పండి." దీనికి శ్రీ భగవాన్ ఇలా చెప్పారు. "నేను భగవాన్ అయితే, ఆత్మ తప్ప మరి ఒక్కరు లేదు. కాబట్టి జ్ఞానిగాని, అజ్ఞానిగాని లేరు. నేను భగవాన్ కాకపోతే, నేను నీవంటివాడినే కాబట్టి నీకు తెలిసినంతే నాకు తెలుస్తుంది. ఏ విధంగా అయినా నీ ప్రశ్నకు నేను సమాధానం చెప్పలేను."

## భాషణములు 49

కొందరు వ్యక్తులు భగవాన్ను ప్రశ్నలు అడిగేరు. అవన్నీ కలిపి చివరకు "తాము ఎంత శ్రమపడి నప్పటికీ "నేను" స్పష్టంగా తెలియడం లేదు" అని ప్రశ్నగా మారాయి.

భగవాన్ సమాధానం మామూలు ధోరణిలో: "నేను" స్పష్టంగా తెలియడం లేదు అని చెప్పేవాడు ఎవరు? అజ్ఞానంగా ఉండే "నేను", దొరకకుండా ఉండే "నేను" రెండు వున్నాయా? రెండు "నేను"లు ఒకే వ్యక్తిలో ఉన్నాయా? నిన్ను నువ్వు ఈ ప్రశ్నలు అడుగు. "నేను" స్పష్టంగా తెలియడం లేదు అనేది మనస్సు. ఆ మనస్సు ఎక్కడనుండి వస్తోంది? మనస్సును తెలుసుకో. అది ఒక మిధ్య (భ్రాంతి)గా తెలుస్తుంది. జనక మహారాజు ఇలా చెప్పేరు, "నన్ను ఇంతకాలంగా నాశనం చేసే దొంగను కనుక్కున్నాను. ఇప్పుడు నేను వాడి సంగతి చూస్తాను. అప్పుడు నేను ఆనందంగా ఉంటాను". ఇతరుల విషయంలో కూడా ఇదే అన్వయిస్తుంది.

భ: "నేను"ను తెలిసికొనేదెలా?

మ: "నేను -నేను" అనేది ఎప్పుడూ ఉంది. అందులో తెలిసికోవడం అనేది లేదు. ఇదేమి కొత్తగా సంపాదించే జ్ఞానం కాదు. కొత్తది, ఇప్పుడు-ఇక్కడ కానిది, అశాశ్వతం (క్షణభంగురం). "నేను" మాత్రమే ఎప్పుడూ ఉంది. ఈ జ్ఞానానికి ఆటంకం ఉంది. దానికే అజ్ఞానమని పేరు. ఈ అజ్ఞానాన్ని తొలగించు, జ్ఞానం తనంతట తానే ప్రకాశిస్తుంది." నిజానికి ఈ అజ్ఞానంగాని, జ్ఞానంగాని ఆత్మకు కావు. అవి కేవలం అక్కరలేని పెరుగుదలలు (కలుపు మొక్కలువంటివి) వాటిని తీసివేయాల్సిందే. అందుకే ఆత్మ జ్ఞానానికి అజ్ఞానానికి కూడా అతీతమైనదని చెప్పబడుతుంది. అది సహజంగా ఉన్నట్లే ఉంటుంది అంతే.

భ: మేము ఎంతగా ప్రయత్నించినా చెప్పుకోదగ్గ అభివృద్ధి (పురోగతి) కనిపించడం లేదు.

మ: కొత్తగా పొందవలసిన విషయాలలో పురోగతి (అభివృద్ధి) గురించి చెప్పబడుతుంది. కాని, ఇక్కడ అజ్ఞానం తొలగించడమే గాని జ్ఞాన సంపాదనము కాదు. ఆత్మాన్వేషణంలో ఎలాంటి పురోగతిని ఆశించగలం?

భ: అజ్ఞానాన్ని తొలగించడం ఎలా?

మ: తిరువణ్ణామలైలో ప్రక్క మీదపడుకుని నీవు మరొక పట్టణంలో ఉన్నట్లు కల కంటావు. ఆ దృశ్యం నీకు సత్యం. నీ శరీరం ఇక్కడ ఈ గదిలో నీ ప్రక్కమీద ఉంటుంది. ఒక పట్టణం నీ గదిలో ప్రవేశించగలదా? లేదా నీవు దేహాన్ని ఇక్కడ వదలి ఈ ప్రదేశాన్ని వదలి మరొకచోటకి పోగలిగావా? రెండూ అసాధ్యలే. అందువలన నీవు ఇక్కడ ఉండుట, మరొక పట్టణాన్ని చూచుట -రెండూ అసత్యాలే. అవి మనస్సుకు సత్యంగా కనిపిస్తాయి. కలలోని "నేను" శీఘ్రంగా అదృశ్యమై మళ్ళీ మరొక "నేను" కల గురించి మాట్లాడుతుంది. ఈ "నేను" కలలో లేదు. రెండు "నేను"లు అసత్యాలే. ఎన్నో దృశ్యాలను కల్పింపచేస్తూ ఇంతకాలం కొనసాగుతున్న మనస్సు దీనికంతకూ ఆధారంగా ఉంది. ప్రతి ఆలోచనతో ఒక "నేను" పుట్టి, ఆ ఆలోచన పోవడంతోపాటు ఆ "నేను" కూడా మాయమవుతోంది. ప్రతిక్షణమూ ఎన్నో "నేను"లు పుట్టి నశిస్తున్నాయి. ఇప్పుడు కొనసాగుతున్న మనస్సే నిజమైన కష్టం. జనకమహారాజు అభిప్రాయము బట్టి అదే దొంగ. వానిని కనుక్కో నీవు ఆనందంగా ఉండవచ్చు.

## భాషణములు 50

భగవాన్ "ప్రబుద్ధభారత" అను పత్రికనుండి కబీరు దోహా చదివి వినిపించేరు. నీటిబొట్టు సముద్రంలో కలియడం గురించి అందరికీ తెలుసు కాని సముద్రం నీటిబొట్టుతో కలియడం గురించి కొందరికి మాత్రమే తెలుసు. అదే 'పరాభక్తి' అని అన్నారు.

## భాషణములు 51

25 సంవత్సరాల ఒక బ్రాహ్మణ యువకుడు భగవాన్ దర్శనానికి వచ్చాడు. అతడు భగవాన్ను చూడగానే హరోన్మాదానికి లోనై, “శివోహం, అహం బ్రహ్మాస్మి” “నీవు ఈశ్వరుడవు”, “నీవు పరబ్రహ్మవు” “నీవు నా తండ్రివి" "తండ్రీ! నన్ను రక్షించుము” అని రకరకాలుగా పెద్దగా అరిచాడు. అతడి ఉన్మాదము ఎక్కువై, 'శివోహం, శివోహం' అని అరుస్తూ రెండు చేతులతో తీవ్రంగా గుండెను బాదుకోసాగాడు. మళ్ళీ తర్వాత తన పళ్ళ మధ్యలో చార్వాక మతాన్ని నమిలేస్తున్నట్లుగా, "నేను చార్వాక మతాన్ని పిండి చేస్తాను" అని పళ్ళను కొరుకుతూ, ఉన్మాద ఆవేశంతో అరవసాగాడు. "నాకు శక్తి నయినా ఇవ్వు, నాకు శక్తినయినా ఇవ్వు ... లేకపోతే, లేకపోతే నేను....” అని తన గొంతు తనే పిసుకొంటున్నట్లు అరిచాడు.

ఇతరులు అతనిని మెల్లగా అక్కడనుండి తీసివేయగా, అతడు “నా తండ్రి పాదాలకు శరణు. తండ్రీ! నీవు పార్థసారథివి. నేను అర్జునుడను. మనం చార్వాక మతాన్ని నశింపచేద్దాం" అని అంటూ భగవాన్ ముందు సాష్టాంగపడ్డాడు. చివరికి అతడిని మహర్షి సన్నిధినుండి బయటకు తీసుకువెళ్ళారు. అతడు స్నానం చేసి, అల్పాహారం తీసుకొని కొన్ని గంటలు హాలులో ప్రశాంతంగా కూర్చున్నాడు. అతడు మధ్యాహ్నం భోజనం చెయ్యలేదు. మధ్యాహ్నం తర్వాత అతడు మళ్ళీ ఆవేశానికి లోనయి, “శ్రీకృష్ణుడు ఇప్పుడు ఇక్కడికి వస్తే వాని తలను నేను తెగ నరుకుతాను. నా ఉద్యోగం వదలమని నాకు ఉపదేశించాడు. కాని నా తల్లిని రక్షించడం లేదు. లేకపోతే ఆయనే నా తలను త్రుంచివేయ వచ్చును కదా” అని అరిచాడు.

తరువాత కొన్ని గంటలు ప్రశాంతంగా గడిచాక, శ్రీభగవాన్ శ్రీ కె.ఎల్. శర్మను “ఉన్నది నలుబది" గ్రంథము యొక్క "అనుబంధము”పై ఆయన వ్యాఖ్యానములో కొంత భాగాన్ని చదివి వినిపించమన్నారు. దాని సారాంశము ఇది: “తమకు తామే సహాయం చేసుకోలేని వారు మానవ సంక్షేమానికై దివ్యశక్తులను అడుగుతారు. ఇది ఎలా ఉందంటే, తమ కాళ్ళ మీద తాము నిలబడ లేని వాళ్ళు, ఎవరైనా సహాయము చేసి తమను నిలబెడితే శత్రువులను చంపుతామని చెప్పినట్లుంది. ఉద్దేశము మంచిదే కాని తమ యోగ్యత గురించి సరియైన ఆలోచన, అవగాహన లేవు". ఆ కుర్రవాడు

దీనిని విని, తర్వాత అకస్మాత్తుగా లేచి నిలబడి భగవాన్కు నమస్కరించి "తండ్రీ! తండ్రీ! నేను పొరబడితిని. నన్ను క్షమించు. నాకు బోధించు. మీరు చెప్పినట్లు నడుచుకుంటాను". మళ్ళీ సాయంకాలం అతడు "నేను మీకు శరణాగతుడను" అని చెప్తూ సాష్టాంగ నమస్కారం చేసాడు.

## భాషణములు 52

కాకినాడ (ఆ రోజుల్లో దానిపేరు కొ-కెనడా) నుండి వచ్చిన ఒకరు

నా మనస్సు రెండు మూడు రోజులు స్పష్టంగా ఉంటుంది. ఆపై రెండు మూడు దినాలు మందంగా ఉంటుంది. ఇలా ఒకటి మార్చి మరొకటిగా జరుగుతూనే ఉంది. ఎందువల్ల?

మ: అది సహజమే. ఇది ఒకదాని తర్వాత ఒకటి మారే సత్త్వ - రజస్సు- తమస్సు అనే గుణాల ఆట. తమస్సు ఉందని బాధ పడక, కాని సత్త్వగుణం ప్రధానంగా ఉన్నప్పుడు దానిని గట్టిగా పట్టుకో. దానిని పూర్తిగా ఉపయోగించుకో.

భ: హృదయమంటే ఏమిటి?

మ: ఒకవేళ స్థానం అనవచ్చు అంటే, అది ఆత్మస్థానం.

భ: అది భౌతికమైన గుండెకాయా?

మ: కాదు. అది "నేను-నేను" అన్న భావన ఉత్పన్నమయ్యే స్థానం.

భ: చనిపోయిన తరువాత జీవుని గతి ఏమిటి?

మ: ఇప్పుడు బ్రతికి ఉన్న జీవుడు అడగదగ్గ ప్రశ్న కాదు. వీలయితే దేహం విడిచి పోయిన జీవుడు నన్నడగనీ. అంతవరకు దేహి అయిన జీవుడు ఇప్పటి సమస్యను పరిష్కరించి తానెవడో కనుక్కోనీ. ఆపై అట్టి సందేహాలకు తావుండదు.

భ: ధ్యానమంటే ఏమిటి?

మ: సాధారణంగా ధ్యానమంటే ఏదో ఒక విషయాన్ని ఏక చింతనం చేయడం. ఆత్మ అనుసంధానాన్ని నిదిధ్యాసనం అంటారు. ఆత్మజ్ఞానం పొందేవరకూ కూడా త్రిపుటి ఉండనే ఉంటుంది. సాధకునికి ధ్యానము, నిదిధ్యాసనమూ రెండూ సమానమే. ఎందుకంటే రెండింటిలోనూ త్రిపుటి ఉంది. మరియు అవి భక్తికి పర్యాయపదాలు. (త్రిపుటి అంటే ధ్యానం చేసేవాడు, ధ్యేయ వస్తువు మరియు ధ్యానం చేయడం)

భ: ధ్యానాన్ని అభ్యసించడం ఎలా?

మ: ధ్యానం చిత్తాన్ని ఏకాగ్రం చేస్తుంది. అన్నిటికంటే ముఖ్యమైన ఆలోచన మిగిలిన ఆలోచనల కెడమీయదు. ధ్యానరీతి వ్యక్తిని బట్టి మారుతుంటుంది. ధ్యానం దైవం పైననో, మంత్రమందో, లేక ఆత్మయందో ఉండవచ్చు.

## భాషణములు 53

పాల్ బ్రంటన్ వ్రాసిన రెండు గ్రంథాలను చదివి భగవాన్ను చూడవచ్చిన యువకుడు శ్రీనౌల్స్ ఇలా అడిగాడు: "బౌద్ధులు "నేను" నిజం కాదు (ఆత్మమిథ్య) అంటారు. కానీ పాల్ బ్రంటన్ తన "సీక్రెట్ పాత్" అనే పుస్తకంలో "నేను" ఆలోచనను వదిలి "నేను" అనే స్థితి (ఆత్మస్థితి)కి చేరాలి అంటాడు. ఏది నిజం?"

మ: రెండు "నేను"లు ఉన్నట్లు అనుకొంటారు. ఒకటి అల్పమైనది, నిజం కాదు. దీని గురించి మనందరికీ తెలుసు. రెండవది ఉత్కృష్టమైనది, నిజమైనది. దీనినే అనుభవ సిద్ధం చేసుకోవాలి. నిద్రలో నిన్ను నీవు ఎరుగవు. ఎరుగునది మేల్కొన్న తర్వాతనే. మేల్కొన్న తర్వాతనే నిద్రించానని అంటావు. గాఢంగా నిద్రిస్తున్న నీకు నీ నిద్ర తెలియదు. దేహ స్మృతిలోనే నానాత్మ భావన కూడా జనిస్తుంది. ఈ దేహభావన ఒకానొక ప్రత్యేక క్షణంలో పుట్టింది. దానికి ఆద్యంతాలు ఉన్నాయి. పుట్టింది అంటే అది ఏదో ఒకటి అయి ఉండాలి. ఆ ఏదో ఒకటి ఏమిటి? అదే "నేను" అనే భావన. నేను ఎవరు? ఎక్కడనుండి నేను వచ్చాను? ఆ మూలము కనుక్కొన్న తర్వాత సంపూర్ణ చైతన్యస్థితిని నీవు తెలిసికొంటావు.

భ: ఈ "నేను" ఎవరు? ఇది కేవలము ఇంద్రియ అనుభవ ప్రవాహ ఫలితమనిపిస్తుంది. బౌద్ధుల అభిప్రాయము కూడా అదే అనిపిస్తుంది.

మ: ప్రపంచము బాహ్యము కాదు. ఇంద్రియ అనుభవములకు మూలము బయట ఉండలేదు. ఎందుకంటే, చైతన్యంతో మాత్రమే ప్రపంచం గుర్తించగలము. ప్రపంచం తాను ఉన్నట్లు చెప్పదు. అది నీ అనుభవం. అలా అయితే కూడా ఈ అనుభవం స్థిరం కాదు. అవిచ్ఛిన్నం కాదు. గాఢనిద్రలో ప్రపంచం గుర్తించబడదు. కాబట్టి నిద్రించేవానికి ప్రపంచం లేదు. ప్రపంచం అహంకారం యొక్క పరంపరయే. ఈ అహంకారాన్ని కనుక్కో దాని మూలం కనుక్కోవడమే పరమగమ్యం.

భ: జీవ హింస చేయకూడదని నా నమ్మకం. అలా అయితే మనం దోమలు కుడితే కూడా ఓర్చుకొని, వాటికి కూడా లొంగవలసిందేనా?

మ: నువ్వు స్వయంగా బాధపడడానికి ఇష్టపడవు. ఇతరులకు ఎలా బాధ కలించగలవు. దోమకాటులకు నువ్వు బాధపడుతున్నావు కాబట్టి వాటికి దూరంగా వుండు.

భ: దోమలు, నల్లులు మొదలైన జీవులను చంపవచ్చా?

మ: ప్రతివ్యక్తీ ఆత్మ ఘాతకుడే. అజ్ఞానంతో నిండిన ఈ జీవితం, నిత్యమూ, ఆనంద పూర్ణమూ, సహజమూ అయిన స్థితిని నులిమి చంపివేస్తోంది. ఈ విధంగా చూస్తే శాశ్వతమూ, పురాతనమూ అయిన పరమసత్యాన్ని చంపడమే. ఇది ఆత్మహత్యకు నిదర్శనం కాదా? అందుచేత ప్రతివ్యక్తీ ఆత్మహంతకుడే. హత్యల గురించి, చావుల గురించి చింత ఏల?

వేరొక మారు సంభాషణ సమయంలో నౌల్స్ మహర్షితో అన్నాడు: " ప్రపంచం అనుభవాలను పంపిస్తే నేను మేల్కొంటున్నాను".

మ: చూసేవాడు లేకుండా ప్రపంచం ఉందా? ఏది మొదటిది, ఉన్న- చైతన్యమా లేక ఉదయిస్తున్న- చైతన్యమా? ఉన్న - చైతన్యము (సత్- చైతన్యము) ఎప్పుడూ ఉంది. అది నిత్యమూ, నిర్మలమూ. ఉదయిస్తున్న- చైతన్యము పుట్టి మాయమౌతుంది. అది క్షణభంగురము.

భ: నేను నిద్రిస్తున్నప్పుడు కూడా, ఇతరులకు ప్రపంచము లేదా?

మ: అటువంటి ప్రపంచం, నిన్ను నువ్వు తెలిసికోకుండా తనను తెలిసికొన్నందుకు, నిన్ను చూసి నవ్వుతుంది. ఈ ప్రపంచం నీ మనస్సు యొక్క ఫలితమే. నీ మనస్సును నువ్వు తెలిసికో. అప్పుడు ప్రపంచాన్ని చూడు. అప్పుడు నీకు తెలుస్తుంది. అది నీ ఆత్మకంటే వేరుగా లేదని.

భ: నేను నా పరిసరాలను స్పష్టంగా ఎరిగిన విధంగా, మహర్షికి కూడా, వారి పరిసరాలు తెలుస్తాయా?

మ: ఈ సందేహం ఎవరికి? ఆత్మజ్ఞానికి ఈ సందేహాలు లేవు. ఇవి కేవలం అజ్ఞానికే కలుగుతాయి.

## భాషణములు 54

ఆంధ్రపండితులొకరు, పెద్ద వయస్సువారు, కావ్యకంఠుల అద్వైత వివరణలపై సందేహాలు వెలిబుచ్చారు. బ్రహ్మమునకు సజాతీయ, విజాతీయ, స్వగత భేదాలు లేవని గ్రంథంలో చెప్పారు. ఇది వివర్త వాదానికి చెల్లుతుంది. కాని పరిణామ వాదానికి కాదు. పరిణామ వాదంలో స్వగత భేదం ఉండి తీరాలి. దీనికి మహర్షి ఇలా చెప్పారు. దక్షిణామూర్తి అలా ఏమీ చెప్పలేదు. బ్రహ్మము శక్తియుతుడని కాని, కాదని కాని వారు చెప్పలేదు. ఉండినది కేవలం మౌనమే. శిష్యుల సందేహాలన్నీ తీరాయి. నేర్చుకోవలసింది, చర్చించ వలసింది, నిర్ణయించవలసిందీ ఏమీలేదని దీని భావం. "నేను" ఉన్నాను అని ప్రతివాడికీ తెలుస్తుంది. "నేను దేహం" అనే భ్రాంతి ఉంది ఎందుకంటే "నేను" అనేది పరబ్రహ్మమునుండి పుట్టి బుద్ధికి కారణమవుతుంది. ఈ బుద్ధిలో "నేను" ఈ శరీర పరిమాణానికి, ఆకారానికి పరిమితమవుతుంది. "న మేధయా" అనే శృతి వాక్యము అర్ధమేమిటంటే బ్రహ్మమును బుద్ధితో గుర్తించలేము. బ్రహ్మము నుండి అహము (నేను – నేను) దానినుండి బుద్ధి.

ఈ బుద్ధి, అహమును దాటి బ్రహ్మమును ఎట్లు గుర్తించగలదు? ఇది అసంభవము. "నేను దేహము" అనే తప్పు అభిప్రాయమును దాటు. ఈ ఆలోచనలు ఎవరికి అనేది గుర్తించు. ఇప్పుడు ఉండే “నేను” అనే భావన మాయమయితే, కనిపెట్టే ప్రక్రియ పూర్తి అయినట్లే. మిగిలినది శుద్ధమైన ఆత్మయే. గాఢనిద్రను, మెలుకువను పోల్చి చూడు. మెలుకువలో భిన్నత్వం, శరీరం కనబడతాయి. గాఢనిద్రలో శరీరంగాని, ప్రపంచంగాని కనబడవు. కేవలం ఆత్మ మాత్రమే ఉంది. ఆనందం అక్కడ రాజ్యమేలుతుంది.

శృతి వాక్యం "అహం బ్రహ్మాస్మి" అనేది నిజస్థితికి సంబంధించినది, మనోస్థితికి సంబంధించినది కాదు. దీనిని మంత్రంలా జపం చేసి ఎవరూ బ్రహ్మమయిపోరు. అంటే బ్రహ్మము ఎక్కడో లేదు. అది నీ ఆత్మే. ఆ ఆత్మను కనుక్కో బ్రహ్మము దొరుకుతుంది. బ్రహ్మము ఎక్కడో ఉన్నట్లుగా దానిని చేరడానికి ప్రయత్నము చేయక.

ఆ పండితుడు “ఆలోచనలు, అహమును చేరడానికి వీలులేనంతగా దృఢంగా ఉన్నాయని" అన్నారు. భగవాన్ ఇలా అన్నారు. "ఇతర ఆలోచనల నుండి మనస్సును మరల్చడానికి బ్రహ్మాకారవృత్తి సాయపడుతుంది. అలాంటి ఒక అభ్యాసమేదయినా అవసరం లేదా సాధు సాంగత్యం అయినా చేయాలి. సాధువు అంటే అప్పటికే మనస్సును దాటి శాంతిలో స్థిరంగా ఉన్న వ్యక్తి. అలాంటి వ్యక్తి దగ్గరగా ఉంటే అది అటువంటి స్థితిని ఇతరులలో తేవడానికి సహాయపడుతుంది. అలా కాకపోతే సాధుసాంగత్యం కోరడంలో అర్ధమే లేదు.

"దేహం" (నేను ఈ శరీరము) అనేది పరిమితి. ఇదే అన్ని నీచమైన, స్వార్ధపూరితమైన పనులకు, కోర్కెలకు మూలము.

"అహం బ్రహ్మాస్మి" (నేను బ్రహ్మము) అనేది అన్ని పరిమితులను దాటడం. ఇది దయ, దానం, ప్రేమ మొదలైన ధార్మికము, దివ్యమైన లక్షణాలను సూచిస్తుంది.

భ: మోక్షమార్గంలో గృహస్థుని పరిస్థితి ఏమిటి?

మ: నీవు గృహస్థుడనుకోవడం ఎందుకు? నీవు సన్న్యాసిగా బయటకు వెళ్ళేకూడా ఇలాంటి ఆలోచనే (నేను సన్న్యాసిని) నిన్ను వెంటాడుతూ ఉంటుంది. ఇంటిలో ఉన్నా, అడవులకు వెళ్ళినా, మనస్సు నీ వెంటే వస్తుంది. ఆలోచనలన్నింటికీ మూలం అహంకారమే. అదే నీ శరీరాన్ని, ప్రపంచాన్ని కల్పించి, నీవు గృహస్థుడిని అనే ఆలోచనను ఇస్తుంది. నీవు సంసారాన్ని వదిలితే అది నీ ఆలోచనలలో గృహస్థు స్థానంలో సన్న్యాసిని, ఇంటి స్థానంలో అడవి వాతావరణాన్ని నిలుపుతుంది. మానసిక అడ్డంకులు ఎప్పుడూ ఉంటాయి. నిజానికి కొత్త పరిస్థితులలో అవి ఎక్కువ అవుతాయి కూడా. వాతావరణం, పరిస్థితుల మార్పువలన సహాయం ఏమీరాదు. మనస్సే అడ్డంకు. అడవిలో ఉన్నా, ఇంట్లో ఉన్నా దీనిని దాటవలసిందే. ఇది నువ్వు అడవిలో చెయ్యగల్గితే, ఇంట్లో ఎందుకు చెయ్యకూడదు? అందువలన పరిసరాలను మార్చడం ఎందుకు? ప్రయత్నాలు ఇప్పుడే చెయ్యవచ్చు. -ఎటువంటి పరిసరాలలో ఉన్నాసరే.

నీ కోరికల బట్టి, పరిసరాలు, ఎప్పుడూ నిన్ను వదలవు. నన్నే చూడు. నేను ఇల్లు వదిలేసాను. నిన్ను చూసుకో. ఇంటి పరిసరాలను వదలి నీవు ఇక్కడికి వచ్చావు. నీకు ఇక్కడ ఏమి కనబడింది. నీవు వదిలిన దానికి దీనికి ఏమైనా తేడా ఉందా? ఎవరైనా సంవత్సరాల తరబడి నిర్వికల్ప సమాధిలో మునిగి ఉంటే కూడా, దానినుండి బయటకు వచ్చినప్పుడు ఆ వ్యక్తి కూడా ఏదో ఒక పరిసరాలలోనే ఉండక తప్పదు. అందుకే శ్రీశంకరాచార్యులవారు తన అద్భుతమైన వివేక చూడామణిగ్రంథంలో నిర్వికల్ప సమాధికంటే కూడా సహజసమాధియే ఎంతో మేలని వక్కాణించారు.

ఏ పరిసరాలలో ఉన్నా తనకు సహజమైన సమాధి - తన అతి స్వచ్ఛమైన స్థితిలో నిలబడడం మంచిది.

తరువాత భగవాన్, "శ్వాస నిరోధం, లోపలా బయటా కూడా చేయవచ్చు" అన్నారు. అంతర్ ప్రాణాయామ (లోపలి ప్రాణాయామ) క్రమం ఇలా ఉంటుంది.
నాహం చింతా: (నేను దేహము కాదు అనే ఆలోచన) ఇది రేచకం (ఊపిరి వదలడం)

కోహం: నేనెవరు? ఇది పూరకం (ఊపిరి లోపలికి పీల్చుకోవడం)

సోహం: ఆ పరమాత్మ నేను, ఇది కుంభకం (ఊపిరి నిలపడం, అంటే ఊపిరి బిగబట్టడం)

ఇలా చేస్తే ప్రాణాయామం సులభంగా సిద్ధిస్తుంది. బహిర్ ప్రాణాయామము (అంటే బయట శ్వాశను నిగ్రహించడం) మనస్సును నిగ్రహించడానికి బలం లేని వానికి ఉద్దేశించబడింది. మనో నిగ్రహానికి ఇంత ఖచ్చితమైన మార్గం మరొకటిలేదు. ఇది కాకపోతే సాధు సాంగత్యమే శరణ్యము. సాధుసంగ భాగ్యం లభించనివాడు, బుద్ధిమంతుడైతే బహిః ప్రాణాయామాన్ని ఆశ్రయించవచ్చు. సాధుసంగత్యం, ఇతరులకు కనిపించకపోయినా కావలసిన శక్తిని ఇస్తుంది. ప్రాణాయామం, తు.చ. తప్పకుండా, హఠయోగంలో చెప్పినట్లే ఉండనక్కరలేదు. భక్తి, ధ్యాన, జపాదులను అభ్యసించే వేళల్లో, ఏ కొద్దిపాటి శ్వాసక్రియ నియమమైనా మనోనిగ్రహానికి సరిపోతుంది. మనస్సు అశ్వికుడు (గుఱ్ఱం మీద కూర్చున్నవాడు), శ్వాస గుఱ్ఱము. ఆ గుఱ్ఱమునకు పగ్గము ప్రాణాయామం. ఆ పగ్గంతో అశ్వికుడు కూడా నిగ్రహించబడతాడు.

ప్రాణాయామం కొంచెం చెయ్యవచ్చు. శ్వాసను గమనించడం శ్వాస నిరోధానికి ఒక మార్గం. ఇతర కార్యాలనుండి మళ్ళించిన మనస్సు, శ్వాసను పరికించడంలో లగ్నమవుతుంది. ఆ పరికించడమే శ్వాసను నిరోధిస్తుంది. దీని వలన మనస్సు నిగ్రహించబడుతుంది.

సాధ్యపడకపోతే, రేచక పూరకాలను మానివేయవచ్చు. జపధ్యానాదులు శ్వాసను కొంత వరకు అదుపులో ఉంచుతాయి. దానివలన కూడా మంచి ఫలితాలు ఉంటాయి.

## భాషణములు 55

భ: రాముడు, కృష్ణుడు మొదలైన దివ్యమైన నామముల జపం వల్ల అద్వైతానుభవం కల్గుతుందా?

మ: కల్గుతుంది.

భ: సాధనలలో జపం చాలా క్రింది తరగతికి చెందినది కదా?

మ: నిన్ను చెయ్యమన్నది జపమా, సాధనలలో హెచ్చు తగ్గులను నిర్ణయించమనా?

భ: మౌనం (జవాబు లేదు)

## భాషణములు 56

ఇరవై ఏండ్ల యువకుడొకడు ఆత్మానుభవం పొందేదెలా అని అడిగాడు. మౌనంగా కూర్చొని, గంటపైగా బదులుకై వేచి, అంతట లేచి పోబోతూ మళ్ళీ అడిగాడు.

భ: ఆత్మానుభవం పొందేదెట్లా?

మ: ఎవరి ఆత్మ? కనుక్కో

భ: నేను ఎవరు?

మ: కనుక్కోవలసింది నీవే.

భ: నేనెఱుగను.

మ: ఆలోచించు. "నేనెఱుగను" - అని అంటున్నదెవరు? ఎఱుగబడనిది ఏది? ఆ వాక్యంలో "నేను" ఎవరు?

భ: నాలో ఒకరు.

మ: ఆ ఒకడెవరు? ఎవరిలో?

భ: ఏదైనా శక్తి కావచ్చు.

మ: దాన్నే తెలిసికో

భ: బ్రహ్మానుభవం పొందేదెట్లా?

మ: నిన్ను నీవు తెలిసికోకుండా, బ్రహ్మాన్ని తెలిసికోవాలనుకోవడం ఏమిటి?

భ: శాస్త్రాలు బ్రహ్మము సర్వమయుడన్నాయి. ఆ సర్వం నన్ను కూడా కలిపేకదా?

మ: ఆ "నన్ను" లోని "నేను" ను వెదుకు. బ్రహ్మము వెదికేందుకు కావలసినంత సమయం ఉంది.

భ: నేను ఎందుకు పుట్టాను?

మ: ఆ పుట్టినదెవరు? నీ ప్రశ్నలన్నింటికీ బదులదే.

భక్తుడు: అయితే నేనెవరు?

మహర్షి: (చిరునవ్వుతో) నీవు నన్ను పరీక్షించడానికి వచ్చావా, అడిగి తెలుసుకోవడానికా? నీవెవరో నీవే చెప్పాలి.

భ: గాఢనిద్రలో, జీవుడు దేహాన్ని వీడి మరెక్కడో ఉండిపోతుంది. ఆది దేహంలో మళ్ళీ ప్రవేశించినపుడు నేను మేల్కొంటాను. అవునా?

మ: దేహాన్ని వీడినది ఎవరు?

భ: బహుశ ఏదో శక్తి.

మ: ఆశక్తిని కనుక్కో

భ: దేహాన్ని పాంచభౌతికమన్నారు. ఆ పంచభూతాలు ఏమి?

మ: నిన్ను తెలియని నీవు, పంచ భూతాలను తెలిసికోవాలనుకోవడం ఏమిటి?

ఆ కుఱ్ఱవాడు కొంచెంసేపు కూర్చొని సెలవు తీసికొని వెళ్ళాడు. తర్వాత మహర్షి అన్నారు. "మంచిదే, అది పని చేస్తుంది."

## భాషణములు 57

శ్రీ భగవాన్ ఇలా చెప్పారు. శాస్త్రాలు పలుచోట్ల సుషుమ్నను పేర్కొన్నాయి. ఇతర పదాలూ ఉన్నాయి. పర, ఆత్మ, అమృత మొదలైనవి.

“పరా”లో సుషుమ్న లీనమవుతుందని కూడా తెలుపబడింది. అందుచేత, “పరా” “జ్ఞాన” పరిభాష అని, “సుషుమ్న” “యోగ” పరిభాష అని చెప్పవచ్చు.

శ్రీ రమణ గీతలో ఒక సందేహానికి సమాధానం

14వ అధ్యాయంలో 10వ శ్లోకం - "ఆత్మానుభవ పరిపాకముచేత, అదృశ్యత్వము కూడా సిద్ధించవచ్చు. అట్టివాడు శుద్ధ జ్ఞాన రూపుడు సిద్ధుడుగా విహరిస్తాడు."

18వ అధ్యాయంలో చివరి శ్లోకం. "సిద్ధుల మహిమ ఊహాతీతము. వారు శివునితో సమానులు. వరాల్ని అనుగ్రహించడంలో సాక్షాత్తు శివ స్వరూపులే" ఆత్మానుభవంతో నిజమైన నిరంతరమైన తపస్సు సిద్ధిస్తుంది. అట్టి తప:

పరిపాకంతో జ్ఞానులు తమ దేహాలను స్పర్శకూ, చూపులకూ అందనివిగా చేయగలరు. వారు సిద్ధులుగా ప్రసిద్ధులు.

"సిద్ధుల మహిమలు తెలియజాలము. వారు దేవునితో సమానులు. వరాలు కూడా ఇయ్యగలరు." అన్నారు భగవాన్.

“ఆత్మజ్ఞంహ్యర్చయేత్ భూతి కామ:”

(ముక్తిగాని, సంపదలనుగాని కోరువారు ఆత్మజ్ఞుని సేవించవలెను.) అనునది ఒక ఉపనిషత్తులో మంత్రము. ఇక్కడ వరములిచ్చే వారిలో సిద్ధులను చేర్చలేదు. జ్ఞాని వరములియ్యగలడు.

మరియు, "స్వేమహిమ్ని ప్రతిష్ఠిత:" (తన మహిమయందు నెలకొన్నవాడు), "అనంతం బ్రహ్మ" (బ్రహ్మము అనంతము) - అను మంత్రములు పైన ఉదహరించిన శ్లోకముతో కలిపి చదివినపుడు సంశయాలు వస్తాయి. "సర్వం ఖల్విదం బ్రహ్మ", (ఈ సమస్తము కూడా బ్రహ్మమే), "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" (బ్రహ్మము నెఱిగినవాడు బ్రహ్మమే అగును.) అను వాక్యాలు జ్ఞాని సర్వజ్ఞుడని తెలుపును. అలాంటప్పుడు జ్ఞానికి సిద్ధునకు మధ్య భేదమేమిటి? వరములిచ్చే శక్తి సిద్ధులకు ఉన్నది అనడం వలన జ్ఞానికి ఆ శక్తి లేదని అర్థం వస్తుంది కదా?

ఇదే సందేహం. దీనికి భగవాన్ ఈ విధంగా వివరణ ఇచ్చారు. రమణ గీతలోని శ్లోకములలో ప్రశ్నల దృష్టి వేరు. సమాధానాలు కూడా ఆ దృష్టితోటివే. జనులు రూపాన్నే చూస్తారు.

వారికి సిద్ధులు (మహిమలు) కూడా కావాలి. ఆత్మానుభవం కలిగిన తర్వాత ఏ శక్తులూ కూడా దానిలోనికి విస్తరించుటకు కూడా సమర్థములు కావు. ఇక అవి దానికి అతీతంగా ఎలా విస్తరించగలవు? సిద్ధులు కొఱకు ఆత్ర పడే జనులు, జ్ఞానంతో తృప్తి పడక దానికి ఈ మహిమలను జోడిస్తారు. జ్ఞానం పరమానందం ప్రసాదిస్తుంది. దాన్ని కూడా కాదని వీరు సిద్ధులను కోరుకుంటారు. దీని కొరకు వారు రాజమార్గమునకు బదులుగా సందులు గొందుల ద్వారా పోవుచూ బహుశ దారి తప్పుతారు. వారికి చక్కగా దారి చూపి వారిని రాజమార్గంలో నిలుపవలెననే ఉద్దేశ్యంతో శాస్త్రాలలో సిద్ధులు జ్ఞానాన్ని అనుసరించునని చెప్పబడినది. నిజానికి అన్నీ జ్ఞానంలో ఉన్నాయి. జ్ఞాని సిద్ధుల గురించి ఒక్క ఆలోచన కూడా చేయడు. జనులు జ్ఞానమును పొందిన తర్వాత కావాలంటే సిద్ధులకొరకు ప్రయత్నించుదురుగాక.

"శరీర సంశ్రయా సిద్ధయ:" అని ముందు చెప్పి ఉన్నాను. (సిద్ధులు శరీరమునకు సంబంధించినవి అని). ఎందుకంటే వాని దృష్టి దేహానికి చెందినది. నిజానికి జ్ఞాని, సిద్ధుడూ వేరుకాదు. "వరాన్ దాతుం" అనే పదములలో, వరములలో ఆత్మ లాభము కూడా చేరి ఉంది. సిద్ధులు కేవలం క్రింది క్రోవకు చెందినవే కాక ఉత్తమ శ్రేణికి చెందినవి కూడా ఉన్నాయి.

వేర్వేరు పరిస్థితులకు తగినట్లుగా శాస్త్రాలు ఉద్దేశించబడ్డాయి. "హలస్య మహిమ" అనే గ్రంథంలో అష్ట సిద్ధుల గురించి ఒక అధ్యాయం ఉంది. అక్కడ శివుడంటాడు, తన భక్తుడు ఈ సిద్ధుల విషయంలో ఒక్క ఆలోచన కూడా వ్యర్థం చేయడని, అలాగే భక్తుల కోరికలు వారి వారి ప్రారబ్దాల కనుగుణంగా తీరుతాయే గాని, వర్షాలు తానెప్పుడూ ఇచ్చి యెఱుగనన్నాడు. ఈశ్వరుడే అలా అనేటప్పుడు, ఇతరుల మాటేమిటి?

మహిమల ప్రదర్శనానికి వానిని మెచ్చే ఇతర జనులుండాలి. అంటే వానిని చూసేవాడు జ్ఞాని కాడనేగా? అందువలన సిద్ధులు ఏమాత్రమూ ఆలోచించదగినవికావు. జ్ఞానమొక్కటే లక్ష్యంగా చేసికొని దాన్ని పొందాలి. శ్రీరమణగీత 17వ అధ్యాయం 4వ శ్లోకం - దీని తమిళానువాదం సరికాదని, ఆ తప్పేమో చూపి శ్రీ భగవాన్ సరిదిద్దారు. వైదర్భుని ప్రశ్న ఇది.

"అభ్యాన సమయంలో ఆలోచనలు వరుసగా వ్యక్తమవుతూ, అణిగిపోతూంటాయి. ఇది జ్ఞానమా?"

భగవవాన్ వివరణ ఇలా ఇచ్చారు.

జ్ఞానంలో వివిధ దశలున్నాయని కొందరి మతం, ఆత్మ నిత్యం, అపరోక్షమే. తెలిసినా, తెలియకపోయినా సదా అనుభవ గోచరమే. అందువలన శ్రవణము అపరోక్ష (ప్రత్యక్ష) జ్ఞానమని, పరోక్ష జ్ఞానం కాదని వారి మతం. కాని జ్ఞానం యొక్క ఫలితం దు:ఖ నివృత్తి. కాని అది శ్రవణం వలన మాత్రమే కలగదు. అందువలన అది అపరోక్షమయిననూ స్థిరము కాదు. రేకెత్తే వాసనలే దాని అస్థిరతకు కారణం. వాసనలు తొలగితే జ్ఞానం నిశ్చలమై ఫలిస్తుంది. - అని వారంటారు. శ్రవణము పరోక్ష జ్ఞానమే అని మరికొందరు అంటారు. అది మననం వలన అప్పుడప్పుడు అపరోక్షమౌతుంది. అది నిరంతరంగా సాగడానికి వాసనలు అడ్డు వస్తాయి. మననం తర్వాత అవి బలం పుంజుకుని విజృంభిస్తాయి. వానిని అదుపులో

ఉంచాలి. దానికి రెండు విధాల జాగ్రత్తపడాలి. (1) "దేహోనాహం" (నేను దేహం కాను) అని సదా జ్ఞప్తియుంచుకోవడం, (2) మననం చేసేటప్పుడు, అప్పుడప్పుడు లభించే అపరోక్షానుభవాన్ని అంటిపెట్టుకొని ఉండడం.

ఈ ప్రయత్నాన్ని (అభ్యాసమును) నిది ధ్యాసనము అంటారు. ఇది వాసనలను నిర్మూలిస్తుంది. అప్పుడు వచ్చేదే సహజ స్థితి. అది నిశ్చితమైన జ్ఞానం.

మననంలోని అ పరోక్షానుభవం దుఃఖ నివృత్తి చెయ్యదు. అందువలన అది మోక్షము, అంటే బంధ నివృత్తితో, సమానం కాదు. ఎందుకంటే వాసనలు అప్పుడప్పుడూ జ్ఞానాన్ని అణచివేస్తాయి. కాబట్టి అది ధృడం కాదు. నిది ధ్యాసనచేత వాసనలు నిర్మూలించబడ్డాక జ్ఞానం ధృడమవుతుంది.

మరల, శ్రీరమణగీత:

శ్రీ టి.కె.యస్. అయ్యర్ చక్రాలు (కుండలినీ చక్రాలు) గురించి మాట్లాడుచుండిరి.

శ్రీభగవాన్ ఇలా చెప్పారు: ఆత్మ ఒక్కటే అనుభవానికి తెచ్చుకోవలసినది. మిగిలినవన్నీ ఆత్మానుభవంలోనివే. శక్తి, గణపతి, సిద్ధులు మొదలైనవి దానిలో చేరి ఉన్నాయి. దీని గురించి మాట్లాడేవారు ఆత్మజ్ఞులు కారు. ఆత్మ హృదయము నందు ఉంది. అది హృదయమే. దాని ఆవిర్భావము మెదడులో ఉంది. హృదయం నుండి మెదడుకు సుషుమ్నా (పేరేదైతేనేం) నాడి ద్వారా ఆత్మశక్తి ప్రవహిస్తుందనుకోవచ్చు. సుషుమ్న లేదా అలాంటి నాడులన్నీ “పరా” అనగా "ఆత్మనాడి" లోనివే.

అందుకే ఉపనిషత్తులు సుషుమ్నను పేర్కొంటూ 'పరలీనా' అన్నవి. సహస్రారము (మెదడు) వరకు పైకిబోయిన ప్రవాహము అక్కడ ఆగిపోతుందని యోగులు అంటారు. ఆ అనుభవము పూర్ణ అనుభవము కాదు. జ్ఞానానికైవారు ౯ హృదయానికి రావాలి. హృదయమే ఆదియు, అంతమూ కూడా.

## భాషణములు 58

శ్రీ రంగనాథన్, ఐ.సి.ఎస్

శ్రీమద్భగవద్గీతలో ఒకచోట ఇలా ఉంది. "వ్యక్తికి స్వధర్మం ఇతర ధర్మాలన్నిటి కన్నా శ్రేయస్కరం, పరధర్మం, భయావహం" స్వధర్మం యొక్క విశిష్టత ఏమిటి?

మహర్షి: ధర్మమంటే సామాన్యంగా వర్ణాశ్రమ ధర్మం సూచించబడుతుంది. భౌతిక పరిసరాలను కూడా లెక్కలోనికి తీసుకోవాలి.

భ: వర్ణాశ్రమ ధర్మమే ఉద్దేశిస్తే, అది ఒక్క భారతదేశానికే వర్తిస్తుంది. కాని గీత సర్వదేశాలకు వర్తించేది కదా!

మ: ప్రతి దేశంలోనూ ఏదో ఒక రూపంలో వర్ణాశ్రమాలు ఉన్నాయి. ఎవరైనా సరే, ఒకటే అయిన ఆత్మను అవలంబనగా గ్రహించి, దాని నుండి చలించకూడదు. ఆ శ్లోక సారమింతే.

స్వః తన స్వీయము అంటే, ఆత్మ సంబంధమైనది. పరః ఇతరునిది అంటే అనాత్మ సంబంధమైనది. ఆత్మ నిష్ఠయే ఆత్మధర్మము. అక్కడ విక్షేపము, భయము ఉండదు. తనకంటే వేరుగా రెండవది ఉన్నప్పుడే కష్టాలు వస్తాయి. ఆత్మయే ఏకైక వస్తువుగా అనుభవగోచరమైతే, రెండవది లేదు. అందువలన భయకారణము కూడా లేదు. మనిషి, తాను ఇప్పుడున్న స్థితిలో, అనాత్మ ధర్మమును ఆత్మధర్మముగా భ్రమపడి బాధపడుతున్నాడు. అతడు ఆత్మను తెలిసికొని దానియందు స్థిరముగా ఉంటే భయముపోయి, సందేహములు కూడా మొలకెత్తవు.

అది వర్ణాశ్రమధర్మమనే గ్రహించినా, దాని తాత్పర్యమదే. అట్టి ధర్మము నిస్స్వార్థముగా చేస్తేనే ఫలితమిస్తుంది. అంటే కర్త తాను కాదనీ, ఆ సర్వశక్తియొక్క ఉపకరణము మాత్రమే అని వ్యక్తి తెలిసికొని తీరాలి. ఆ ఉన్నతశక్తి అనివార్యమైన వాటినే చేయుగాక, ఆ శక్తి ఆజ్ఞలను అనుసరించి మాత్రమే నేను నడుచుకొందును గాక, పనులు నావి కావు. అందువలన ఆ చర్యల ఫలితములు కూడా నావి కాజాలవు. వ్యక్తి అట్లు అనుకొని ప్రవర్తిస్తే ఇక బాధ ఎక్కడిది? అది వర్ణాశ్రమ ధర్మమైనా లేక లౌకిక ధర్మమైనా ముఖ్యము కాదు. చివరకు, దాని తాత్పర్యము ఇది:

స్వ = ఆత్మనః (ఆత్మయొక్క).

పర = అనాత్మనః (అనాత్మయొక్క)

సందేహాలు రావడం సహజమే. ఆధునికుడు వేర్వేరు వృత్తులతో ఎలాగో జీవనం గడపాలి. వాని బ్రతుకునకూ శాస్త్ర వాక్యాలిచ్చే సంప్రదాయమైన అర్థాలకు సమన్వయం సులువుకాదు.

మధ్యలో కల్పించుకొని, ఒక పుదుచ్చేరి నుండి వచ్చిన వ్యక్తి “సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ" (సమస్త విధులను వదలి నన్ను మాత్రమే శరణు వేడుము) అన్నది వల్లించాడు.

శ్రీ భగవాన్: సర్వము అనగా అనాత్మనః (అనాత్మకు సంబంధించినది) అనియే అర్థము. నొక్కి వక్కాణించడం "ఏకం" మీద మాత్రమే. “ఏకము”ను (ఒక్కదానిని) గట్టిగా పట్టుకొన్నవానికి ధర్మములు ఎక్కడ ఉన్నాయి? "ఆత్మయందు మునుగుము. (లీనమగుము) అని దాని అర్థం.

భ: కర్మను బోధించడానికి కదా చెప్పింది?

మ: గీత ఏమి చెప్తోంది? అర్జునుడు యుద్ధం చెయ్యనన్నాడు. అప్పుడు కృష్ణుడు ఇలా చెప్పాడు. “యుద్ధం చేయనంతకాలం నీకు కర్తృత్వ బుద్ధి ఉంది. చేయడానికి గాని, మానడానికి గాని నీవెవడవు? కర్తృత్వ భావనను వదులు. ఆ భావన ఉన్నంతసేపూ, నీవు కర్మను చేసి తీరుతావు. ఆ అతిశయ దివ్యశక్తి నిన్ను ఆడిస్తోంది. ఆ శక్తికి లొంగడానికి నువ్వు నిరాకరించడం వలననే దానిని అంగీకరిస్తున్నావు. దానికి బదులుగా ఆ శక్తిని గుర్తించి, దానికి ఉపకరణంగా లొంగిపో. లేదా మరోవిధంగా చెప్పాలంటే నీవు నిరాకరిస్తే బలవంతంగా దానిలోనికి ఆకర్షించబడతావు. ఇష్టంలేని కార్యకర్తగా ఉండడంకంటే ఇష్టమున్న కార్యకర్తలా ఉండు.

"ఆత్మనిష్ఠుడవై కర్తృత్వభావన లేకుండా స్వభావాన్ని అనుసరించి నడుచుకోవడం మేలు. అపుడు కర్మఫలాలు నిన్ను బాధించవు. అదే పౌరుషమూ, శౌర్యమూనూ".

"గీతోపదేశసార సర్వస్వమూ ఆత్మనిష్టయే" అన్నారు భగవాన్. "ఆత్మలో సుప్రతిష్ఠుడైన వానికి ఏ సందేహాలు కలగవు. కలిగితే అతడాత్మలో స్థిరమవకముందే ఉండాలి."

భ: అలా అయితే విచారణ చేసే వానికి ఈ సమాధానం వల్ల ఏమి ప్రయోజనం?

మ: అయితే కూడా వాక్కులకు శక్తి ఉంది. క్రమంగా అది తప్పక పని చేస్తుంది.

## భాషణములు 59

ఒక మౌల్వీ: "నిద్ర వ్యక్తిని ఎలా ముంచి వేస్తుంది?”

మ: విచారణచేసే సాధకుడు తాను మేల్కొని ఉన్నప్పుడు, వానికా మేల్కొని ఉన్నదెవరో తెలిస్తే, నిద్ర ఎలా ముంచివేస్తుందో కూడా తెలుస్తుంది. నిద్రించే వానికి ప్రశ్నరాదు. మెలుకువగా ఉన్నవానికే వస్తుంది. నిద్రలో ఉన్నప్పుడు ఆత్మకన్నా, మేల్కొని ఉన్నప్పుడు ఆత్మను తెలిసికోవడం సులువు కదా!

భ: నేను ఎలా మేల్కొన్నానో అదినాకు తెలుసు. కాని నిద్ర వచ్చేదెలాగో తెలియదు. నేను మేల్కొని ఉన్నానని ఎరుగుదును. ఉదాహరణకు నా చేతికర్ర సెవరైనా కాజేయ చూస్తే నేనడ్డుపడతాను. కాని నిద్రలోనూ, కలలోనూ నేనట్లా చేయలేను. మెలుకువతో ఉన్నందుకు నిదర్శనం ఉంది. కాని నిద్రను నిరూపించేదెలా?

మ: నీ అజ్ఞానమే నిద్రకు నిదర్శనము. నీ ఎరుక నీ జాగ్రదావస్థకు సాక్ష్యం.

భ: కన్నుతెరవడమే, మేల్కొన్నానని తెలుపుతుంది. కాని నిద్ర నన్ను ఎట్లు ఆవేశిస్తుంది?

మ: నిద్ర నిన్ను ఆవేశించినట్లే మెలుకువా నిన్ను ఆవేశిస్తుంది.

భ: మెలుకువ వచ్చేది తెలిసినట్లుగా, నిద్ర వచ్చే రీతి నాకు తెలియడం

మ: ఏం పరవాలేదులే.

భ: ఏ ఉపమానాలూ లేక నిద్రయేమో దయచేసి చెప్పండి. నిద్ర ఒక్కటే తెలియాలి. నిద్రయొక్క నిజస్వరూపం ఏమిటో ఎరుగగోరుతున్నాను.

మః నిద్ర స్వరూపం నిద్రయే.

భ: వివాహితుడై ముక్తిని పొందుట మంచిదా లేక సన్న్యాసిగా ఉండి ముక్తిని పొందుట మంచిదా?

మ: నీకు ఏది మంచిదనిపిస్తే అదే మంచిది.

భ: వివాహిత దశలో విశ్వామిత్రుడు పతనం కాలేదు. సన్న్యాసి జీవితంలో పతనం చెందాడు. ఇది ఇతరులకు కూడా వర్తిస్తుందా?

మ: విశ్వామిత్రుడు గృహస్థుడుగా ఎంత పవిత్రుడో, యతిగా కూడా అంతే శుద్ధుడు. అందులో భేదమేమీలేదు. వారు సన్న్యాసిగా ఉన్నప్పుడు ఎంత కలుషితుడో వివాహితుడుగా ఉన్నప్పుడు కూడా అంతే కలుషితుడు.

భ: వారు ఋషులా?

మ: ఆయన కలుషితుడైనప్పుడు ఋషికాదు.

భ: తర్వాత అయినా ఆయన ఋషి కాగలడా?

మ: అవును. యోగ్యమైన భక్తితో ఆయన శ్రేష్ఠుడైన ఋషికాగలిగాడు. పశ్చాత్తాపము, తాపమూ, (ప్రార్థన) ఆయన్ను చక్కబరచింది.

భ: ఎన్నో సంవత్సరాలు మీరు చేసిన తపస్సంతటితో మీకు ఏమి ఆబి రబెంిడి?

మ: నేను పొందవలసిన దానిని పొంది ఉన్నాను. చూడవలసిన దానిని చూస్తున్నాను.

భ: దానిని అందరూ చూడగలరా?

మ: కేవలమూ అందరూ చూసే దానినే నేను చూస్తున్నాను. అది అందరిలోనూ ఉన్నదే.

భ: దానిని చూసే విధానమిదేనా?

మ: విధానమేదైనా కావచ్చు. యాత్రికులు ఎన్ని దిశలనుండి వచ్చి చేరినా, కాబానొక మార్గంలోనే కదా ప్రవేశించేది. అందరు గుమికూడినదీ ఆ కాబా ప్రవేశము కొరకే కదా?

భ: మోక్షానికి, మీరెరిగిన రెండు ఉపదేశాలను నాకు దయతో చెప్పండి.

మ: నాకు తెలిసిన ఉపదేశమేముంది? అంతా ఉపదేశమే. దేముని ఆరాధించడమే ఏకైక ఉపదేశం.

## భాషణములు 60

# మౌనము

శ్రీ భగవాన్: ఏకాంతములో మౌనము బలవంతంగా ఉంటుంది. సంఘంలో మితభాషణము మౌనంతో సమానము. ఎందుకంటే అప్పుడు వాక్కును అదుపుచేస్తాడు కాబట్టి. మాట్లాడడానికి ముందు మాట్లాడేవాడు ఉండాలి. వేరే విషయాలలో నిమగ్నుడైతే కూడా మాటలు తగ్గుతాయి. అంతర్ముఖమైన మనస్సు వేరే విధంగా లగ్నమై మాట్లాడడానికి ఆత్రుత ఉండదు.

మాట్లాడడానికి సంబంధించిన ఆలోచనలు మొదలైనవి అదుపులో ఉంచడానికి మౌనం ఒక నియమంగా ఉపయోగపడుతుంది. వేరే విధంగా మనోనిగ్రహం చేయగలిగితే మౌనం నియమంగా అవసరం లేదు. ఎందుకంటే అప్పుడు మౌనం సహజంగా ఉంటుంది కాబట్టి.

పన్నెండేండ్లు విధిగా మౌనం పాటిస్తే, ఆ మౌనం పరమ మౌనం అన్నారు విద్యారణ్యులు. అంటే అసలు మాట్లాడసే లేడన్న మాట. మూగజంతువులాగ అవుతాడు. అది మౌనం కాదు.

మౌనం నిరంతర భాషణము. నిష్క్రియత్వము నిరంతర క్రియ.

## భాషణములు 61

ఏకనాథరావు: ధ్యానాభ్యాసమెట్లా చేయాలి? కండ్లు మూసికొనా, లేదా తెరిచికూడానా?

మ: ఏవిధంగా అయినా చెయ్యవచ్చు. అసలు విషయం మనస్సు అంతర్ముఖమై ధ్యానపరం కావడం. కండ్లుమూసినా, అణగి వున్న ఆలోచనలు కొన్ని సందర్భాలలో రెట్టించిన బలంతో పొంగిపొరలడం చూస్తాం. కండ్లు తెరచి మనస్సు అంతర్ముఖం చేయడం కొంత కష్టమే. దానికి మనోబలం ఎక్కువ కావాలి. విషయాలలో తగలిన మనస్సు కలుషితమవుతుంది. అలా కాకుండా ఉంటే అది నిర్మలంగా ఉంటుంది. బయట విషయాల ప్రభావం పడకుండా, వేరే ఆలోచనలు మాని మనస్సును స్వీయాన్వేషణలో ఏకాగ్రపరచడమే ధ్యానముయందు ప్రధానాంశము.

## భాషణములు 62

ఏకనాథరావు: స్ఫురణ (వర్ణనాతీతమయిననూ స్పష్టమైన అనుభవం, హృదయ కేంద్రమందు) అంటే ఏమిటి?

మ: భయము, ఉద్రేకము లాంటి పలు సందర్భాలలో స్ఫురణ తెలుస్తూ ఉంటుంది. అది ఎప్పుడూ ఎల్లెడలా ఉన్నా, ఒక్కొక్క స్థానంలో ప్రత్యేక సందర్భాలలో అది అనుభవంలోకి వస్తుంది. దానిని పూర్వపు కారణాలతో ముడిపెట్టి, అది శారీరకం అని భ్రమించడం కూడా ఉంది. నిజానికి అది ఏకమూ, శుద్ధమూ. అదే ఆత్మ. మనస్సు స్ఫురణయందులగ్నమై, అది నిరంతరం, అప్రయత్నంగా తెలియవస్తూఉంటే, అదే ఆత్మానుభూతి.

స్ఫురణ ఆత్మానుభూతిని ముందుగా సూచిస్తుంది కూడా. అది కేవలము, ఏకైకము. కర్త, కర్మ దానినుండే బయలుదేరుతాయి. తాను కర్త అని భ్రమించేవానికి కర్మలు (విషయాలు) తనకంటే వేరయినవని ఖచ్చితంగా అనిపిస్తుంది. అవి అప్పుడప్పుడు, ప్రపంచమును కర్తయొక్క ఆ ప్రపంచానుభవాన్ని కల్పిస్తూ, ఉపసంహరిస్తూ ముందుకు వస్తాయి. దీనికి భిన్నంగా వ్యక్తి తనను సినిమా తెరగానూ, ఆ తెరమీద కనిపిస్తున్న కర్త విషయాలను దృశ్యాలుగానూ అనుకొంటే ఎటువంటి కలవరము ఉండజాలదు. ఇంక ఆ వ్యక్తి, ఆత్మకు ఎటువంటి ఆందోళనము లేకుండా, ఆ విషయాలు పుట్టడము - మాయ మవడములను సాక్షిగా గమనిస్తూ ఉండగలడు.

## భాషణములు 63

ఒక ఉన్నతోద్యోగి ఇలా అడిగారు: "తన క్రింద ఉద్యోగులకు ప్రమోషన్ ఇచ్చి తనపైనే అధికారిగా చేసినపుడు మనస్సు చాలా కలత చెందుతుంది. అటువంటి పరిస్థితులలో మనస్సుకు ఊరట కల్గించేందుకు "నేను ఎవరు?" విచారణ సహాయపడుతుందా?

మ: తప్పక సాయపడుతుంది. "నేను ఎవరు?" విచారణ మనస్సును అంతర్ముఖం చేసి శాంతపరుస్తుంది.

భ: నాకు మూర్తి ధ్యానము (భగవంతుని రూపధ్యానము) నందు నమ్మకం. అది జ్ఞాన ప్రాప్తికి సాయపడుతుందా?

మ: తప్పక సాయపడుతుంది. ఉపాసన మనస్సు యొక్క ఏకాగ్రతకు సాయపడుతుంది. అప్పుడు ఇతర చింతలన్నీ పోయి మనస్సు ధ్యేయమూర్తి (ధ్యానించుబడు రూపం)తో నిండి ఉంటుంది. మనస్సు ఆ రూపమే అవుతుంది. ఆ విధంగా అది పరిశుద్ధమవుతుంది. అప్పుడు ధ్యానించేదెవరో విచారించాలి. దానికి సమాధానం “నేను”, అంటే ఆత్మ. ఆ విధంగా చివరికి ఆత్మ లభిస్తుంది. చిక్కేమిటంటే, మనుష్యుడు తాను కర్తననుకుంటాడు. కాని అది తప్పు. అన్నీ చేసేది ఆ దివ్యమైన పరమశక్తియే. మనిషి కేవలం పనిముట్టు మాత్రమే (ఉపకరణం). అది గ్రహించి, ఆ పాత్రతో సమాధానపడితే అన్ని బాధలూ వదులుతాయి. లేకపోతే ఆ బాధలు తానే కోరి తెచ్చుకుంటాడు. ఉదాహరణకు చూడు. దేవాలయ గోపురంలో ఒక శిల్పం ఉంది. ఆ శిఖరం బరువంతా అదే మోస్తున్నట్లుగా ఉంటుంది. దాని అంగ విన్యాసం, చూపు గోపుర భారాన్నంతా మోస్తున్నట్లు చాలా శ్రమపడుతున్నట్లు కనబడుతున్నట్లు కనబడుతుంది. కాని కొంచెం ఆలోచించు. గోపురం నేలమీద నిర్మించారు. అది నిలిచి ఉన్నది దాని పునాదిపైన. భూమిని మోస్తున్న పటాల పుస్తకం (అట్లాస్) లాంటిది. ఆ శిల్పం గోపురం యొక్క ఒక భాగం. కానీ అది గోపురాన్ని మోసే దానిలా కనిపించేటట్లు చెక్కారు. ఇది చిత్రంగా లేదూ? తాను కర్తను అనుకొనేవాడు, ఆ గోపురం శిల్పం వంటివాడు.

తర్వాత ఆ దర్శనార్థి ప్రయోజనార్థం ఒక భక్తుడు "ఉళ్ళదు నార్పదు" మలయాళానువాదం చదివి వినిపించాడు. అది విని అతడు ఇలా అడిగాడు: "ఆచారణలో ద్వైతం, అంతంలో అద్వైత మన్నారే? అదేమిటి?"

మ: సాధన ద్వైత భావంతోనే ఆరంభించాలని కొందరి అభిప్రాయం. నేనన్నది వారికి సంబంధించినదే. దైవమున్నాడనీ, మనుష్యుడు ఆ దైవాన్ని పూజించి ధ్యానించాలని, చివరకు జీవుడు దేమునితో లీనమవుతాడని వారంటారు. మరికొందరి అభిప్రాయంలో జీవుడూ, పరమాత్మ ఎప్పుడూ భిన్నాలే. వారు ఒకరితో ఒకరు కలవడానికి వీలేలేదు. ఫలితం ఏమిటన్న

తర్కం మనకిప్పుడు అక్కర లేదు. జీవుడున్నాడని అందరూ అంగీకరిస్తారు. మొదట ఆ జీవుడు (ఆత్మ)ఎవరో కనిపెట్టనీ. ఆత్మ పరమాత్మలో లీనమవుతుందా, పరమాత్మలో భాగనూ లేదా పరమాత్మకంటే వేరుగా ఉంటుందా అని కనిపెట్టడానికి చాలా సమయముంటుంది. ముందేదాని గురించి ఎందుకు అనుకోవడం. మనస్సును ఉదాసీనంగా ఉంచి లోపలికి పోయి ఆత్మను కనుక్కో సత్యము స్వయంగా నీకు గోచరిస్తుంది. అంతిమ స్థితి అద్వైతమో, విశిష్టాద్వైతమో, ద్వైతమో మనం ముందుగా నిర్ణయించడం ఎందుకు? అలా చేయడం వృధా. ఆ నిర్ణయం ప్రస్తుతం చేస్తే అది తర్కంతోనో, బుద్ధితోనో చేయబడేదే. బుద్ధి, ఆత్మ (పరమశక్తి) నుండి ప్రకాశం పొందుతుంది. పరావృత్తమూ (ప్రతిబింబితము), పాక్షికమూ అయిన బుద్ధి, ఏమని అఖండమూ, అపూర్వమూ అయిన జ్యోతిని ఊహించగలదు? బుద్ధి ఆత్మను చేరలేదు. అది ఆత్మ స్వభావమును ఎలా నిశ్చయించగలదు? నేనన్న దానికి అర్థం ఇదే.

భ: ప్రాథమిక దశలలో అత్యంత శ్రద్ధగా అధ్యయనం చేసిన శాస్త్రాలు చివరకు నిష్ప్రయోజనాలని శ్లోకం. అది ఏ దశలో?

మ: వాని సారం అనుభవంలోకి వచ్చిన తర్వాత. శాస్త్రముల పని, ఆ పరమశక్తి ఉనికినీ, దాన్ని పొందే మార్గాన్ని తెలియచెప్పడం మాత్రమే. వాని సారము అంత మాత్రమే. ఆ సారము జీర్ణించినచో మిగిలినవి వ్యర్థం. కాని అవి సాధకుని పరిణతికి అనుకూలంగా విస్తృతములైనవి. వ్యక్తి ఆధ్యాత్మిక మార్గంలో పైకి పోయే కొలది తాను దాటిన దశలు పరమస్థితికి మెట్లని తెలిసికుంటాడు. ఆవిధంగా, లక్ష్యాన్ని చేరే వరకు, ఎక్కిన మెట్లు క్రమంగా (పూర్వపక్షాలు) గమ్యం చేరినపుడు అది మాత్రం మిగులుతుంది. మిగిలినదంతా నిష్ప్రయోజనం అవుతుంది. ఆ విధంగా శాస్త్రాలు నిష్ప్రయోజనాలు. మనం ఎంతో చదువుతాం. అదంతా మనకు గుర్తుంటుందా? అలా అని వాటి సారంశము మర్చిపోయేమా? లేదు కదా. వాటిలో ముఖ్యమైన విషయాలు, సారంశము మాత్రం మనస్సులోకి బాగా ఇంకి, మిగిలినదంతా మర్చిపోతాము. శాస్త్రాల విషయానికి వస్తే కూడా అంతే.

నిజమేమిటంటే మనిషి తనను తాను పరిమితుడుగా భావిస్తాడు. వచ్చిన కష్టమంతా దానితోనే. ఆ భావనే సరికాదు. ఈ విషయాన్ని ఆ వ్యక్తి స్వయంగానే తెలుసుకోవచ్చు. నిద్రలో ప్రపంచం లేదు. పరిమితమగు అహంకారము లేదు. ఏ కష్టం కూడా లేదు. ఆ ఆనందమైన స్థితి నుండి ఏదో లేచి "నేను" అంటుంది. ఆ అహంకారానికి ప్రపంచం కనబడుతుంది. ఈ ప్రపంచంలో ఈ అహంకారం ఒక చిన్న అణు మాత్రం, దాని వలన ఇంకా కావాలని కోరిక. దానితో బాధలు మొదలు.

ఈ అహంకారం లేవక ముందు అతడు ఎంత ఆనందంగా ఉన్నాడో గదా! ఈ అహంకారం యొక్క ఆవిర్భావమే ప్రస్తుత కష్టాలకు కారణం. అహంకార మూలాన్ని అన్వేషిస్తే, భేదరహితమైన అనంత స్థితిని చేరుతాడు. అది నిద్ర కాని నిద్రా స్థితి. (జాగ్రత్ సుషుప్తి). ఆత్మ ఎప్పుడూ ఒక్కలాగే ఉంది. ఇప్పుడు ఇక్కడ కూడా అలాగే వుంది. ఇంతకంటే పొందవలసింది ఏదీలేదు. ఎందుకంటే హద్దులు (పరిమితులు) తప్పుగా ఊహించబడ్డవి. వాటిని దాటవలసిన అవసరముంది. ఇది ఎలా ఉందంటే, పదిమంది మూఢులు ఏరుదాటి అవతలి ఒడ్డుకు చేరారు. అందరూ చేరారో లేదో అని వారిలో ఒకడు లెక్కపెడితే లెక్కకు తొమ్మిదిమందే వచ్చారు. ఆందోళనతో, ఆ కనబడని పదవ వానికై శోకాలాపాలు సాగాయి. దారినపోయేవాడు ఒకడు, వారి దుఃఖకారణం అడిగి తెలిసికొని, వారిని లెక్కించి పదిమంది ఉన్నట్లు గ్రహించి వారి అజ్ఞానాన్ని గుర్తించాడు. వారిలో ప్రతివ్యక్తి తనను మాత్రం విడిచి ఇతరులను లెక్కించారు. ఆ బాటసారి ప్రతివ్యక్తి మీద క్రమంగా ఒక దెబ్బ వేస్తూ, దెబ్బలను లెక్కించమన్నాడు. వారు పదిమందిని లెక్కించి తృప్తిపడ్డారు. సారాంశమేమిటంటే వారిలో ఆ పదోవాడు క్రొత్తగా వచ్చిన వాడు కాదు. అంతసేపూ వాడక్కడే ఉన్నాడు. వారి ఆ దుఃఖానికి కారణం వారి అజ్ఞానమే. అజ్ఞానంతోపాటు దాని ఫలితమైన దుఃఖం కూడా పోయింది.

ఇలాంటిదే ఇంకొక కథ ఉంది. ఒక స్త్రీ తన మెడలో హారం వేసుకొని దానిని మరచిపోయింది. ఎంతో వెదకింది. నలుగుర్నీ అడిగి చూసింది. లాభం లేకపోయింది. చివరికి ఆమె స్నేహితురాలు ఒకరు ఆమె దేనికోసం వెదుకుతోందో తెలిసికొని, ఆ హారం ఆమె మెడలోనే ఉందని గుర్తించి, అదే ఆమెకు చూపించింది. ఆ విషయం చెప్పగానే దాన్ని చేతితో తాకి, గుర్తించి ఆనందించింది. ఆమె కొత్తగా హారాన్ని పొందిందా? ఇక్కడ కూడా అజ్ఞానం వలన దుఃఖం, జ్ఞానం వలన ఆనందం కల్గినట్లు తెలుస్తుంది.

వ్యక్తి వాని ఆత్మ విషయంలో కూడా అదే విధంగా తెలుసుకోవాలి. క్రొత్తగా పొందేది ఏమీ లేదు. ఆత్మ విషయంలో అజ్ఞానమే ప్రస్తుత దుఃఖానికి కారణం. ఆత్మజ్ఞానం, ఈ అజ్ఞానాన్ని నిర్మూలించి, ఆనందాన్ని కల్గిస్తుంది.

అంతేకాకుండా క్రొత్తగా ఏదైనా వస్తువును పొందవలసి ఉంటే దాని అర్థం అంతకుముందు అది లేదని. ఒకప్పుడు లేకుండా ఇప్పుడు ఉంటే మళ్ళీ అది మాయమవచ్చు. కాబట్టి అటువంటి ముక్తి (స్వేచ్ఛ) శాశ్వతంగా ఉండదు. ఆత్మ ఇక్కడ, ఇప్పుడు, శాశ్వతంగా ఉంది కాబట్టి ముక్తి కూడా శాశ్వతము. ఈ విధంగా మనిషి ప్రయత్నాలు అజ్ఞాన నివృత్తి కొరకు ఉద్దేశించబడ్డవే. జ్ఞానం సహజము, నిత్య సిద్ధమైనను కొత్తగా వచ్చినట్లు కనబడుతుంది.

ఆ దర్శనార్థి సెలవు తీసుకొని వెళ్ళబోతూ సద్గురువుకు నమస్కరించి ఇలా అన్నాడు. "పులినోటబడిన పశువు శాశ్వతంగా నశిస్తుందని అంటారు." ఈ ఉదాహరణ "నేనెవరు?" పుస్తకంలోని ఒక వాక్యం. పులివాత బడ్డ మేక ఎలా అయితే తప్పించుకోలేదో అలాగే ఒక గురువు యొక్క అనుగ్రహ దృష్టికి పాత్రుడైన శిష్యుడు ఎన్నటికి ఈ ప్రాపంచిక విషయములందు తగులుకోలేడని చెప్పబడింది.

## భాషణములు 64

ఒక వ్యక్తి మరణవార్త భగవాన్ను చేరింది.

మ: మంచిదే. నిజానికి చనిపోయిన వాళ్ళు సుఖపడ్డారు. వారు బాధాకరమైన కలుపును (దేహాన్ని) వదలించుకున్నారు. మరణించిన వాడు దుఃఖించడు. బ్రతికి ఉన్నవాళ్ళు పోయిన వాళ్ళ కోసం దుఃఖిస్తారు. మానవులు నిద్రకు భయపడతారా? దానికి భిన్నంగా నిద్రను కోరుకుంటారు. మేల్కొన్న తరువాత ప్రతివ్యక్తి తాను హాయిగా నిద్రపోయాను అని చెప్తాడు. వ్యక్తి గాఢంగా నిద్రపోవడానికని ప్రక్కను సిద్ధం చేసుకొంటాడు. నిద్ర తాత్కాలిక మరణం. మరణం దీర్ఘ నిద్ర. బ్రతికి ఉండగానే మనిషి మరణిస్తే అతడు ఇతరుల మరణానికి శోకించ నక్కరలేదు. దేహం ఉన్నా లేకపోయినా, జాగ్రత్, స్వప్న, సుషువులలో వలె, వ్యక్తియొక్క అస్తిత్వము స్పష్టమే. అలాంటప్పుడు శరీరబంధాలలో కొనసాగాలని వ్యక్తి ఎందుకు కోరుకోవాలి? మనిషి, అమరమైన తన ఆత్మను కనుక్కొని, చనిపోయి, అమరుడుగా ఆనందుడుగా ఉండుగాక!

## భాషణములు 65

ఒక దర్శనార్థి: ఆత్మానుభూతి తర్వాత కూడా ప్రపంచం కనిపిస్తుందా?

మ: ఈ ప్రశ్న ఎవరినుండి వచ్చింది? జ్ఞానినుండా, అజ్ఞానినుండా?

భ: అజ్ఞానినుండి.

మ: ఎవరికి ఈ ప్రశ్న వచ్చిందో తెలిసికో. సందేహించే వాడిని తెలిసికొన్న తర్వాత ఈ ప్రశ్న తిరిగి వస్తే దానికి సమాధానం చెప్పవచ్చు. జగత్తుగాని, శరీరంగాని తానున్నానని చెప్పగలదా? విషయాలను చూసేదానికి, చూసేవాడు ఒకడు ఉండాలి. ఆ చూసేవాడెవడో చూడు. ముందెప్పుడో ఏముంటుందో ఏముండదో అనే బెంగ ఇప్పుడు ఎందుకు?

శ్రీ భగవాన్ ఇలా కొనసాగించారు. ఈ జగత్తు కనిపించినా, కనిపించక పోయినా దాని వలన కలిగేది ఏమిటి? ఇప్పుడు దాన్ని చూస్తున్నావు కదా! దాని వలన నీకేమైనా నష్టమా? నిద్రలో అది కనిపించకపోతే లాభమా? ప్రపంచం కనిపించినా, కనిపించకపోయినా అది ప్రధానం కాదు.

జ్ఞాని అందరిలాగే వర్తిల్లడం చూసి, అజ్ఞాని సందిగ్ధంలో పడతాడు. ఇద్దరూ ఆ ప్రపంచాన్ని చూస్తూనే ఉన్నారు. కాని వారి దృష్టి వేరు. ఉదాహరణకు సినిమా తీసుకో. తెరమీద బొమ్మలు కదుల్తున్నాయి. పోయి వానిని పట్టుకో. చేతికి చిక్కేది తెరే

కదా! బొమ్మలు పోయేక మిగిలేది ఏది, తెరే కదా! అలాగే ఇక్కడ కూడా. ప్రపంచం కనిపిస్తే, ఆ కనిపించేదెవరికో చూడు. “నేను” యొక్క ఆధారాన్ని పట్టుకో. ఆ ఆధారం పట్టుకొన్నాక ప్రపంచం కనిపించినా కనిపించక పోయినా ఒక్కటే.

అజ్ఞాని ప్రపంచం సత్యం అనుకుంటాడు. కాని జ్ఞాని దానిని ఆత్మ స్వరూపంగా మాత్రమే చూస్తాడు. ఆత్మ ప్రపంచరూపంలో వ్యక్తమైనా కాకున్నా జ్ఞానికి అది ప్రధానం కాదు.

## భాషణములు 66

స్మృతి, నిద్ర, మృతి - వీనికి సంబంధించిన పాండిత్యముతో కూడిన ప్రశ్నలు గల ఒక ఉత్తరం వచ్చింది. మొదటి చూపులో అవి సక్రమంగానే ఉన్నట్లున్నవి గాని, జవాబు ఇవ్వడానికి దుస్సాధ్యాలుగా ఉన్నట్లు కనిపించే ప్రశ్నలు అవి. కాని ఆ విషయంలో భగవాన్ను సమీపించగా, వారు ఆ ముడులన్నీ అతి సులువుగా విడమరచి ఈ గొడవంతా సత్యమైన "నేను"ను అసత్యమైన “నేను” నుండి వేరు పరచక పోవడం వలన కలిగిందని చెప్పారు. గుణములు, వృత్తులూ ఈ మిథ్యా నేనుకు చెందుతాయి. కాని సత్యమైన “నేను” ఆత్మకు సంబంధించినవి కావు. వ్యక్తి యొక్క ప్రయత్నములు అతని అజ్ఞానమును తొలగించడానికే. ఆ తర్వాత ఆ ప్రయత్నాలు ఆగిపోయి సత్యమైన ఆత్మ ఎల్లప్పుడూ ఉన్నట్లు తెలుస్తుంది. ఆత్మగా ఉండడానికి (ఆత్మస్థితికి) ప్రత్యేక ప్రయత్నము అక్కరలేదు.

## భాషణములు 67

దక్షిణ భారత రైల్వేలో ఉద్యోగి శ్రీ కె.ఎస్.న్. అయ్యర్ అను ఒక దర్శనార్థి ఇలా చెప్పారు.

"నా ధ్యానంలో మధ్య కొంచెం విరామం కనిపిస్తోంది. 'నేను ఎవరు'? అని ప్రశ్నించుకొన్నప్పుడు నా బుద్ధి పని చేసే విధానం ఇలా ఉంది:

ఇది నా చేయి, దాన్ని చూస్తున్నదెవరు? నా కన్ను కంటిని చూడడం ఎలా? అద్దంలో. ఆ రీతిగా నన్ను చూసుకోవడానికి అద్దం కావాలి. నాలో ఆ అద్దం స్థానే నిలిచేదేమి?" - ఇదీ నా ప్రశ్న.

మ: అలా అయితే 'నేనెవరు' విచారణ ఎందుకు? నీకు కష్టం కల్గుతోందని ఎందుకు అంటున్నావు? నీవు ప్రశాంతంగా ఉండగలిగేవు కదా. నీ ప్రశాంత స్థితి నుండి ఎందుకు నీవు బయటకు వస్తున్నావు.

భ: ఆ విధంగా విచారణ చేయడం నా మనస్సును ఏకాగ్రం చేయడానికి సాయపడుతుంది. చింతన వలన అదొక్కటే లాభమా?

మ: ఇంకా ఏం కావాలి? చిత్తైకాగ్రత చాలా ముఖ్యం. నీ ప్రశాంత స్థితి నుండి బయటకు వచ్చేటట్లు చేసేది ఏమిటి?

భ: నన్ను ఏదో బయటికి లాగుతోంది కాబట్టి.

మ: "నేను ఎవరు?" అనే విచారణ అంటే "నేను" యొక్క మూలాన్ని కనిపెట్టడమే. దాన్ని కనిపెట్టినపుడు నీవు అన్వేషించేది సిద్ధించినట్లే.

(వ్యక్తి ఏకముఖంగా అంటే ఏక భావనతో సాధన చేస్తూ, కలవరపడి, ఓడిపోయే మనస్తత్వమును విడిచి, సాధనను మధ్యలో విడనాడరాదని శ్రీ భగవాన్ మాటల సారాంశము అనిపించింది)

# భాషణములు 68

డా. రాధాకమల్ ముఖర్జీ సుప్రసిద్ధ ప్రొఫెసర్, ప్రశాంత దృష్టి గల చక్కని మధ్య వయస్కుడు. ఆయన యోగము లేక ధ్యానమును అభ్యసించి కొన్ని అతీతమైన అనుభవాలను పొంది వాటి రహస్యాన్ని విడమరచి చెప్పవలెనని భగవాన్ని కోరాడు. ఆయన ఒక గ్రంథాన్ని కూడా వ్రాసి వున్నాడు. దానిని లండన్లోని లాంగ్మన్ గ్రీన్ కంపెనీవారు ప్రచురించారు. అత్మానుభవాన్ని పొందడం కష్టమని భావించి ఆయన భగవాన్ సాయాన్ని కోరాడు. ఆయన ప్రశ్న ఇది: ఉపనిషత్తులు తెలిపిన ధ్యాన పద్ధతి ఇప్పుడు కనుమరుగయింది. బెంగాల్లోని ఒక యోగివర్యులు నాకు దానిని నేర్పారు. చాలా సంవత్సరాలు శ్రమించి అభ్యసించగా నాకు కొన్ని అనుభవాలు కల్గుతున్నాయి. భూమ (శుద్ధచైతన్యం) అనంతమని, నేను పరిమితిగల చైతన్యుడనని కొన్ని సమయాలలో నాకు అనిపిస్తోంది. అది సరియేనా?

మ: ఉన్నది భూమ (సంపూర్ణము) ఒక్కటే. అది అనంతం (దానికి అవధులు లేవు) దానినుండి పరిమిత చైతన్యము ఒక ఉపాధి (పరిమిత దేహాన్ని) గ్రహించి పుట్టినట్లు కనిపిస్తుంది. ఇది ఆభాస లేదా ప్రతిబింబము. ఈ వ్యక్తిగత చైతన్యాన్ని పూర్ణ చైతన్యంతో కలుపు. చేయవలసింది అదే.

భ: భూమ, పరమ చైతన్యానికి ఒక గుణం కదా?

మ: భూమ పరాత్పరము. యత్ర నాన్యత్ పశ్యతి. యత్ర నాన్యత్ శృణోతి స భూమా (ఎక్కడ అన్యము చూడమో, ఎక్కడ వేరేదీ వినమో అది భూమా, సంపూర్ణము కేవలము) అది అనిర్వచనీయము. వర్ణింపలేనిది. నిర్వికారము.

భ: అక్కడ విస్తారము - అపరిమితత్వము - అనుభూతమైనది. బహుశః అది భూమకు కొంచెం క్రిందిగా, దానికి దగ్గరిదా? నా ఊహ సరియేనా?

మ: ఉన్నది భూమ ఒక్కటే. దానికి అన్యమైనది ఏదీ లేదు. దీనినంతటినీ చెప్పేది మనస్సే.

భ: ఈ మనస్సును దాటి ఈ విస్తారాన్ని నేను అనుభవిస్తున్నాను.

మ: అవును అవును.

ఆ ప్రొఫెసర్ తన వెనుక కొద్ది దూరంలో కూర్చున్న ఆమెకిదంతా హిందీలో తెలియచేసాడు.

ఆమె: విక్షేపానికి, ధ్యానానికి గల భేదమేమి?

మ: భేదం లేదు. ఆలోచనలు ఉన్నప్పుడు అది విక్షేపం. ఆలోచనలు లేనప్పుడు అది ధ్యానం. ఇంతకూ ధ్యానం కూడా అభ్యాసమే. అది వాస్తవమైన పూర్ణశాంత స్థితి కాదు.

ఆ: ధ్యానాన్ని అభ్యసించేదెలా?

మ: ఆలోచనలను దూరంగా ఉంచు.

ఆ: వ్యవహారానికి ధ్యానానికి సమన్వయం ఎలా?

మ: కర్మలను చేసేవాడు ఎవరు? కర్మచేసే వాడు ఈ ప్రశ్న అడగాలి. నీవెప్పుడూ ఆత్మవే. మనస్సు కాదు. ఈ ప్రశ్నలను గుప్పించేదంతా మనస్సే. ఎప్పుడే పని జరిగినా అది ఆత్మ సమక్షంలోనే జరుగుతుంది. ఆత్మానుభూతికి పని అడ్డురాదు.

కర్త స్వరూపాన్ని సరిగా గ్రహించనందువల్లనే, కలతకు కారణం. స్వరూపం గురించిన ఈ మిథ్యా తాదాత్మ్యము వదిలించుకో.

ప్రొఫెసర్: చైతన్య - అభావ స్థితి, అనంత చైతన్యానికి సన్నిహితం కాదా?

మహర్షి: చైతన్యము ఒక్కటే ఉన్నది. వేరేదీ లేదు.

భక్తుడు: శ్రీభగవాన్ మౌనమే ఒక అపార శక్తి. అది మాకెంతో శాంతిని చేకూరుస్తోంది.

మ: మౌనము నిరంతర సంభాషణము, కంఠములోనుండి వచ్చే భాషణము మౌన భాషణకు అడ్డు వస్తుంది. మౌనములో ఉన్నవాడు తన పరిసరాలకు అత్యంత దగ్గరగా ఉంటాడు. శ్రీదక్షిణామూర్తి మౌనము నలుగురు ఋషుల సందేహాలను తొలగించింది.

("మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వం" అంటే మౌనములో ప్రకటించబడిన సత్యం) మౌనము వ్యాఖ్యానము అన్నారు. మౌనశక్తి అంతటిది.

కంఠములోనుండి వచ్చు భాషణమునకు వాక్కుకు సంబంధించిన అవయవములు అవసరం, కాని మౌన భాషణము ఆలోచనలకు అతీతమైనది. సంగ్రహంగా చెప్పాలంటే అది వాగతీతము, పలుకని పదము. పరావాక్కు

భ: ఆత్మానుభవంలో ప్రజ్ఞ ఉంటుందా?

మః ప్రజ్ఞ లేకుండుటయే నిద్ర. ఆత్మానుభవంలో ప్రజ్ఞ ఉంది. కాని ఈ జ్ఞానము (లేదా ప్రజ్ఞ) కర్త- కర్మ సంబంధమైన జ్ఞానము కాదు. అది పూర్ణ

బోధము. ప్రజ్ఞా పదానికి రెండు అర్థాలు ఉన్నాయి. 1. వాచ్యార్థము: వృత్తి = శబ్దార్థము = ఉన్నదున్నట్లు అర్థం.

2. లక్ష్యార్థము = జ్ఞానము = ఆత్మ = స్వరూపము = గౌణమైన అర్థం.

భ: వృత్తి నుండి గదా ఎవరైనా జ్ఞానాన్ని గుర్తించేది.

మ: అవును నిజమే.కాని వ్యక్తి వృత్తిని జ్ఞానమని భ్రమపడతాడు. వృత్తి మనస్సు యొక్క రీతి. నీవు మనస్సువు కావు. నీవు దానికి అతీతుడవు.

ఆమె: ఒక్కొక్క మాటు బ్రహ్మాకారవృత్తిలో ఉండిపోవాలనే కోరిక అతి తీవ్రంగా కల్గుతుంది.

మ: అది చాల మంచిదే. అది సహజమయ్యే వరకు దానిని అభ్యసించాలి. అప్పుడది స్వరూపంగా, స్వాత్మగా పరాకాష్టను అందుకొంటుంది.

ఆ తర్వాత శ్రీ భగవాన్ ఇంకా ఇలా వివరించారు. వృత్తిని జ్ఞానమని తరచుగా భ్రమపడతారు. వృత్తి ఒక వ్యావహారిక విషయము. అది ఆభాస స్థితి (ప్రతిబింబిత చైతన్యస్థితి)లో పని చేస్తుంది. చైతన్యము, వ్యావహారిక జ్ఞాన అజ్ఞానములకు అతీతమైనది. అది వృత్తిరూపంలో ఉండదు. అందులో కర్త, కర్మ ఉండవు.

వృత్తి రాజసిక మనస్సుకు సంబంధించినది. సాత్త్విక మనస్సు వృత్తి రహితమైనది. సాత్వికము రాజసికమునకు సాక్షి. సాత్త్వికము నిజానికి శుద్ధ చైతన్యమే. అయినా దానిని సాత్త్విక మనస్సే అంటారు. ఎందుకంటే తాను సాక్షినన్న భావన

ఆభాస (ప్రతిబింబిత చైతన్యము) యొక్క వ్యాపారమే. మనస్సే ఆభాస. అట్టి జ్ఞానము మనస్సును తెలియజేస్తుంది. కాని మనస్సు తనకు తానై క్రియా సమర్థం కాదు. అందువలన దానిని సాత్త్విక మనస్సు అన్నారు.

జీవన్ముక్తుని స్థితి అటువంటిది. వానిని నష్ట మానసుడు (చనిపోయిన మనస్సు కలవాడు) అని కూడా వర్ణించారు. జీవన్ముక్తునికి మనస్సంటూ ఒకటి ఉండడం, అది నష్టం కావడం, విరుద్ధంగా లేదూ? తెలియని వారితో వాదించేటప్పుడు ఈపాటి వైరుద్ధ్యాన్ని అంగీకరించవలసి ఉంటుంది.

జీవన్ముక్తుని మనస్సే బ్రహ్మమన్నారు కొందరు. వానిని బ్రహ్మవిదుడని ఎలాగనడం? బ్రహ్మము ఏమైనా విషయమా, వేద్యమవడానికి? అయితే కూడా జన సామాన్యం మాట్లాడే రీతిలో అలా అనవచ్చు.

సాత్త్విక మనస్సు జీవన్ముక్తుని విషయంలో, ఈశ్వరుని విషయంలో ఊహించబడినది. "అలా కాకపోతే జీవన్ముక్తుడు ఎలా జీవించి పని చేయగలడు?" అని వారు వాదిస్తారు. ఈ వాదనకు సమ్మతిగా సాత్త్విక మనస్సు ఒప్పుకోవలసి ఉంటుంది. నిజానికి సాత్త్విక మనస్సు పరమాత్మయే. చూడబడు విషయము, చూచు సాక్షి చివరకు ఐక్యం కాగా, శుద్ధ చైతన్యం మాత్రమే పరమాత్మగా వెలుగుతుంది. అది శూన్యస్థితిగాని, అజ్ఞానంగానీ కాదు. స్వరూపమే. శుద్ధ చైతన్యం నుండి మనస్సు పడుతుందని కొందరంటారు. దానివెంట జనించేది ఆభాస (ప్రతిబింబము) అని ఆభాస మొదట పుట్టి దాని తర్వాత మనస్సు పుట్టునని మరికొందరంటారు. నిజానికి మనస్సు, ఆభాస ఒకేసారి పుట్టేవే. (ఏక కాలికాలు)

ఆ ప్రొఫెసర్ త్వరలో తాను వేయి మైళ్ళు దూరంగా పోనున్నానని భగవాన్ తన్ననుగ్రహించవలెనని అర్థించాడు. భగవాన్ అన్నారు "దేశ, కాలాలు కేవలం మనోకల్పితాలే. కాని స్వరూపం (నిజమైన ఆత్మ) మనస్సుకూ, దేశ-కాలాలకు అతీతంగా ఉంటుంది. ఆత్మకు దగ్గరా, దూరాలు లేవు."

ఆ ప్రొఫెసర్ వచ్చిన ఆమెకు మహర్షిని వదలి తిరిగి పోవడం మనస్కరించలేదు. స్వామి ఇలా అన్నారు. "నీవు సదా నా సన్నిధిలోనే ఉన్నావనుకో. అది నిన్ను సరిగా ఆలోచించేటట్లు చేస్తుంది." ఆ సాయంకాలం వారిద్దరూ వెళ్ళిపోయారు.

## భాషణములు 69

పై ప్రొఫెసర్, రాధాకమల్ ముఖర్జీ ఇచ్చిన ఉపన్యాస వార్తలు హిందూ పత్రికలో ప్రచురించారు. విషయం 'సంతాన నిరోధావశ్యకత'. మనుజులు తమ బాధ్యతలను గుర్తించుటకూ, సంతాన నిరోధం అయత్న సిద్ధం అయేందుకు, భిన్నభిన్న అభిప్రాయాలను అందులో గుర్తించారు. అది విని భగవాన్ యథాలాపంగా ఇలా అన్నారు. "వారు మరణించే విధానము కూడా కనుగొందురుగాక" (ఇక్కడ మరణం అహంకార నాశనాన్ని సూచిస్తుంది.)

## భాషణములు 70

శ్రీ రాజుశాస్త్రిగారు నాద, బిందు, కళలను గురించి శ్రీభగవాన్ని అడిగారు.

మ: వేదాంత పరిభాషలో వాటిని ప్రాణ, మనో, బుద్ధులు అంటారు. తంత్రశాస్త్ర ప్రకారం నాదం తేజస్సుతో కూడిన సూక్ష్మధ్వని అని చెప్పబడింది. ఈ తేజస్సు శివుని దేహమని చెప్పబడింది. అది వృద్ధిచెంది, శబ్దము (ధ్వని) అణగిపోయి, బిందువుగా మిగులుతుంది. తేజోమయుడుగా ఉండడం లక్షణము. కళ, బిందువులోని భాగం (అంశం)

## భాషణములు 71

తిరువణ్ణామలైలో శ్రీభగవాన్ నివసించిన వేర్వేరు ప్రదేశముల కాలానుసార క్రమము:

1896: తిరువణ్ణామలైకు విచ్చేసి దేవాలయ ప్రాంగణంలో చెట్టు క్రింద, పాతాళ లింగ గుహలో, కొన్ని సమయాలలో గోపురాదులలో నివసించారు.

1897: తొలి దినాలలో గురుమూర్తంలో, ఆలయంలో ఉన్న మామిడి తోపులో ఉన్నారు. (18 నెలలు)

1898: (సెప్టెంబరు) పవళకుండ్రులో ఉన్నారు.

1899: (ఫిబ్రవరి) కొండపై చూతగుహలో, విరూపాక్షగుహలో ఉన్నారు.

1905: తీవ్రమైన ప్లేగు వ్యాధి వ్యాపించిన సమయంలో ఆరునెలలు పచ్చై అమ్మన్ కోవెలలో నివసించారు. మరల కొండమీద ఉన్నారు.

1908: జనవరి నుండి మార్చి వరకు పచ్చై అమ్మన్ కోవెలలో ఉన్నారు. మరల కొండమీద నివాసము.

1916: స్కందాశ్రమ నివాసము.

1922: కొండ దక్షిణపాదంలో ఉన్న రమణాశ్రమ ప్రదేశంలో నివాసము.

## భాషణములు 72

రైల్వే ఉద్యోగి శ్రీ కె.ఎస్.ఎన్. అయ్యర్ జప విషయం ప్రస్తావించారు. మ: వాచికము, దాని స్మృతి, ఆపైన ధ్యానము. ఈ క్రమంలో సాగి చివరకు అప్రయత్నసిద్ధమైన నిరంతర జపం సిద్ధిస్తుంది. ఆ విధంగా జపం చేసేది ఆత్మయే. అన్ని జపాలలోనూ “నేనెవరు?" అన్న జపం అత్యుత్తమం.

## భాషణములు 73

శ్రీ ఏకనాథరావు అను ఇంజనీరు- "సద్గురువునుండి ఎటువంటి ప్రోత్సాహము లేకపోవడమే కాకుండా, ఆయన అనుగ్రహ సైతము లేదన్న నిర్వేదం (నిరాశ) మాట ఏమిటి?" అని అడిగారు.

మ: అది అజ్ఞానమే. నిర్వేదము (నిరాశ) పొందేవాడు ఎవరు అని విచారణ చేయాలి. నిద్ర తర్వాత లేచిన అహంకార పిశాచమే ఇటువంటి ఆలోచనలకు గురి అవుతుంది. గాఢ నిద్రలో వ్యక్తికి ఏ బాధాలేదు. మేల్కొని ఉండగా ఇపుడు బాధపడేవాడు ఎవరు? నిద్రాస్థితి సామాన్య వ్యక్తికి సంబంధించినది. అతడు ఆ బాధపడేవాడిని వెదికి కనుక్కోవాలి.

భ: ధైర్యం చెప్పేవారు లేక ఆ ఉత్సాహం క్షీణించిపోయింది.

మ: వ్యక్తి ధ్యానంలో ఉండగా కొంత శాంతిని అనుభవించడం లేదా? అభివృద్ధికి అది సూచన. సాధన సాగిస్తే ఆ శాంతి గాఢమూ, దీర్ఘమూ అవుతుంది. గమ్యానికి చేరుస్తుంది. భగవద్గీత 14వ అధ్యాయంలోని చివరి శ్లోకాల్లో గుణాతీతుని గురించి చెప్పబడింది.

## భాషణములు 74

మోరిస్ ఫ్రీడ్మన్ అను ఇంజనీరు తన జాబులలో ఒక దానిలో ఇలా వ్రాసాడు. ".....మహర్షిని గూర్చి తలచుకొన్నప్పుడే కాక, ఆయనను తలచుకోనపుడు కూడా నాతోనే వున్నారు. అలా కాకపోతే నేనెలా జీవించగలను?”

## భాషణములు 75

పూర్వం విదేశ దౌత్య కార్యాలయం (ఎంటపి)లో పనిచేసే గ్రాంట్ ఢఫ్ ఇలా రాసాడు: "మహర్షికి నా సగౌరవ ప్రణామాలు. ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చేటప్పుడే కాక, నా తలపులలో సదా వారి సన్నిధియే మెదలుతోంది."

## భాషణములు 76

కె.ఎస్.ఎన్. అయ్యర్: ప్రాపంచిక వ్యవహారాలకు, ఆధ్యాత్మ జీవనానికి సమన్వయం సాధ్యమనే నమ్మకం నాకు కలగడం లేదు.

దానికి సమాధానంగా భగవాన్ యోగవాసిష్టం నుంచి కొన్ని శ్లోకాలు వుదాహరించారు. (యోగవాసిష్ఠం మూల గ్రంథంలో లక్షల శ్లోకాలున్నాయి అందులో ముప్పై రెండు వేల శ్లోకాలు మాత్రం ఇప్పుడున్న సంస్కృత గ్రంథంలో కనబడుతున్నాయి. అది ఆరువేల శ్లోకాలతో 'లఘు యోగవాసిష్ఠంగా ప్రచారంలో వుంది. మరల దీని నుంచి 2050 పద్యాలతో తమిళగ్రంథంగా అనువాదం అయ్యింది).

భ: మనస్సు పెట్టని పని తృప్తికరంగా జరగదు. మరి, మనస్సును తత్త్వ చింతనలో పెట్టి, పనిని కూడా సాగించేదెలా?

మ: మనస్సు ఆత్మ నుండి ఏర్పడిన ప్రతిబింబము మాత్రమే. అది మెలకువగా వున్నపుడు కనిపిస్తుంది. గాఢనిద్రలో నీవు ఎవరి కొడుకువి వంటి విషయాలు చెప్పవు. మేల్కోగానే, నేను ఫలానా వాడివి అని చెప్పి ప్రపంచాన్ని గుర్తిస్తావు. ప్రపంచం లోకమే - "లోక్యతే ఇతి లోక:" అని 'లోక' శబ్ద వ్యుత్పత్తి. అంటే, చూడబడేదే లోకం, ప్రపంచం. దీనిని చూసే కన్ను (దృష్టి) ఏది? అది అప్పుడప్పుడు మునిగి, పైకి వచ్చే అహంకారమే. కాని, నీవు నిరంతరం వున్నావు. కాబట్టి, అహంకారానికి అతీతంగా, సంబంధం లేకుండా వుండేది చైతన్యం - ఆత్మ. గాఢనిద్రలో మనస్సు లీనమవుతుంది గానీ, నశించదు. లీనమయ్యేది మరల వెలికివచ్చి కనిపిస్తుంది. ధ్యానంలో కూడా ఇది జరుగుతుంది. కానీ, నశించిన మనస్సు మరల రూపొందదు. కాబట్టి, యోగికి లక్ష్యం మనోనాశమే గాని, మనోలయం కాదు. ధ్యానం ఇచ్చే ప్రశాంతతలో మనస్సు లయం కావచ్చు. అంతమాత్రం సరిపోదు. దానికి తోడు మరెన్నో అనుష్టిస్తేనే మనోనాశనం అయ్యేది. కొందరు ఏదో ఒక చిన్న ఆలోచనతో సమాధిలోకి పోయి, చాలాకాలం తరువాత ఆ ఆలోచనా వాసనతో మేల్కొంటారు. ఈ మధ్యకాలంలో ప్రపంచంలో ఎన్నో యుగాలు కూడా గడచిపోయి వుండొచ్చు. అలాంటి యోగి మనస్సును ఇంకా నాశనం చేయలేదనే చెప్పాలి. మనస్సును ఆత్మకంటే వేరుగా గుర్తించక పోవడమే మనోనాశనం. ఇప్పుడు, ఈ క్షణంలో కూడా మనస్సు లేదు. దీనిని గుర్తించు. దైనందిన కార్యకలాపాలలో కాకపోతే నీవీ విషయాన్ని ఎలా గుర్తించగలవు? రోజువారి పనులన్నీ అప్రయత్నంగా సాగిపోతాయి. వీటన్నిటినీ పెంచే మనస్సు నిజంకాదనీ, అది కేవలం ఆత్మనుంచి బయలుదేరే పిశాచమనీ తెలుసుకో. మనస్సును నశింపచేసే విధానం ఇదే అని తెలుసుకో.

## భాషణములు 77

బైబిల్ లోని భక్తిగీతం (సామ్) 46 లోనిది: "నిశ్చలంగా వుండు, నేను దైవం అని తెలుసుకో." దీనికోసం బైబిల్ను తిరగవేస్తున్న మహర్షికి క్రైస్తవ ధర్మోపదేశాలలో ఈ వాక్యం కనపడింది: “ఒక్కటి మాత్రమే వుంది, రెండవది లేదు.” “జ్ఞాని హృదయం కుడివైపు ఉంది, అజ్ఞాని హృదయం ఎడమవైపు ఉంది."

## భాషణములు 78

మసుల్లా నుంచి వచ్చిన ఒకరు: " ఆత్మానుభవం పొందుట ఎలా?" అని అడిగారు.

మ: ప్రతివాడు అనుక్షణం ఆత్మానుభూతిని పొందుతూనే ఉన్నాడు.

భ: కానీ, ఆ అనుభవం కోరుకున్న విధంగా లభించడంలేదే!

మ: ఇప్పటి అనుభవం విపరీతం. సత్యమైనది కాదు. లేనిది వున్నదిగా భ్రమించబడుతోంది.

భ: ఆత్మను కనుక్కోవడం ఎలా?

మ: ఆత్మకోసం పరిశోధనలు అక్కర్లేదు. శోధించవలసింది అనాత్మనే. అనాత్మ నిరాకరణ మాత్రమే సాధ్యం. ఆత్మ స్వయంగా సిద్ధమైనది కాబట్టి తనకు తానై వెలుగుతుంది.

ఆత్మకు ఎన్నో పేర్లు: దైవం, కుండలిని, మంత్రం మొదలైనవి. వానిలో ఏది గ్రహించినా ఆత్మ ప్రత్యక్షం అవుతుంది. ఈశ్వరుడు, ఆత్మ ఒక్కటే. కుండలిని పైకి మనస్సుగా కనిపిస్తుంది. మనస్సు మూలంవరకు వెడితే అది కుండలిని. మంత్రజపం ఇతర ఆలోచనలను హరించి మనస్సును మంత్రం పైనే నిలుపుతుంది. చివరకు మంత్రం ఆత్మలో లీనమై, ఆత్మగా ప్రకాశిస్తుంది.

భ: ఆత్మానుభవానికి గురువు అవసరం ఎన్నాళ్ళు?

మ: లఘువు (శిష్యుడు) వున్నంత కాలం గురువు ఆవశ్యకత వుంది. (భగవాన్ తమాషాగా శ్లేష వాడారు. గురువు అనే పదానికి మరో అర్థం పెద్దది, గొప్పది. లఘువు అంటే చిన్నది.) ఈ లఘువుకు కారణం, ఆత్మకు తనకు తానుగా ఆరోపించిన పరిమితియే. అర్చితుడైన భగవంతుడు భక్తికి స్థిరత్వాన్నిస్తాడు. భక్తి శరణాగతికి దారితీస్తుంది. శరణాగతుడైన భక్తుణ్ణి దైవం గురురూపంలో కరుణిస్తాడు. ఆ గురువు, అంటే ఈశ్వరుడు, భక్తుడికి సరియైన దారి చూపిస్తూ 'గురువు ఆత్మగా నీలోనే వున్నాడు' అని బోధిస్తాడు. ఇది మనస్సును క్రమేపీ అంతర్ముఖం చేసి చివరకు ఆత్మానుభవాన్ని కలిగిస్తుంది.

ఆత్మానుభవ స్థితి కలుగనంత వరకు ప్రయత్నం తప్పదు. అప్పుడైనా ఆత్మ స్వయంగానే వ్యక్తం కావలె. లేకపోతే సుఖం సంపూర్ణం కాదు. ఆ సహజమైన స్థితి వచ్చేవరకు ఏదో ఒక రూపంలో ప్రయత్నం కొనసాగి తీరాలి.

భ: వ్యావహారిక జీవితం అలాంటి ప్రయత్నాలకు అనుకూలం కాదు కదా!

మ: నీవు క్రియాశీలుడవని ఎందుకు అనుకుంటున్నావు? నీవు ఇక్కడికి రావడాన్నే ఉదాహరణగా తీసుకో. ఇల్లు వదలి, బండెక్కి, రైలు ప్రయాణాలు చేసి, ఇక్కడ రైలుస్టేషనులో దిగి, మళ్ళీ బండెక్కి ఎలాగో ఆశ్రమం చేరుకున్నావు. ఎవరైనా అడిగితే ఇంతదూరం నీవే ప్రయాణం చేసానంటావు. అది నిజమేనా? నిజానికి నువ్వు ఉన్నట్లే ఉన్నావు. కదిలిందీ, మెదిలిందీ పలురకాల వాహనాలు. వాటి కదలికలన్నీ నీ కదలికలే అన్న భ్రాంతి వంటిదే నీ ఇతర విషయం కూడా. అది చేసింది నీవు కాదు. అవన్నీ ఈశ్వరుని కార్యాలే.

భ: అలా అనుకుంటే మనోశూన్యతకు దారితీసి, బుద్ధి సరిగా పనిచేయక, ఏ పనీ జరగదు.

మ: ఆ శూన్యతవరకూ పోయి తరువాత నాకు చెప్పు.

భ: జ్ఞానుల సందర్శనము ఆత్మానుభవానికి సహాయపడుతుంది అంటాకే.

మ: (కొంచెం విరామం తరువాత) కలిగింప వలసింది ఏది? ఎవరికి? ఆలోచించి పరిశోధించు. ఈ సందేహం ఎవరికి? దాని మూలం వెదికితే సందేహం. మాయమవుతుంది.

## భాషణములు 79

ఒక ఇంజనీరు ఇలా అడిగారు. "పరిసరాలేవైనా, ఎలా మారినా, జంతువులు తమ సహజనియమాలను అనుసరించి ప్రవర్తిస్తున్నట్లు కనిపిస్తుంది. కాని మానవుడు సంఘనియమాలను తిరస్కరించి, ఏ నిర్దిష్టమైన నియమాలకు కట్టుబడడం లేదు. అతడు హీనస్థితికి దిగజారుతున్నట్లు కనబడుతోంది.. జంతువులు మాత్రం స్థిరంగా వున్నాయి. నిజమేనా?

మహర్షి: (చాలాసేపు తరువాత) మనుష్యులు ఆత్మజ్ఞానులు కానిచో, వారు కేవలం పశువులని ఉపనిషత్తులు, శాస్త్రాలు చెప్తున్నాయి. బహుశా వారు. అంతకన్నా హీనులు కావచ్చు.

## భాషణములు 80

నిరాడంబరుడూ, పరమభక్తుడూ అయిన ఒక శిష్యుడు, మూడేండ్ల వయస్సు గల తన ఏకైక పుత్రుణ్ణి కోల్పోయాడు. మరునాడు అతడు తన కుటుంబంతో ఆశ్రమానికి వచ్చాడు. శ్రీభగవాన్ వారిని ఉద్దేశించి ఇలా మాట్లాడారు. "ధైర్యంతో దుఃఖాలను, ఆప్త జననష్టాన్ని భరించడానికి మనోశిక్షణ, అభ్యాసం సాయపడతాయి. అన్ని శోకాల్లోకి పుత్రశోకం చాలా దుర్భరమంటారు. వ్యక్తి తనకు ఒక నిర్దిష్టమైన రూపం వుందని భావించే వరకు దుఃఖం వుంటుంది. రూపభావన దాటిననాడు తాను నిత్యుడని తెలుస్తుంది. పుట్టుకలేదు. గిట్టుట లేదు. పుట్టేది దేహం మాత్రమే. శరీరం అహంకార కల్పనయే. కానీ, అహంకారం శరీరం లేకుండా కనిపించదు. అహంకారం ఎప్పుడూ దేహంతో తాదాత్మ్యం చెంది వుంటుంది. ప్రధానమైనది సంకల్పమే, ఆలోచనే.

వివేకవంతుడైన మనిషి గాఢనిద్రలో తనకు దేహం తెలుస్తుందేమో విమర్శించుకోవాలి. అతడు మెలకువగా వున్నప్పుడు మాత్రం ఈ దేహం గురించి ఎందుకు ఆలోచించాలి? కానీ, నిద్రలో దేహం తెలియకపోయినా, అప్పుడు ఆత్మలేదా? అతడు గాఢనిద్రలో ఎలా వున్నాడు? మేల్కొన్నపుడు ఎలా వున్నాడు? ఈ రెండింటిలో భేదం ఏమిటి? అహంకారం పుట్టడమే మెలకువ అంటే. ఆ సమయంలోనే ఆలోచనలు పుడతాయి. ఆ ఆలోచనలు వున్నది ఎవరికో అతను కనుక్కోవాలి. అవి ఎక్కడనుండి పుడుతున్నాయి? చైతన్యవంతమైన ఆత్మనుంచే ఆవిర్భవించి వుండాలి. ఈవిషయం అస్పష్టంగా అయినాసరే, తెలియగలిగితే అహంకార నాశనానికి కొంత సహకరిస్తుంది. ఏకము, అనంతము అయిన సత్ (ఉనికి) బోధపడే వీలవుతుంది. ఆ అవస్థలో నిత్యమైన స్థితి'యే తప్ప వ్యక్తులెవరూ వుండరు. అక్కడ మరణభావన గాని, శోకం గాని వుండవు.

'జన్మించాను' అనుకొన్నవాడు 'మరణిస్తాను' అనే భయాన్ని ఎలా తప్పించుకోగలడు. నేను అసలు పుట్టానా? అడిగి చూడు. అప్పుడు బోధపడుతుంది. ఆత్మ ఎప్పుడూ వున్నదే. పుట్టిన దేహం, ఆలోచనలతో సహా కరిగిపోతుంది. ఈ ఆలోచనల పుట్టుకే సర్వ అనర్థాలకు కారణం అని తెలుసుకోవాలి. ఈ తలపుల మూలం కనిపెట్టాలి. అప్పుడు నీవు నిత్య సన్నిహితమైన అంతరాత్మలో సుస్థిరంగా వుండి, జన్మభావం నుండి మరియు మరణభయం నుండి విముక్తుడవు అవుతావు.

"అదెలా?" అన్నాడు మరొక శిష్యుడు.

మ: అనేకమైన పూర్వజన్మలలో కూడగట్టుకున్న వాసనలే ఆలోచనలు. వాటి విధ్వంసమే లక్ష్యం. వాసనలతో కూడగట్టుకున్న వాసనా విముక్తమైన స్థితియే ఆద్య, తొలి స్థితి, శాశ్వత నిర్మల స్థితి కూడా.

భ: నాకింకా స్పష్టం కాలేదు.

మ: నిత్యమైన ఆత్మ అందరికీ తెలుసు. ఎంతమంది చనిపోతూ వుండడం తాను చూడడంలేదు? అయినప్పటికీ, తాను శాశ్వతుడవనే అనుకుంటాడు. ఎందుకంటే, అది సత్యం కాబట్టి. ఇష్టమైనా, లేకున్నా సత్యం సహజంగా

ప్రకటమవుతుంది. మనిషి చైతన్యవంతమైన ఆత్మను జడదేహంతో కలిపివేయడం వలన భ్రాంతి చెందుతున్నాడు. ఆ భ్రాంతి అంతమవ్వాలి.

భ: అది అంతం అయ్యేది ఎలా?

మ: పుట్టినది గిట్టక మానదు. భ్రాంతి అహంకారంతోపాటు పుడుతుంది. అహంకారం లేస్తూ మాయమవుతూ వుంటుంది. కానీ, సత్యానికి ఆటుపోటులు లేవు. అది నిత్యం. ఈవిధంగా అనుభవం పొందిన ఆత్మజ్ఞుడు చెప్పేది ఇదే. శిష్యుడు వింటాడు. ఆత్మను గురించి మననం చేస్తాడు. ధ్యానం చేస్తాడు. ఆత్మానుభవం పొందుతాడు. దీనిని రెండువిధాలుగా చెప్పవచ్చు.

ఆత్మ నిత్యసిద్ధం. దానిని సాధించడానికి ప్రయత్నం అక్కర్లేదు. ఆత్మానుభవం అనేది ఇప్పటికే వుంది. భ్రమను మాత్రం తొలగించుకోవాలి. గురుముఖం నుండి వెలువడిన వాక్కు తత్‌క్షణమే ఆ భ్రమను తొలగిస్తుందని కొందరు అంటారు. మరికొందరు ఏమంటారంటే, ధ్యానం మొదలైనవి ఆత్మప్రాప్తికి అవసరం అని ఇద్దరూ సరియే. దృష్టిభేదాలు వేరు అంతే.

భ: ధ్యానం అవసరమా?

మ: భూమికూడా నిరంతర ధ్యానంలో వున్నదని ఉపనిషత్తులు చెప్తున్నాయి.

భ: దానికి కర్మ ఎలా సహకరిస్తుంది? ఇప్పటికే తొలగించవలసిన చాలా బరువుకు కర్మ అదనపు బరువు కాదా.

మ: నిస్వార్థముగా ఆచరింపబడిన కర్మ మనస్సును నిర్మలము చేసి దానిని ధ్యానంలో లగ్నం చేయడానికి సాయపడుతుంది.

భ: కర్మ చెయ్యకుండా, ఎప్పుడూ ధ్యానం చేస్తే ఏమి?

మ: ప్రయత్నించి చూడు. వాసనలు నిన్ను అలా చేయనీయవు. గురువు అనుగ్రహంతో వాసనలు క్షయమైనకొద్దీ క్రమక్రమంగా ధ్యానం కుదురుతుంది. మరోవిధంగా కాదు.

## భాషణములు 81

డా. బెర్నార్డ్ బే అమెరికన్ రసాయన శాస్త్రవేత్త. ఇరవై ఏళ్ళుగా వేదాంతంలో ఆసక్తుడు. భారతంలో పర్యటిస్తూ గురుదర్శనానికై వచ్చాడు, ఆయన “అభ్యాసం చేయడం ఎలా? నేను 'జ్యోతిని' దర్శించడానికి ప్రయత్నిస్తున్నాను". అని అడిగాడు. (ఆయన స్వయంగా, ఏకాగ్రత అంటే మనస్సు ఏక విషయంలో నిష్ఠ కలిగివుండటం అని అభ్యాసమును వివరించారు) ఇప్పటివరకు ఆయన అభ్యాసం ఎటువంటిదని భగవాన్ అడిగారు.

తాను దృష్టి నాసాగ్రంపై కేంద్రీకరిస్తానని కాని తన మనస్సు తిరుగుతోందని ఆయన చెప్పాడు.

మ: మనస్సు వుందా?

మనస్సు కేవలము ఆలోచనల సముదాయమే అని మరొక భక్తుడు మెల్లగా అన్నాడు.

మ: ఆలోచనలు వున్నది ఎవరికి? మనస్సు యొక్క స్థానమును వెదకితే అది అదృశ్యమై ఆత్మ ఒక్కటే మిగులుతుంది. ఉన్నది ఆత్మ ఒక్కటే కనుక, ఏకాగ్రతకు గాని, మరొకదానికి గాని తావులేదు.

(భ: ఇది గ్రహించడం కష్టం. జపము, ధ్యానము ఇలాంటివి ఏమైనా చెప్తే సులువుగా అర్థం అవుతుంది.

'నేనెవరు' అనేది ఉత్తమమైన జపం. ఆత్మకంటే విస్పష్టమైనది ఏమి వుండగలదు? అది ప్రతిక్షణము ప్రతి వ్యక్తి యొక్క అనుభవంలో వుంది. వ్యక్తి ఆత్మను వదిలేసి బయటవున్న ఏ వస్తువునైనా పట్టుకోవడానికి ఎందుకు ప్రయత్నించాలి? ఎక్కడో, ఏదో తెలియని దానిని వెతకడం కంటే, ఇప్పటికే తెలిసివున్న ఆత్మను కనుక్కోవడానికి ప్రతివ్యక్తి ప్రయత్నించాలి.

భ: నేను ఆత్మను ఎక్కడ ధ్యానించాలి? అంటే, దేహంలో ఏ భాగంలో ధ్యానించాలి?

మ: స్వయంగా గోచరించాలి. కావలసినదల్లా అదే.

ఒక భక్తుడు మెల్లగా: “రొమ్ము కుడివైపున ఆత్మస్థానం 'హృదయం' వుంది”. అని వివరించారు.

వేరొక భక్తుడు: ఆత్మ అనుభవమైనప్పుడు తెలిసేది అక్కడే.

మ: అవును, అంతే.

భ: మనస్సును ప్రపంచంనుంచి మరల్చేదెలా?

మ: ప్రపంచం వుందా, అంటే, ఆత్మకంటే భిన్నంగా తానున్నానని ఈ ప్రపంచం చెప్తోందా? ప్రపంచం వుందని చెప్పేది నీవు. అలా చెప్పే ఆత్మను కనుక్కో.

## భాషణములు 82

సమాధి స్థితులలోని భేదములను గురించి ఎవరో ప్రశ్నించారు.

మ: ఇంద్రియాలు తమస్సులో మునిగితే అది గాఢనిద్ర, ప్రకాశంలో మునిగితే సమాధి. నిద్రిస్తున్న ప్రయాణికుడు వాహనం యొక్క కదలికలు, ఆగడం, దాని గుర్రాలను విప్పడం - కట్టడం మొదలైనవి ఎలాగైతే ఎరుగడో, సహజసమాధిలో వున్న జ్ఞాని కూడా చుట్టూ జరిగే సంఘటనలు, జాగ్రత్ స్వప్న సుషుప్తులు ఎరుగడు. ఇక్కడ నిద్ర, గుర్రాలను విప్పడం లాంటిది. గుర్రాలు ఆగడం సమాధి ఎందుకంటే, ఆగిన తరువాత గుర్రాలు కదలడానికి సిద్ధంగా వున్నట్లే, ఇంద్రియాలు పనిచేయడానికి సిద్ధంగా వుంటాయి.

సమాధిలో తల క్రిందకు వాలిపోదు. ఎందుకంటే, తాత్కాలికంగా పని చేయకపోయినా ఇంద్రియాలున్నాయి. కానీ, నిద్రలో తల వాలుతుంది. ఎందుకంటే, ఇంద్రియాలు తమస్సులో లీనమైపోయాయి. కేవల సమాధిలో ప్రాణ, మనఃక్రియలు, జాగ్రత్ స్వప్న సుషుప్తులు అన్నీ లయం అయి, సమాధికి భిన్నమైన స్థితిని తిరిగి పొందగానే, పైకిలేచి తిరిగి కార్యోన్ముఖం అవ్వడానికి సిద్ధంగా వుంటాయి. సహజ సమాధిలో ప్రాణ మనఃక్రియలు, మూడు అవస్థలు నశించి మరల తల ఎత్తవు. కానీ ఇతరులు జ్ఞానిని క్రియాశీలునిగా - తినడం, మాట్లాడడం, తిరగడం మొదలైనవి చేసేవానిగా చూస్తారు. ఆయనకు ఈ కార్యకలాపాలు తెలియవుగానీ, ఇతరులు మాత్రం ఆయన వ్యవహారాలను గ్రహిస్తుంటారు. అయితే ఈ వ్యాపారాలన్నీ ఆయన దేహానికి సంబంధించినవేగానీ, ఆయన యొక్క సత్యాత్మకు, స్వరూపానికి సంబంధించినవి కావు, ఆయన మాత్రం ఒక నిద్రిస్తున్న ప్రయాణీకుడిలానో; గాఢంగా నిద్రిస్తున్న పసిబిడ్డకు అంతరాయం కలిగించి, పాలు పట్టించి, జోకొడితే ఏమీ ఎరుగక తిరిగి పరుండేవానిలానో వుంటాడు. మరునాడు పొద్దున్నే లేచి, క్రితం రాత్రి తనకు పాలివ్వనేలేదని, త్రాగకుండానే నిద్రపోయానని అంటాడు బిడ్డ. జ్ఞాపకం చేసినా బహుశా వాడునమ్మడు. సహజసమాధి అలా వుంటుంది.

“సుషుమ్నా పరే లీనా.” ఇక్కడ సుషుమ్న తపోమార్గాన్ని సూచిస్తూ వుండగా, పరానాడి మాత్రం జ్ఞానమార్గాన్ని సూచిస్తుంది.

## భాషణములు 83

సద్గురువులు భక్తుల కథలు కొన్నిచెప్తూ, శ్రీకృష్ణుడు ఏకనాథ్కి చేసిన పన్నెండేళ్ళ సేవ, పాండురంగడు సక్కుబాయిని గృహనిర్బంధం నుంచి తప్పించి, పండరిపురం చేర్చిన వైనం వర్ణించారు.

తరువాత, ఆయన 1896లో తాను మధురై నుండి తిరువణ్ణామలైకు వచ్చేటప్పుడు దారిలో విచిత్రరీతిలో ఒక మౌల్వీ మాట్లాడి, వున్నట్టుండి కనపడకుండా పోయిన గాథను స్మరించారు.

## భాషణములు 84

శ్రీ గ్రాంట్ డఫ్ భగవాన్ తో, ఓ ముంగిస వారికి తారసపడిన సందర్భం ఏదైనా వున్నదా అని ప్రశ్నించారు.

మ: అవును. అది ఆర్ద్రా, జయంతి పర్వసమయం. ఆరోజుల్లో నేను కొండపైన స్కందాశ్రమంలో వున్నాను. ఊళ్ళోంచి ఎందరో దర్శనానికై కొండపైకి వస్తున్నారు. ఆ గుంపులను నిర్భయంగా దాటుకుంటూ ఒక ముంగిస వచ్చింది. సాధారణంగా మనం చూసేవాటికంటే ఇది చాలా పెద్దది; అన్నిటిలా బూడిదరంగులా కాక ఇది బంగారువన్నెలో వుంది. మచ్చికకాని అడవి ముంగిసకు తోకపై నల్లటి మచ్చ వుంటుంది. అది దీనికి లేదు. దాంతో, ఇదేదో పెంపుడు ముంగిస అనీ, బహుశా ఆ గుంపులో ఎవరిదో అనీ అక్కడి వారు అనుకున్నారు. విరూపాక్షగుహ దాపునే పారుతున్న సెలలో పళనిస్వామి స్నానం చేస్తున్నాడు. ముంగిస నేరుగా అతని వద్దకు వెళ్ళింది. అతడు దాని వెన్ను నిమిరి ముద్దుచేసాడు. తరువాత, అతని వెనకగా అదికూడా గుహలోకి వెళ్ళి, నలుమూలలా పరికించి చూసి, మరల గుంపులో చేరి స్కందాశ్రమం వచ్చింది. నేను దాన్ని గమనించాను. ముచ్చటైన రూపం, నిర్భయంగా మెలగడం చూసి జనం ముగ్ధులయ్యారు. అది వచ్చి నా ఒడిలో కాసేపు సేద తీర్చుకుంది. ఆపై లేచి, అటూఇటూ చూసి ఆ స్థలం కలియతిరిగింది. నేను దాన్ని వెంబడించాను. ఎందుకంటే, అజాగ్రత్తగా వుండే జనం, నెమళ్ళు దానికి అపాయం కలిగించకుండా వుండాలని. అక్కడి నెమళ్ళు రెండు దాన్ని ఆసక్తిగా చూసాయి. ఈ ముంగిస వాటినేం లెక్కచేయకుండా అటూఇటూ చెర్లాడి, ఆశ్రమానికి ఆగ్నేయంగా రాళ్ళల్లోకి మాయమైంది.

## భాషణములు 85

అదే పెద్దమనిషి మహర్షిని అడిగారు: "స్మృతికి, సంకల్పానికి (ఇచ్ఛ) గల భౌతిక సంబంధం ఏమిటి? వాటికి మనస్సుతో సమన్వయం ఎలా? మ: అవన్నీ మనో వ్యాపారాలు. మనస్సు అహంకారం నుంచి, అహంకారం ఆత్మనుంచి జనిస్తాయి.

## భాషణములు 86

క్రైస్తవ మతవిశ్వాసం యొక్క నిజతత్త్వాన్ని శ్రీభగవాన్ ఇలా వివరించారు: క్రీస్తు అహంకారము. శిలువ దేహం. అహంకారానికి శిలువ వేస్తే అది నశిస్తుంది. అప్పుడు శేషించేది పూర్ణసత్, ఉనికి, "నేను, నా తండ్రి ఒక్కరే" - ఇలా శేషించేది మహత్తరమైన 'పునరుత్థానము, పునరుజ్జీవనము' అని పిలువబడుతుంది.

## భాషణములు 87

మేజర్ ఎ.డబ్ల్యూ. చాడ్విక్ అనే పరమభక్తుడైన ఆంగ్లేయుడు ఇలా అడిగాడు: "క్రీస్తును శిలువ వేస్తున్నప్పుడు 'నా దైవమా, నా దైవమా' అని ఆక్రోశించాడెందుకు? మ: అది ఆయనతోపాటు శిలువ వేయబడుతున్న ఇద్దరు దొంగలకై ప్రార్థన కావచ్చు. జ్ఞాని జీవించి వుండగానే ఇక్కడే, ఇప్పుడే మోక్షాన్ని పొందివున్నాడు. ఆయన ఎలా, ఎక్కడ, ఎప్పుడు

తన దేహాన్ని త్యజిస్తాడన్న విషయం ముఖ్యం కాదు. కొందరు జ్ఞానులు బాధపడుతున్నట్టు కనిపించవచ్చు. మరికొందరు సమాధిలో వుండవచ్చు. ఇంకొందరు మరణానికి ముందు కనబడకుండా మాయమవనూవచ్చు కానీ, అది వారి జ్ఞానంలో ఎటువంటి భేదాన్ని చూపదు. అటువంటి బాధలు కనిపించేది చూసేవానికే గాని, జ్ఞానికి కాదు. కారణం ఆయన అంతకుముందు దేహంతో ఆత్మ యొక్క నిత్య తాదాత్మ్యాన్ని అతిక్రమించాడు.

## భాషణములు 88

చాడ్విక్ ఇంకా అడిగాడు: "సెయింట్ పాల్ జ్ఞాన ప్రకాశనంలో క్రీస్తు యొక్క ప్రాధాన్యత ఏమి?"

మ: జ్ఞానం సంపూర్ణమైనది, రూపాలతో కూడనిది, ఆత్మజ్ఞానం కలిగిన సెయింట్ పాల్ తన ప్రకాశాన్ని క్రీస్తు చైతన్యంగా గుర్తించాడు.

ఈ మరి, అప్పటికి అతడు క్రీస్తు భక్తుడు కాదే?

మ: ప్రేమ, ద్వేషం ప్రధానం కాదు. క్రీస్తు చింతన వుంది కదా! అది రావణుని విషయం లాంటిది. క్రీస్తుచైతన్యం, ఆత్మానుభవం అన్నీ ఒక్కటే.

## భాషణములు 89

మ: 'కర్పూర హారతి' జ్ఞానాగ్నిచే మనస్సును కాల్చివేయడానికి సంకేతం. విభూతి అంటే శివుడు (పరిపూర్ణ సత్, ఉనికి), కుంకుమ అంటే శక్తి (చిత్,చైతన్యం).

విభూతి రెండు విధాలు: పరావిభూతి, అపరా విభూతి. పవిత్ర భస్మం అపరా విభూతి. జ్ఞానాగ్నిచేత సకల కలుషాలు దహనమయ్యాక మిగిలేది పరావిభూతి ('జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణి...'). అది కేవల స్థితి, ఉనికి.

## భాషణములు 90

(క్రైస్తవ మతంలోని) మూర్తి త్రయం అంటే వివరించారు.

దైవం - తండ్రి అంటే ఈశ్వరుడు

దైవం - పవిత్రతేజం అంటే ఆత్మ

దైవం - పుత్రుడు అంటే గురువు "ఈశ్వరో గురు రాత్మేతి మూర్తిభేద విభాగినే వ్యోమవద్ వ్యాప్త దేహాయ దక్షిణామూర్తయే నమః॥ అంటే, దైవం భక్తునికి గురు రూపంలో (దైవపుత్రుని రూపంలో) కనిపించి అతనికి పవిత్రతేజం యొక్క అంతర్యామి తత్త్వాన్ని చూపిస్తాడు.

అంటే, దైవం ఆత్మ. ఆ ఆత్మ ఎల్లెడలా వుంది. దానిని అనుభవగోచరం చేసుకోవాలి. అదే భగవత్ సాక్షాత్కారము.

## భాషణములు 91

ఒక బెంగాలీ భక్తుడు: "మనస్సును ఎలా నిగ్రహించాలి?" అని అడిగాడు. మహర్షి: 'మనస్సు' అంటే నీవు ఏమనుకుంటున్నావు?

భ: నేను భగవంతుని ధ్యానించడానికి కూర్చున్నప్పుడు ఆలోచనలు వేరే విషయాలవైపు పోతాయి. ఆ ఆలోచనలను నిగ్రహించాలని నా ఆశ.

మ: అటూఇటూ పోవడమే మనస్సు యొక్క స్వభావమని భగవద్గీతలో చెప్పబడింది. వ్యక్తి తన ఆలోచనలను భగవంతునిపై నిల్చేటట్లు చేయాలి. చాలాకాలం సాధనవలన మనస్సు నిగ్రహించబడి నిశ్చలమౌతుంది.

ఆలోచనల రూపంలో మనశ్శక్తి క్షీణించి మనస్సు దుర్బలమౌతుంది. అదే చిత్తచాంచల్యం. మనస్సును ఒకే భావనకు అంటి పెట్టుకొనేటట్లు చేస్తే శక్తి కుదురుపడి మనోబలం పెరుగుతుంది.

భ: మనోబలం అంటే అర్థమేమిటి?

మ: విక్షేపం లేకుండా ఒకే ఆలోచన మీద మనస్సు ఏకాగ్రంకాగల శక్తి.

భ: దానిని సాధించేదెలా?

మ: అభ్యాసం వలన. భక్తుడు చిత్తాన్ని భగవంతుడి మీద ఏకాగ్రం చేస్తాడు. జ్ఞానమార్గాన్ని అనుసరించే సాధకుడు ఆత్మను అన్వేషిస్తాడు. అభ్యాసంలో ఇబ్బందులు ఇద్దరికీ సమానమే.

భ: మనస్సును ఆత్మాన్వేషణమీద నిలిపినప్పటికీ, చాలాకాలం ప్రయాస పడ్డాక కూడా, వాని మనస్సు ఎలాగో తప్పించుకుంటుంది. కొంతకాలం గడిచాకగాని ఆ అనర్థం బోధపడదు.

మ: అవును. అది అలాగే ఉంటుంది. ఆత్మానుసంధానం కొత్తలో చాలాసార్లు ఆగిపోవడం, మళ్ళీ చాలా విరామం తర్వాత తిరిగి మరలుతుంది. చాలా కాలం అభ్యాసం చేసేక అది చిన్న చిన్న విరామాల తర్వాత మరలుతుంది. ఈ విధంగా చివరికి అది ఇక్కడ అక్కడ తిరగడం ఆగుతుంది. అంతవరకు అణగివున్న శక్తి అప్పుడు అభివ్యక్తమౌతుంది. సాత్త్విక మనస్సులో ఆలోచనలు ఉండవు. రాజసిక మనస్సు నిండా ఆలోచనలే. జీవన స్రవంతిలో సాత్త్విక మనస్సు కరిగిపోతుంది.

భ: ఆ ఆలోచనా ప్రవాహం తాకిడికి ముందే మనస్సును మళ్ళించి దూరంగా ఉంచడానికి వీలవుతుందా?

మ: అవును. ఆ ప్రవాహం ముందు ఉన్నదే.

## భాషణములు 92

ఒక దర్శనార్థి ఇలా అన్నారు: "వ్యక్తి స్థూల వస్తువుల ధ్యానాన్ని మాత్రమే అభ్యసించాలి. కాని ఎప్పుడూ మనోనాశనం కొరకు ప్రయత్నించడం అపాయమని కొందరు అంటారు.

మహర్షి: అది ఎవరికి అపాయం? ఆత్మకంటే వేరుగా అపాయం ఉండగలదా? ఎడతెగని (అవిచ్ఛిన్నమైన) “నేను-నేను” అనే భావన ఒక అపార సాగరం. అహంకారం "నేను" - ఆలోచన దానిమీద కేవలం ఒక బుడగ, అదే జీవుడు. బుడగ కూడా నీరే. బుడగ పగిలినపుడు కలిసేది సముద్రంలోనే. అది బుడగగా ఉన్నప్పుడు కూడా అది సముద్రంలో భాగమే. ఈ స్పష్టమైన సులువైన సత్యాన్ని ఎరుగక, యోగము, భక్తి, కర్మ మొదలైన అనేక పేర్లతో అనేక విధానాలు చెప్పారు. వీటిలో ఒకటొకటి అవాంతర భేదాలు, అనేక మార్పులతో - కేవలం సాధకులను ఆకర్షించి వాళ్ళ మనస్సులను కలవరపరచడానికి చిక్కైన వివరాలతో గొప్ప నేర్పుతో అవి బోధింపబడుతున్నాయి. వివిధ మతాలు, శాఖలూ, నిగమాలు (Dogmas) ఇవన్నీ కూడా అలాంటివే. ఇవన్నీ దేనికోసం? ఆత్మను తెలిసికోవడం కోసమే కదా! కాబట్టి ఇవి ఆత్మను తెలిసికోవడానికి ఉపకరణాలు మాత్రమే.

విషయాలు ఇంద్రియగోచరాలైతే ఆ ఎరుకను ప్రత్యక్షజ్ఞానం అంటారు. ఇంద్రియ సహాయం లేకుండా ఎల్లప్పుడూ అనుభవించబడే ఆత్మకన్నా సూటియైనది వేరే ఏదైనా ఉంటుందా? నిజానికి ఇంద్రియ జ్ఞానం పరోక్షజ్ఞానం, ప్రత్యక్షజ్ఞానం కాదు. సామాన్య అనుభవంలో ఉన్న విధంగా వ్యక్తియొక్క చైతన్యమే (Awareness) మాత్రమే ప్రత్యక్షజ్ఞానం. తన్ను తాను తెలుసుకోవడానికి (ఆత్మను తెలిసికోవడానికి) వేరే సాధనలు అవసరం లేదు.

అనంతమూ, అఖండమూ, పూర్ణము అయిన “అది”, “నేను” అన్న స్ఫురణతో తన్నుతాను తెలిసికొంటుంది. ఈ "నేను" దానిమొట్టమొదటి పేరు. “ఓమ్” మొదలైనవి తర్వాత పేర్లు. ఆత్మ ఎరుక కల్గి ఉండడమే మోక్షం. "అహంబ్రహ్మాస్మి” (నేను బ్రహ్మను) అనే మహావాక్యం దీనికి ప్రమాణం. “నేను” అందరి అనుభవంలోనిదే అయితే కూడా వ్యక్తియొక్క దృష్టిని దానివైపు తీసుకురావల్సి ఉంటుంది. అప్పుడు మాత్రమే జ్ఞానోదయం అవుతుంది. కనుకనే ఋషులు, జ్ఞానులూ, ఉపనిషత్తులను బోధించవలసి వచ్చింది.

## భాషణములు 93

తమ తమ "ఆత్మ" అందరికీ తెలుసు. కాని ఆశ్చర్యకరము! వారు లేని దానిని ఉన్నదానిగానూ, విషయాలను ఆత్మకు భిన్నంగా భావిస్తుంటారు. జ్ఞాత (తెలిసికొనువాడు) ఉన్నంతకాలమే అన్ని విధాలైన జ్ఞానము (ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, అర్థాపత్తి, అనుపలబ్ధి, ఆగమ లేదా శబ్ద) ఉంటుంది. జ్ఞాత అదృశ్యమయితే అతనితో బాటు అవి అన్నీ కూడా అదృశ్యమౌతాయి. జ్ఞాత ఎంత ప్రమాణమో, అవి (జ్ఞానముల) ప్రామాణికత కూడా అంతే.

## భాషణములు 94

తన పాపములను క్షమించవలసిందని ఒకరు ప్రార్థించారు. మహర్షి దానికి "ఆ విషయంగా నీ మనస్సు నిన్ను బాధించకుండా జాగ్రత్తపడితే చాలు” అన్నారు.

## భాషణములు 95

మేజర్ ఏ.డబ్ల్యూ. చాడ్విక్ ఒక ప్రశ్న అడిగారు. శ్రీఎడ్వర్డ్ కార్పెంటర్ అను ఒక గుప్త తత్త్వవేత్త (Mystic) ఆయన ఒక గ్రంథంలో వ్రాసిన ప్రకారం "ఆయనకు ఆత్మానుభవం కొన్నిసార్లు కల్గింది. దాని ఫలితాలు కొంతకాలం వరకు ఉన్నాయి. కాని కొన్నాళ్ళకు అవి క్రమంగాపోయాయి.” అయితే శ్రీరమణగీతలో వ్రాసివుంది. "గ్రంథి ఒక మారు వీడితే, కలకాలమూ ఆ ముడి విడిపోయినట్లే” మరి శ్రీకార్పెంటర్ విషయంలో ఆత్మానుభవం తర్వాత కూడా బంధం గట్టిగా పట్టుకొన్నట్లు కనిపిస్తోంది. అది ఆవిధంగా ఎలా ఉండగలదు?"

భగవాన్ “కైవల్యనవనీతము” నుండి ఉదహరించారు. "శిష్యుడు, పూర్ణజ్యోతి స్వరూపమూ, ఏకమూ, అఖండమూ అయిన సచ్చిదానంద స్థితిని అనుభవగోచరము గావించుకొన్న తర్వాత గురువునకు శరణాగతుడయి గురువు ఋణం తీర్చుకొనే విధము సెలవీయవలసిందని సవినయంగా వేడుకొన్నాడు. ఆ గురువు ఇలా చెప్పారు. "నిత్యము, అఖండమూ అయిన ఆనందంలో స్థిరంగా నీవు వుండటమే నాకు బహుమానం. ఆ స్థితి నుండి దిగ జారకు",

భ: ఒక మారు పరమానందం కలిగాక, తిరిగి దానికి దూరమెలా అవుతాడు?

మ: అది సంభవమే. చిరకాలంగా వానిని అంటిపెట్టుకొని ఉన్న పూర్వ వాసనలు, వానిని వెలుపలికిలాగి, అజ్ఞానంలో ముంచి వేస్తాయి.

భ: అవిచ్ఛిన్నమైన ఆనందంలో స్థిరంగా ఉండటానికి ఆటంకాలు ఎలాంటివి? వానిని ఎలా తొలగించగలం?

మ: ఆ ఆటంకాలు ఇవి:

1. అజ్ఞానం: తన నిర్మలస్థితిని మరచిపోవడం.

2. సంశయం: తన అనుభవం సద్వస్తువుకు సంబంధించినదా కాదా అన్న విస్మయం.

3. విభ్రమం: "నేను దేహము – ఈ జగత్తు సత్యము" శ్రవణ - మనన - నిదిధ్యాసనములచే ఈ ఆటంకాలను దాటవచ్చు.

భగవాన్ ఇంకా ఇలా వివరించారు:

అనుభవం తాత్కాలికమూ లేదా శాశ్వతము అని చెప్పబడుతుంది. మొదటి అనుభవం తాత్కాలికం. అది నిదిధ్యాసనం వలన శాశ్వతం కావచ్చు. ప్రథమ అనుభవంలో బంధం పూర్తిగా నశించదు. అది సూక్ష్మంగా వుండి క్రమంగా దృఢమౌతుంది. కాని శాశ్వత అనుభవంలో బంధం పూర్తిగా నశించి మరల తలెత్తదు. శ్రీమద్భవద్గీతలోని "యోగభ్రష్ట" పదము ఆ పూర్వదశకు చెందిన వ్యక్తులను సూచిస్తుంది.

భ: అలా అయితే తత్త్వశ్రవణం కొద్ది మందికే ఉద్దేశించినదా?

మ: శ్రవణం రెండు విధాలు:

గురువు చెప్పి, వివరించిన తత్త్వమును వినుట సాధారణ శ్రవణం. కాని “నేనెవరు?” అని తన్ను తానే ప్రశ్నిస్తూ శోధించి, సమాధానం తనలోనే అవిరళమైన, అహంస్ఫురణగా (అవిచ్ఛిన్నమైన నేను-నేనుగా) కనుక్కోవడం సరియైన శ్రవణం.

ఈ అనుభవాన్ని మననం చేయడం రెండవదశ. దీనిలో ఏకాగ్రంగా ఉండడం. నిదిధ్యాసనం మూడవదశ.

భ: తాత్కాలిక అనుభవాన్ని “సమాధి” అనవచ్చా?

మ: అనకూడదు. అది మూడవదశలోనిది.

భ: అయితే తత్త్వశ్రవణం కూడా కొద్దిమందికే పరిమితమైనట్లు కనిపిస్తోంది.

మ: సాధనచేసే వారు రెండు రకాలు-కృతోపాసకుడు, అకృతోపాసకుడు. కృతోపాసకుడు నిశ్చల భక్తితో దృఢతాత్పర్యం వలన వాసనలను ముందుగానే దాటి వుండడం వలన నిర్మలమైన మనస్సుతో ఒక విధమైన అనుభవమును పొంది ఉన్నవాడే కాని ఇంకా యథార్థ్య తత్త్వమును తెలిసికొనలేదు. సమర్థుడైన గురువు బోధించగానే అతనికి అనుభవం సిద్ధిస్తుంది.

అకృతోపాసకుడు గమ్యం చేరడానికి గొప్ప ప్రయత్నం చేయవలసి వుంది. శ్రవణం, మననం, నిదిధ్యాసనం వానికెలా సాయపడగలవు?

ఆ మూడు ఉపాసనా భాగాలు, ఉపాసన సత్యానికి అతిదగ్గరి మార్గము. అది చివరికి ఆత్మానుభవంగా పరిణమిస్తుంది.

నాల్గవదశ మోక్షంలో చివరిది. అక్కడకూడా స్థితిని అనుసరించి కొంత విభాగం చెయ్యబడింది.

ఆ విభాగం ఇది:

1. బ్రహ్మవిత్

2. బ్రహ్మవిద్వరుడు.

3. బ్రహ్మవిద్వరీయుడు.

4. బ్రహ్మవిద్వరిష్టుడు. కాని నిజానికి వారందరూ జీవన్ముక్తులే.

## భాషణములు 96

మేజర్ ఏ.డబ్ల్యూ. చాడ్విక్: తమకు విశ్వచైతన్య స్ఫురణ లేదా సమష్టి జ్ఞానం (cosmic consciousness) ఆత్మానుభవ స్వభావం ఎలాంటిది?

మహర్షి: మెరుపువలె వచ్చింది అంటే మెరుపువలె పోతుంది. ఆది ఉంటే అంతముంటుంది. నిత్యసన్నిహితమైన (ఎప్పుడూ నిలిచివున్న) జ్ఞానం అనుభవంలోకి వస్తే అది శాశ్వతమౌతుంది. చైతన్యము ఎప్పుడూ మనతోనే ఉన్నది. "నేనున్నాను" - అని ప్రతివ్యక్తికి తెలియును! ఎవ్వడూ కూడా తన ఉనికిని తాను శంకించడు. గాఢనిద్రలో ఉన్నవాడు ఎరుక లేక ఉంటాడు. మేల్కొనినపుడు అతడు ఎరుకలో ఉన్నట్లు కన్పిస్తాడు. కాని అతడు ఒక్కడే. నిద్రించిన వానిలోనూ, ఇప్పుడు మేల్కొనిన వానిలోనూ ఎట్టి మార్పులేదు. గాఢనిద్రలో అతడు తన దేహాన్ని ఎరుగడు. దేహజ్ఞానం లేదు. జాగ్రదావస్థలో అతడు తన దేహాన్ని ఎరుగును. దేహజ్ఞానం ఉంది. అంటే దేహజ్ఞానం యొక్క పుట్టుకలో భేదముంది. కాని సత్యచైతన్యంలో ఎలాంటి మార్పులేదు. దేహము, దేహజ్ఞానము కలిసి ఆవిర్భవించి కలిసి అణగిపోతాయి. గాఢనిద్రలో ఎలాంటి పరిమితులు లేవనియు, జాగ్రదావస్థలో పరిమితులు ఉన్నాయని మాత్రమే వీని అన్నిటియొక్క సారాంశము. ఈ పరిమితులే బంధము. "దేహము నేను" అనే భావనే తప్పు. "నేను" అనే ఈ మిథ్యాభావన పోవాలి. నిజమైన "నేను" అనే భావన ఎప్పుడూ ఉంది. అది ఇప్పుడు - ఇక్కడ ఉంది. అది ఎప్పటికీ కొత్తగా వచ్చేది కాదు. మళ్ళామాయమయ్యేది కాదు. అది ఎల్లప్పుడూ స్థిరంగా ఉండితీరాలి. కొత్తగా కనిపించేది నశిస్తుంది కూడా. గాఢనిద్రను మెలుకువతో పోల్చిచూడు. ఒక అవస్థలో (దశలో) దేహం కనిపిస్తుంది. కాని రెండవ దానిలో కనిపించదు. కాబట్టి ఈ శరీరం నశించేది. చైతన్యము పూర్వమే ఉన్నది. ఈ శరీరం నశించేక కూడా ఉంటుంది. నిజానికి "నేను ఉన్నాను" అని చెప్పనివాడు లేడు. "నేను దేహము" అనే భ్రాంతితో కూడిన జ్ఞానమే అన్ని అనర్థాలకు కారణము. ఈ భ్రాంతిసహిత జ్ఞానము పోయి తీరాలి. అదే ఆత్మానుభవము. ఆత్మానుభవం కొత్తగా సంపాదించేది కాదు. అది కొత్త విద్య కూడా కాదు. కప్పిన ముసుగు తొలగించడమే కర్తవ్యము.

మేజర్ చాడ్విక్: నా ప్రయత్నం దేహం వదల్చుకుందామనే.

మహర్షి: వస్త్రాలనైతే వదల్చుకొని ఒంటరిగా, స్వేచ్ఛగా ఉండవచ్చు. ఆత్మకు హద్దులు లేవు. అది దేహానికి పరిమితం కాదు. దేహాన్ని వదల్చుకోవడం ఎలా? దానిని ఎక్కడ వదలగలవు? అది ఎక్కడ ఉన్నా అది అతనిదే.

చా: (నవ్వుకున్నాడు)

మ: పరమసత్యం చాలా సరళమైనది. మొట్టమొదటి స్థితిని మించి మరేమీలేదు. చెప్పవలసినదంతా ఇదే. వింత ఏమిటంటే, ఇంత సరళ సత్యాన్ని చెప్పడానికి ఎన్ని మతాలు, ఎన్ని సిద్ధాంతాలూ, విధానాలూ, వాదవివాదాలూ! ఎంత దయనీయస్థితి! ఎంత దయనీయస్థితి!

చా: కానీ జనులు సరళత్వంతో తృప్తి చెందరు. వారికి క్లిష్టమైనవి కావాలి.

మ: అవునవును. వారు కోరేవి సందిగ్ధాలూ, విపులాలూ, ఆకర్షణీయాలా, అందుకే అన్ని మతాలు పుట్టుకొచ్చాయి. అందులో ప్రతి ఒక్కటీ క్లిష్టమే. ప్రతీ మత సిద్ధాంతానికి అనుయాయులూ, ప్రత్యర్థులూ చాలామంది.

ఉదాహరణకు భగవంతుడు ఎక్కడో సుదూరమైన స్వర్గంలో ఉన్నాడని, సహాయం లేకుండా మనము ఆయనను చేరలేమని చెప్పకపోతే సామాన్య క్రైస్తవుడు తృప్తి చెందడు. ఆ దైవాన్ని ఒక్క క్రీస్తే ఎరుగును. అక్కడికి దారి చూపగలవాడు క్రీస్తు ఒక్కడే, వేరుకాదు. కనుక క్రీస్తును పూజించు. రక్షించబడు. ఇది వారి ధోరణి. ఆ సరళ సత్యం - "స్వర్గరాజ్యం ఉన్నది నీలోనే" ("The kingdom of heaven is within you") అన్నది జ్ఞప్తి చేస్తే, అతడు సంతృప్తి చెందక ఆ వాక్యానికి సంకీర్ణమైన, సంక్లిష్టమైన అర్థాలను వల్లిస్తాడు. పరిణత బుద్ధిగలవారు మాత్రమే సరళమైన సత్యాన్ని చాలా స్పష్టంగా గ్రహించగలరు.

ధ్యానం చేస్తూ ఉండగా అప్రయత్నంగా ఏదో తెలియని భయం వేస్తోందని మేజర్ చాడ్విక్ చెప్పారు. అతడికి స్థూలదేహం నుండి ఆత్మ వేరు చేయబడుతోందనే భావన వలన భయం కల్గుతోందని అనుకొన్నాడు.

మ: ఆ భయం ఎవరికి? ఇదంతా దేహాన్ని ఆత్మతో తాదాత్మ్యము చెందించే అభ్యాసం వలన కల్గినదే. స్థూలదేహం నుండి ఆత్మ వేరుచేయబడిందను అనుభవం చాలాసార్లు కల్గితే ఈ అపరిచితమైన భయం పోతుంది.

## భాషణములు 97

అంబాలా నుండి వచ్చిన శ్రీ రామచందర్ ఇలా అడిగారు: "హృదయం ఎక్కడ ఉంది? ఆత్మానుభవం ఏమిటి?"

మహర్షి: హృదయము శారీరకము కాదు. అది ఆధ్యాత్మికము. హృదయం = హృత్ + అయం = కేంద్రం ఇదే. దానిలోనే ఆలోచనలు పుట్టి, దానిపైనే జీవించి, దానిలోనే లయిస్తాయి. మనస్సులో ఉన్నవి ఆలోచనలే. అవి ప్రపంచాన్ని రూపొందిస్తాయి. అన్నిటికీ కేంద్రం హృదయం." యతోవా ఇమాని భూతాని జాయన్తే" (దేని నుండి ఈ జీవులన్నీ పుట్టుచున్నవో) అది బ్రహ్మము అని ఉపనిషత్తులలో చెప్పబడింది. అదే హృదయం. బ్రహ్మము హృదయమే.

భ: ఆ హృదయాన్ని అనుభవగోచరం చేయడం ఎలా?

మ: ఎవరికైనా ఆత్మానుభవం లేని క్షణం ఉండదు. ఎవడూ తను ఆత్మకు భిన్నమని ఒప్పుకోడు. వాడే ఆత్మ. ఆత్మయే హృదయం.

భ: నాకది స్పష్టంగాలేదు.

మ: నీవు గాఢనిద్రలోనూ ఉన్నావు. మెలుకువలోనూ ఉన్నావు. ఈ రెండవస్థలలోనూ ఉన్నది ఆ నీవే (ఆత్మయే). భేదం ఈ ప్రపంచాన్ని తెలుసుకోవడంలోనూ, తెలిసికోకపోవడంలోనూ మాత్రమే ఉంది. ప్రపంచం మనస్సుతో ఉదయిస్తుంది. మనస్సుతో అస్తమిస్తుంది. ఉదయించేది, అస్తమించేది ఆత్మకాదు. మనస్సును పుట్టించి, దానిని పోషించి, లయం చేసేది ఆత్మ, అది మనస్సుకు భిన్నమైనది. వీని అంతస్సూత్రం, మరియు ఆధారం ఆత్మ. నీవు ఎవరు? - అని అడిగినపుడు నీవు నీ చేతిని గుండెకు కుడివైపున ఉంచి “నేనున్నాను" అని అంటావు. అక్కడ నీవు ప్రయత్నం లేకుండా ఆత్మను చూపిస్తున్నావు. ఆ విధంగా ఆత్మ తెలియబడుతుంది. కానీ జీవుడు, మనస్సును మరియు దేహమును ఆత్మ అని భ్రమించి దుఃఖితుడౌతున్నాడు. ఈ భ్రాంతి, భ్రమ లేదా అజ్ఞానము వలన కలిగినదే. చేయవలసినదంతా ఏమిటంటే అజ్ఞాన నివారణ మాత్రమే. అజ్ఞాన నివృత్తి ఆత్మానుభవాన్ని కల్గిస్తుంది.

భ: మనస్సును నిగ్రహించేదెలా?

మ: మనస్సు అంటే ఏమిటి? అది ఎవరిది?

భ: మనస్సు ఎప్పుడూ చంచలంగా ఉంటోంది. దానిని నేను నిగ్రహించలేను.

మ: అక్కడాఇక్కడా తిరగడం మనస్సు యొక్క స్వభావం. నీవు మనస్సువు కాదు. మనస్సు లేవడం మళ్ళీ అణిగిపోవడం జరుగుతూ ఉంటుంది. అది అశాశ్వతం, క్షణభంగురం. కాని నీవు శాశ్వతుడవు. ఆత్మ తప్ప వేరేదీ లేదు. ఆత్మలో నిలబడడమే ప్రధానం. మనస్సును పట్టించుకోవద్దు. దాని మూలం వెదికితే, ఆత్మను అబాధితంగా వదిలివేసి అది మాయమౌతుంది.

భ: అలా అంటే ఎవరూ కూడా మనస్సును నిగ్రహించే ప్రయత్నం చెయ్యనక్కరలేదా?

మ: నీవు ఆత్మజ్ఞుడవైతే నిగ్రహించేందుకు మనస్సు ఉండదు. మనస్సు మాయం కావడంతో ఆత్మగోచరిస్తుంది. ఆత్మజ్ఞానిలో మనస్సు క్రియాపరంగానూ, నిష్క్రియంగానూ ఉండవచ్చు. వానికి మిగిలింది 'ఆత్మ' ఒక్కటే. జగత్తూ, మనస్సు, దేహమూ ఆత్మకు అన్యంగా లేవు. అవి ఆత్మనుండే వెలువడి ఆత్మలోనే లీనమౌతాయి. అవి ఆత్మకు భిన్నంగా ఉండవు. అవి ఆత్మకు అన్యంగా ఉండగలవా? కేవలము ఆత్మయొక్క ఎరుక కల్గిఉండు. ఈ నీడల గురించి చింత ఎందుకు? అవి ఆత్మను ఎలా బాధించగలవు?

## భాషణములు 98

శ్రీభగవాన్ ఇంకా ఇలా వివరించారు: ఆత్మ హృదయమే. హృదయం స్వయం ప్రకాశము. హృదయం నుండి చైతన్యం ఎగసి మనస్థావరమైన మెదడుకు ప్రసరిస్తుంది. ఈ జగత్తు మనస్సుతో చూడబడుతుంది. మనస్సు ఆత్మనుండి వెలువడిన చైతన్యకాంతిని ప్రతిబింబిస్తుంది. ఈ విధంగా మనస్సు ప్రకాశించబడి, ప్రపంచాన్ని గుర్తిస్తుంది. ఈ మనస్సును లోపలికి, చైతన్య ప్రకాశము యొక్క మూలానికి త్రిప్పితే విషయజ్ఞానం ఆగి, ఆత్మ మాత్రము హృదయముగా ప్రకాశిస్తుంది.

చంద్రుడు ప్రకాశించేది సూర్యతేజస్సు యొక్క ప్రతిఫలనమే. సూర్యుడు అస్తమించిన తర్వాత ఆ వస్తువులను చంద్రకాంతి ప్రకాశింపచేస్తుంది.

సూర్యుడు ఉదయించిన తర్వాత వెల్లబోయిన చంద్రబింబం ఆకాశంలో కనిపిస్తున్నా ఎవ్వరికీ చంద్రుని అవసరం ఉండదు.

మనోహృదయాల విషయం కూడా అలాంటిదే. మనస్సు, స్వయంజ్యోతియైన ఆత్మనుండి వచ్చే కాంతిని ప్రతిబింబించడం ద్వారా విషయాలను చూడడానికి ఉపయోగపడుతుంది. అది లోపలికి త్రిప్పబడి నప్పుడు కాంతి మూలము స్వయంగా ప్రకాశించి పగటి సమయంలో చంద్రునిలా, మనస్సు అస్పష్టమై నిరుపయోగమౌతుంది.

## భాషణములు 99

ఒక సన్యాసి ఇలా అడిగారు: "ఆత్మ మనస్సుకు అతీతమనియు, అయినప్పటికి మనస్సుతో ఆత్మానుభవం కలుగునని చెప్పేరు. "మనోన మనుతే మనసానమతం', 'మనసైవేదమాప్తవ్యం'. (మనస్సు దానిని తలంపజాలదు. అది మనస్సుచేత తలంప సాధ్యము కాదు. దానిని తెలుసుకోగల్గేది మనస్సు ఒక్కటే) ఈ విరుద్ధమైన వాక్యాలను సమన్వయించడం ఎలా?"

మహర్షి: మృతమనస్సుతో, అనగా, ఆలోచనా రహితమైన (సంకల్ప వికల్పరహితమైన) లోపలకు మరలించబడిన మనస్సుతో ఆత్మ అనుభవ గోచరమౌతుంది. అప్పుడు మనస్సు తన మూలమును చూచి "అదే" అవుతుంది. అది విషయమును చూచు విషయి (కర్త)వంటిది కాదు. దీపం చీకటిగదిలో ప్రకాశం నింపుతుంది. కళ్ళకు వస్తువులను

కనబడేటట్లు చేస్తుంది. కాని సూర్యోదయం తర్వాత దీపంతో పని ఏమిటి? స్వయంప్రకాశమానమైన సూర్యుని వైపు నీకళ్ళను త్రిప్పితే చాలు,

మనస్సు విషయం కూడా అంతే. విషయాలను చూడడానికి మనస్సుయొక్క ప్రతిబింబిత కాంతి అవసరం, హృదయాన్ని చూడడానికి మనస్సును దానివైపు త్రిప్పితే సరిపోతుంది. అప్పుడు మనస్సు నశించి హృదయం ప్రకాశిస్తుంది.

## భాషణములు 100

తర్వాత శ్రీభగవాన్ కైవల్యం నుండి కొన్ని శ్లోకాలను చదివి వివరించారు.

A

పరమాత్మ

(పూర్ణజ్ఞానము; సాక్షి; స్వప్రకాశమూలము; హృదయము, ఆత్మ)

↓

వ్యక్తి

(జీవుడు, ప్రతిబింబిత కాంతి కలిగి త్రిగుణాత్మకమైన వృత్తులను తెలియువాడు. అవ్యక్త ఆత్మాభాస రూపి)

↓

అంతర్గతమగు బుద్ధి, బహిర్ముఖమగు మనస్సు (బుద్ధివృత్తిలో గూడిన మనస్సు అంకురముగా ప్రతిఫలించినకాంతి.ఇదే అంత:కరణము)

విషయరూపములగు వృత్తులు +సామాన్యజ్ఞానము

రెండూ కలిసినది మనం చూస్తే జగత్తు.

B

ఆత్మ (శుద్ధజ్ఞానము)

↓

జీవుడు (ప్రమాత = జ్ఞాత = తెలిసికొనేవాడు)

↓

బుద్ధి మనస్సు

↓

(ప్రమాణము = విషయ జ్ఞానము)

విషయరూపంలో కనిపించ (వృత్తి చైతన్యము)
+వృత్తులు జ్ఞానము (ఫలచైతన్యము)

మనోవృత్తులు బాహ్యవిషయాలుగా రూపొందుతాయి. ఆ వృత్తులపై ప్రతిఫలించిన చైతన్యము విషయములను తెలిసేటట్లు చేస్తుంది. ఇప్పుడు మనోవృత్తులను ఉపేక్షించి వానిని భాసింపచేసే వెలుగును గమనించు. అప్పుడు మనస్సు నిశ్చలమైన వెలుగు స్వయం ప్రకాశమానంగా మిగులుతుంది. అలలవలె కదిలే మనస్సు (అంటే, క్రియాశీలమైన

రజస్సులోనూ, అంధకారమైన తమస్సుతోనూ కూడిన మనస్సు). సాధారణంగా మనస్సు అని తెల్పబడుతుంది.. అది రజస్తమోరహితమైనప్పుడు శుద్ధమై స్వయం ప్రకాశమానంగా ఉంటుంది. అదే ఆత్మానుభవం. అందువలన మనస్సు ఆత్మానుభవానికి సాధనమని చెప్పబడింది.



**C**

శుద్ధచైతన్యము
(శాశ్వతము లేక నిత్యసాక్షి)
↓
అంతఃకరణము
అంతరింద్రియము + ప్రతిబింబితకాంతి (జీవుడు:ప్రమాత)
↓
కాంతితోకూడిన వృత్తులు ప్రమేయములు = జ్ఞేయములు దానిలో విషయాలు స్థూలములు, ఇక ఆభాసకాంతి ఫలచైతన్యమనబడతుంది.

**D**

జీవుని అంతరింద్రియము (అంత:కరణము)లోని అంశాలు:

| సత్త్వ | రజస్సు | తమస్సు |
|---|---|---|
| జ్ఞానము | మనోవృత్తులు | స్థూలవిషయములు |
| కాంతి | బుద్ధి | జగత్తు |
| | | మనస్సు |

ఇది వ్యష్టి విషయము సమష్టిపరంగా:

సమష్టి అంత:కరణము (నిత్యుడు)

| సత్త్వ | రజస్ | తమస్ |
|---|---|---|
| జగత్ప్రభువగు ఈశ్వరుడు | వ్యక్తిగత జీవుడు | విశ్వము |

**E**

| బ్రహ్మము : సత్ | చిత్ | ఆనందము |
|---|---|---|
| ఉనికి | జ్ఞానము | పరమసుఖము |
| (ఆధారము, లేక అధిష్ఠానము) | విశేషము అనబడు = మాయాకృత భేదము | |

సహజము కృత్రిమము

విశ్వము లేక జగత్తు విషయబాహుళ్యము

మాయసత్తును కప్పివేయలేదు. కాని అది చిత్తును, ఆనందమును మభ్యపరచి వానిని విశేషములుగా (విషయములుగా) కనిపించేటట్లు చేస్తుంది,

**F**

రజ్జు (త్రాడు) మసక వెలుతురులో పాముగా కనిపిస్తుంది

↓ ↓ ↓

ఉనిక మాయ (భ్రాంతి) కల్పిత విషయము పైన (**E**)లో చెప్పినట్లు)

**G**

సత్ = స్థితి = ఆధారం. జీవినుండి పుట్టే విషయము అనగా, జీవుడు. అతడు అజ్ఞానముచే ఆవరించబడి తనను స్థూలదేహమనుకుంటాడు. ఈ అజ్ఞానానికి కారణం ఆత్మ విచారణ చేయకపోవడమే. నిజానికి జీవుడు జ్ఞానస్వరూపుడే. అయినా అజ్ఞానము వలన స్థూలదేహంతో మిథ్యాతాదాత్మ్యము కలుగుతోంది.

**H**

మరల మహర్షి దానిని ఎర్రగా కాలిన ఇనుపగుండుతో పోల్చి వివరించారు. (తప్త అయ: పిండవత్)

ఇనుపగుండు అగ్నిలో కాగి ఎర్రగా కాలిన ఇనుపగుండు (తప్త అయ: పిండం) అవుతుంది. ఈ ప్రపంచము శుద్ధచైతన్యముతో కలిసి జీవునిగా (వ్యక్తిగా) అవుతుంది.